# శ్రీదేవీభాగవతము

౧-౨-౩ స్కంధములు

కవిసమ్రాట్

నోరి నరసింహశాస్త్రి



సాహితీసమితి రేపల్లె

రు. ౫/-

# శ్రీ సూక్తి

శ్రీ మహాస్వామి కల్యాణ దేశిక పూజ్యపాదుల సంకల్పశక్తి సహస్రపద దేశనాస్రోతమున నా శక్తి సామయిక సంప్రదాయ శిష్యానుగతమై విరాజిల్లును. వికాసవృష్టికనాటినుండి సహస్రశీర్ష మయిన శక్త్యుల్లాసము మంత్రచైతన్య మను వ్యాప్తము చేయును. జన్మః కర్మవిశేషము లొకటొకటి కలసి చైతన్యస్ఫురణము నీతి రీతి గతి మతుల స్ఫురిత స్ఫురితము చేయును. నేరి నరసింహశాస్త్రి, మహాస్వామి చరణ సన్నిధిని స్వప్నందసుందర మగు హృదయసంవాదముతో మంత్రచైతన్య ధారాసార మనుగత మధిగతము చేసికొని పంగిభణితిభూషితుడై విజ్ఞాని యయ్యెను. నేరి విజ్ఞానితలో గురుకటాక్షస్వీకృతి విశిష్టత నిదానము.

ఈరచన "దేవీకృతచోదనము, ఆత్మాచార్యానాదేశము." అప్రతిగృహీత, అనాథభోజి, అలుప్తవినయుడు నరసింహశాస్త్రి దేవీపూజానిత్య పవిత్రపాణి, శ్రీదేవి భాగవతము రచయిత. దేవీభాగవతము మహాపురాణము. పురాణ మర్థప్రవణము సుహృత్సమ్మతము నని సహృదయుల హార్దభావ. ఈరచనలో నరసింహశాస్త్రి ప్రత్యభిజ్ఞేయములు చేసికొనిన శబ్దార్థములు పురాణార్థపరతంత్రము లగుట కింత ప్రసాదము కలదైనవి. పురాణార్థము గంభీర మయినను తగిన ప్రసన్నత కలిమి పాఠక పాఠకులకు గాంభీర్యవేదిత నీయగలదు. రామాయణము గేయపాఠ్యమధురము. ఇదియు గేయసంపద పాఠ్యసంపద కలదై వానించును.

శ్రీ వ్యాసభట్టారకుడు సర్వామ్నాయసార మగు గాయత్రిని శ్రీదేవి భాగవతమున నిరూపించెను. అనుపనీతుల కపరిచితము, నుపనీతులకు నుపరిచిత మయిన గాయత్రి ప్రకటరూప. గుప్తభావ గాయత్రి దేవీదీక్షితులకే తెలియును. నరసింహశాస్త్రి దేవీదీక్షుడు. గాయత్రీసంపద కల దేవీభాగవత మాంధ్రమున నాభా షించుట నరసింహశాస్త్రికే తగును. ఆదేవీబాపనులు, ఇతరేతరపారమ్య మంగీకరించు సభినివిష్టులు, దేవీసమయాచార విచారచతురులు, దేశనాసధిక్కృతులు, కవియశః ప్రార్థులు దేవీభాగవత మన్యరీతిలో పలుకుట దేవీసంకల్పము కాదు. ఈ నిశ్చితము దేవీభాగవతరచయిత వ్యాసుని హృదయగతము. కావుననే నరసింహశాస్త్రిరచన "దేవీకృతచోదనము".

సంస్కృతభాషా నిబద్ధము లయిన గ్రంథములు నిత్య పారాయణ యోగ్యములు. అట్టి యోగ్యత కా కర్తల విశిష్టత హేతువు. ఆంధ్రభాషలో పారాయణ యోగ్య గ్రంథ ముదయింపలేదు. నరసింహశాస్త్రి యట్టిగ్రంథ ముదయింపజేసినాడు. ఇంటింట నోట నోట శ్రీదేవీభాగవత మిక వెలసి తీరును.

శ్రీ దేవీభాగవతమును శ్రీదేవీభాగవతముగా జూచి శ్రీదేవీభాగవతులు శ్రీదేవీభావ వతు లగుదురుగాత!

"శ్రీ కల్యాణ గురోః సాక్షాత్ దీక్షాం ప్రాప మహాప యః,
తస్యేయం కృతిస స్ఫూర్తా లోకే జీయా చ్ఛ్రుతి స్సదా."

ఐమ్ముల్లమంచక మాధవరామశర్మ

వికృతి నిజాషాఢ శుద్ధ
పంచమి, గురువారము

---

# కృతజ్ఞత

ఈ గ్రంథ ప్రచురణమునకు నన్నుఁ బ్రోత్సహించిన శ్రీ ఐమ్ముల్లమంచక మాధవరామశర్మకును, దీనిని నిర్దుష్టముగ సిద్ధము చేయుటకు నాకు సర్వవిధముల సహాయపడిన శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రికిని నేను కృతజ్ఞుఁడను.

నోరి నరసింహశాస్త్రి

నో. న. శా.

వికృతి నిజాషాఢ
శుద్ధ పంచమి

---

# విషయ సూచిక

## ప్రథమ స్కంధము



## ద్వితీయ స్కంధము

శ్రీ దేవీభాగవతమును శ్రీదేవీభాగవతముగా జూచి శ్రీదేవీభాగవతులు శ్రీదేవీభాగవతు లగుదురుగాత!

"శ్రీ కల్యాణ గురోః సాక్షాత్ దీక్షాం ప్రాప్య మహాప యః,
తస్యేయం కృతిస న్సార్థా లోకే జీయా త్కృతి స్సదా."

జమ్మలమడక మాధవరామశర్మ

విక్రృతి నిజాషాఢ శుద్ధ
పంచమి, గురువారము

---

# కృతజ్ఞత

ఈ గ్రంథ ప్రచురణమునకు నన్నుం బ్రోత్సహించిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మకును, దీనిని నిర్దుష్టముగ సిద్ధము చేయుటకు నాకు సర్వవిధముల సహాయపడిన శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రికిని నేను కృతజ్ఞుఁడను.

నోరి నరసింహశాస్త్రి

రేపల్లె

విక్రృతి నిజాషాఢ
శుద్ధ పంచమి

---

# విషయ సూచిక

## ప్రథమ స్కంధము



## ద్వితీయ స్కంధము

## తృతీయ స్కంధము

శ్రీః

# శ్రీ దేవీ భాగవతము

## ప్రథమ స్కంధము

సర్వ చైతన్య రూపాం తా
మాద్యాం విద్యాం చ ధీమహి,
బుద్ధిం యా నః ప్రచోదయాత్.

శా. శ్రీరూపంబును భారతీప్రథయు గౌరీనామముం దాల్చి, లో
కారాధ్యం బయి వెల్గుచున్, మునుల కేకాకారతం దోఁచు బో
ధారామంబు, సమస్త భూతతతి చైతన్యాత్మసత్త్వంబు, వి
ద్యారూపం బగు నాద్య శక్తి మదిలో ధ్యానింతు నశ్రాంతమున్.

శా. ఆ నారాయణుఁడే సుమేరుగిరి మూలాధారమై నిల్చ, నీ
శానాంశం బల శంకరుండు కటకస్థానంబుగా మించెఁ, గ
ల్యాణానందుఁడు భారతీశ్వరుఁడు శృంగాలంకృతిం బొల్చె, న
ద్దానిం గొల్తుఁ ద్రిమూర్తి నాత్మగుచు గోత్రక్షోణిభృ ద్రత్నమున్.

తే. ప్రణవరూపుఁడు లక్ష్మిశ్రీఁ బరివృతుఁ డయి
కేవలము మాయుఁడై కామకేలితుండు
శంకరాత్మజుఁ డఖిల వశంకరుండు
గణపతిని సంస్మరింతు సత్కవులకవిస. ౧

శా. వేదంబుల్ విభజించి, దుర్గమములౌ వేదాంత మార్గంబులన్
భేదాధ్యాసలు తీర్చి సూత్రములచే నిర్భీకముల్ చేసి, శు
ద్ధాదర్శంబున నట్ల భారతమునం దాయర్థముల్ సూపియున్,
శ్రీ దేవీశ్రుతి విస్తరించు ఋషిమూర్తిన్ వ్యాసు సేవించెదన్. ౨

ఉ. జానకి లక్ష్మి, లక్ష్మణుఁడు చంద్రుఁడు, మారుతి రత్నమూర్తియున్,
భానుసుతుండు కల్పకము, వారణ మంగదుఁడైన దుగ్ధపా
థోనిధి రామకీర్తికథ, ధూర్వహుఁడై స్మృతిమందరంబుగాఁ
బూని మథించు నాదికవిఁ బూజితుఁ జేసెద వాక్సుమంబులన్. ౬

తే. కవులవాక్సుధ తెలుఁగునఁ జవులు గొలుప
మొదల నోరకొన్న ఋషి సన్నపదము మ్రొక్కి,
హరికథాకీర్తనాలాప నామృతాప్తిఁ
దన్మయుం డయి వెలుఁగు పోతన్నఁ గొలుతు. ౭

తే. గంగను సముద్ధరించిన ఘటము లెంత
పిన్న వయ్యును, మహిమలోఁ బెద్ద వనుచు,
నేను నా చిన్నదోయిట నించి కొలువఁ
గడఁగువాఁడ శ్రీదేవిభాగవతగంగ. ౮

శా. శ్రీదేవీ యను నక్షరత్రయము మజ్జిహ్వాగ్రవీథిన్ సదా
పాదన్యాస మొనర్చి ధింధిమి నట ద్వ్యాపారముల్ సల్పఁగా,
నీ దేహంబు త్రివిక్రమక్రమ నిరాఢోద్ధాత్మ విజ్వాయితం
బై దీపింపదె, నిండదే మనసు పూర్ణానంద దుగ్ధాబ్ధియై? ౯

## అ వ తా రి క

వ. అని శ్రీదేవీధ్యానావధానంబునఁ గృష్ణద్వైపాయనగురు పరిచింతన పరాయణుండనై, శ్రీమద్రామాయణ మహాభారత భాగవతంబులు నొడువక నుడులకు జనిజడిమం జెడలు వెట్లు సాఫల్యపడు నను స్థిర మనీష నుండు నే నా సంహితాత్రయం బేకంబై రూపొందిన శ్రీదేవీ భాగవతంబు నాంధ్రీకరింపం బూనిన నిమిత్తాదికంబు లభివర్ణింతు.

శా. శ్రీదేవీపదవృత్తి నొక్కతఱి నే శ్రీచక్రరాజార్చనా
ప్రాదుర్భూత సుశాంతితో గురుపదద్వంద్వంబు చింతించి, శ్రీ
పాదాంభోజపవిత్ర తీర్థము గ్రహింపం బోవు నా కయ్యెడన్
శ్రీదేవీభగవత్కథార్థము స్ఫురించెం దెల్లనం జెప్పఁగా. ౧౦

శా. సర్వం బిద్ది యహమ్ము సుమ్మి యనుచున్ శ్రావ్యంబుగా సృష్టికిం
బూర్వం బా వటపత్రశాయి శిశు సంబోధించు శ్రీమాతృకా
శీర్వాణీ శుభవాణిగాఁ గొనఁగ వాసిన్ నాకు శ్రోత్రద్వయిన్
బర్వంబైనవి యష్టవారకృత ఘంటానాద సిద్ధశ్రుతుల్. ౧౨

మ. అది దేవీకృతచోదనం బదియు యాత్మాచార్య నాదేశ మం
చుదితం బయ్యెను నిశ్చయంబు మది విద్యోద్యోగమై, యంత స
మ్మదభావంబునఁ బంచితిం బ్రియుని నస్మజ్జ్యేష్ఠపుత్రున్ హనూ
మ దభిఖ్యున్ గురుభక్తు, భాగవతశుంభత్సంహితం దేరఁగా. ౧౩

క. శ్రీదేవీ భాగవతము
నాదిమమంత్రము పఠించి యతిభక్తి సహా
సాదిత మా శ్రీకోశం
బాదిం బూంచితిని కరపుటాంజలిఁ బూజన్. ౧౪

క. గురువే విధి హరి హరు లని,
గురువె పరబ్రహ్మ మంచు, గుఱుతించి యెదన్,
స్మరియించి గణేశుని, గురు
చరణాంకితముగ రచింప సాగితి దీనిన్. ౧౫

శా. శ్రీవిద్యామయమూర్తియై తగు హయగ్రీవావతారంపు న
వ్యావిర్భావకథాంక ఘట్ట మగు పర్యంతంబు నా గ్రంథమున్
నే విన్పించి జగద్గురూత్తములకున్, శ్రీవారి నర్థించితిన్,
దేవా! దీనిఁ బరిగ్రహింపుఁ డని భక్తిన్ రుద్ధకంఠుండనై. ౧౬

చ. సురగిరిరాజపార్శ్వముల శోభిలు నయ్యమృతాంశుచంద్రికా
సరణిఁ గపోలభాగములఁ జల్లని నవ్వొలయన్, గురుఁడు, నీ
వెఱుఁగుదొ, లేదొ గాని, శుభ మిద్ది, హయాస్యజయంతి నేఁడు, నీ
విరచిత కావ్యభాగమును వింట జయం బగు నంచుఁ బల్కెఁ జుమ్.

క. కోరిక కనుకూలంబుగ
నారాయణు సంస్మరించి ననుఁ గరుణింపన్,

వారికి సాష్టాంగ నమ
స్కారం బొనరించి సెలవుఁ గైకొంటిని నేన్. ౧౮

వ. నా యాంధ్రీకరించు శ్రీదేవీభాగవతకృతి కథానాథు లగు శ్రీవిద్యా
శంకర పదమావేశ ప్రకాశిత జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ
స్వాముల వారి పవిత్రాన్వవాయం బెట్టి దనిన— ౧౯

## కృతినాథ వంశ వర్ణనము

శా. ఆ నారాయణుఁ డాదిదేవుఁడు పరుం డాదిన్ విసృజ్యస్థుఁడై,
యేనే యీ సకలమ్ము, లే దితర మొం డేదే నవాద్యమ్మనన్
జా నొప్పారిన దేవివాక్యములు; దానం జేసి యా దేవుఁడే
శ్రీనాథుండు జగద్గురుం డనెడి వాసిం గాంచె శ్రీచక్రియై. ౨౦

శా. శ్రీచక్రాఖ్యునినాభికంజమునఁ దోఁచెన్ స్రష్ట; యా బ్రహ్మయుం జన్
వాచోధీన సమస్తవేదుఁ డగుచున్ వర్ణాశ్రమాచార ధ
ర్మాచార్యుం డయి యీ ప్రపంచ మఖిలం బాదిన్ సృజించెన్, బుధ
ప్రాచీనత్వము భారతీప్రభుత సంపాదించె నాత్మప్రథన్. ౨౧

ఉ. ఆతనియిచ్ఛచే జనన మంది వసిష్ఠుఁడు సూర్యవంశసం
జాతులఁ జక్రవర్తులను శాసనవర్తులఁ జేయుచుం, ద్రిలో
కీతత కీర్తియై వెలసెఁ, గేవల మాతనియభ్యనుజ్ఞ వి
ఖ్యాతు నొనర్ప బ్రహ్మఋషిగాఁ గుశికాత్మజునిం దపోధనున్. ౨౨

క. శక్తి యతని సుతుఁడు మహా
శక్తి ప్రద్యోతితుఁడు త్రిశంకుప్రభు నా
సక్తిని జండాలాకృతి
యుక్తుం గావించె ధర్మయోజనరక్తిన్. ౨౩

క. స్మృతికర్త పరాశరముని
యతని సుతుండై వెలింగె నఘార్జితుఁడై
ధృతవిష్ణుతేజుఁ డతనికి
సుతమతి ద్వైపాయనుండు సుతుఁడై పుట్టెన్. ౨౪

ఉ. అంశుమదుజ్జ్వలాంగుఁ డఖిలాగమశాసనశీలి భ్రాంతి
వంశవివర్ధనుండు జయభారతకర్త పురాణవక్త వి
ష్ణ్వంశకృతావతారుఁడు మహాత్ముఁడు రెండవ కృష్ణుఁ డీశ్వరా
ప్రాంశుఁడు శ్రీప్రభావలిత భాగవతర్షి వెలింగె వ్యాసుఁడై. ౨౫

క. ఆతనిపుత్త్రుఁ డయోనిజుఁ
డాతతవైరాగ్యశాలి యగ్నినిభుఁడు వి
ఖ్యాతుండు శుకుఁడు బుధనుత
చేతస్కుఁడు పూజ్యపాదచిహ్నుఁడు వెలసెన్. ౨౬

క. ఆ విద్యావంశంబునఁ
బావనచరణుండు గౌడపాదుఁడు మాండూ
క్యావిష్కారక కారిక
లావిష్ట మహార్థయుక్తి నారచియించెన్. ౨౭

క. గోవిందయోగి తత్పా
ద్యావిర్భూతుఁడు ప్రసిద్ధుఁ డయ్యె, విశాలిన్
జీవన్ముక్తి మహాసుఖ
సేవనసంసిద్ధి నెగడెఁ జిరజీవి యనన్. ౨౮

ఉ. శంకరుఁ డామహాత్ముకరసారసజాతుఁడు బ్రహ్మసూత్రభా
ష్యంకరుఁ డాతఁ డొప్పె విజయార్భటి సౌగత పాంచరాత్ర తీ
ర్థంకర ముఖ్య నాస్తిక మదద్విప వజ్రమహాంకుశాభుఁడై
శంకరరూపుఁడై నిగమసమ్మతధర్మము పాదుకొల్పుచున్. ౨౯

క. శ్రీవిద్యాశంకరగురు
దేవుండు సముద్ధరించి స్థిరమై యుండం
గా వైదికసన్మార్గము,
గావించెఁ బ్రతిష్ఠ నాల్గుగాఁ బీఠంబుల్. 30

తే. శృంగగిర్యధిష్ఠితుఁడు సురేశ్వరుండు,
త్రోటకుండు జ్యోతిర్మఠధూర్వహుండు,

పద్మపాదుఁడు జగన్నాథపదసుమరుండు,
నైర్రి ద్వారక సురుఁడు హస్తామలకుఁడు. ౩౧

వ. అమ్మహాచార్యవర్యులందు, సురేశ్వరులు, నైష్కర్మ్యసిద్ధి, తైత్తిరీ
యోపనిషద్భాష్యవార్తికము, బృహదారణ్యక భాష్యవార్తికము,
దక్షిణామూర్తి స్తోత్రవార్తికము; పద్మపాదులు, శారీరకమీమాంసా
భాష్య వ్యాఖ్యాస్వరూప పంచపాదిక, ఇత్యాది మహానిబంధంబులు
రచించి, వైదికధర్మంబు లోకంబున సుప్రతిష్ఠితం బొనరించిరి. ౩౨

క. అం దెల్ల యజుర్వేదా
మందానందాస్పదంబు మహిమాఢ్యం బ
స్పందం బధిపీఠం బై
చెందెను ఖ్యాతిన్ సురేశచిహ్నిత మగుటన్. ౩౩

సీ. విద్యారణ్యయశోభిధానధరుఁ డా పీఠం బధిష్ఠించి శ్రీ
విద్యాపూర్వకనామమౌ నగర దేవిం దుంగభద్రానదీ
ప్రోద్యత్తీరభువిం బ్రతిష్ఠ సలిపెన్; బుక్కేశు నాతండె శ్రీ
విద్యాశంకరుఁ డాభిషేచనికపట్టిం జేసె సమ్రాట్టుగా. ౩౪

శా. వేదాంతంబులు నాస్తికాపశదదుర్వృత్తంబులన్ స్వప్రభా
శ్రీదివ్యాకృతిఁ గోలుపోక స్థిరమూర్తిం గల్పవిస్ఫూర్తి స
మ్మోదంబుం బచరింప భాష్యములు సంపూర్ణంబుగాఁ గూర్పఁడే,
యాదీప్తిన్ శతవిస్తరంబు సలుపందా మాధవీయంబులన్? ౩౫

మ. అకలంకస్థితిఁ గూర్మపృష్ఠయుతమై యష్టాహినాగంబులన్
సకలాశాపరివేష్టితం బగు మహోచ్ఛ్రాయంబునై మేరుమూ
ర్తికమౌ దానిఁ బ్రతిష్ఠ సేసె నతఁడే శ్రీచక్రరాజంబుఁ, బా
యక లోకైకగురూత్తముల్ పరమహంసాచార్యు లర్చింపఁగా. ౩౬

తే. రాజగురుఁడు విద్యాపురరాజ్యతంత్ర
మాపయిని శ్రీవిరూపాక్షు మధివసించి
నడపుటం జేసి, శృంగేరి విడువవలసె;
శ్రీవిరూపాక్షమె తదధిశ్రీ వెలింగె. ౩౭

క. విధివశతఁ దల్లికోట
ప్రధనంబున రామరాజు పడి యడఁగుటచే
నధికార మడఁగి యడవుల
నధివాసము చేసి రెటులొ యత్రతి గురువుల్. ౩౮

వ. ఆ జగద్గురుపరంపరయందుఁ గ్రమాగతుఁడై శాంకరశకంబున రెండు
వేల మూఁడువందల మూఁడవదగు సంవత్సరంబున —— ౩౯

క. ఉద్దండభారతీయతి
యుద్దండుఁడు పీఠ మెక్కి యోగి జయతేజం
బుద్దీపిత మొనరింపఁగ,
నద్దీపంబు శివగంగ నాత్మ లయించెన్. ౪౦

వ. అట్లు మచిలీపట్టణ సమీపంబున నుద్దండభారతీయతులు సిద్ధి నొందిన
దాదిగ శ్రీశృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధిపతులు కృష్ణా గోదావరీ
విశాఖాది మండలంబులు తమ ముఖ్యాస్థానంబులుగఁ జేసికొని,
లోకసంగ్రహార్థంబు భారతభూమియం దెల్లఁ బర్యటించుచు ధర్మ
శాసకులై వెలుంగుచుండిరి. అందు, శ్రీ బోధానందభారతీయతులు
పూర్వాశ్రమంబున విధివిధానంబున మహాగ్నిచయన పర్యంత క్రతు
వులు మహావైభవంబున నాచరించి, రాజీ నృసింహమహాగ్నిచి
న్నామమునఁ బ్రథితుం డయ్యె. ౪౧

క. హారితస గోత్రుం డాతఁడు
వరలెను దైవజ్ఞ సార్వభౌమాదిక సత్
పరిషత్కృత బిరుదాళీ
పరిపూజ్యుఁడు సర్వతంత్రపరినిష్ఠితుఁడై. ౪౨

వ. ఆ మహాగ్నిచితుండు సంన్యస్త సర్వకర్ముండై శ్రీ సచ్చిదానంద
భారతీ యతీంద్ర కరకమల సంజాతుండై యవతరించి, ౪౩

క. వాసిగ బోధానందుఁడు
శాసించెం బరమహంససామ్రాజ్యపదం.

భాస్వత్తుహినాచలభువిఁ
జేసెన్ వ్యాఖ్యానదివ్య సింహాసనమున్. ౪౪

క. కల్యాణాస్పదవిగ్రహ
కల్యున్ గంటికులదీపుఁ గామేశాఖ్యున్
బాల్యంబాది విరక్తుం
గల్యాణానందుఁ జేసెఁ గరసంస్పర్శన్. ౪౫

వ. మఱియు జగద్గురు శ్రీ బోధానందభారతీయతులు కల్యాదిగాఁ జతుస్త్రింశత్త్యధిక పంచసహస్రతమాబ్దంబున రుధిరోద్గారి వత్సర మార్గశీర్ష పూర్ణిమా భానువాసరంబున సాన్ద్రవృషభంబున శ్రీ కల్యాణానందభారతీయతులను శృంగేరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠంబునఁ బట్టాభిషిక్తుల నొనరించి, చతుర్వర్ణచక్ర మహోదయకరం బగు శ్రీవిద్యారణ్యయతీంద్ర ప్రతిష్ఠిత శ్రీచక్రరాజము నొసంగి, ధర్మరాజ్యపరిపాలనాధికారుల నొనర్చిరి. అంత నా మహానుభావుండును — ౪౬

క. విద్యార్థీత్యాచరణల
విద్యాశంకరులఁ బూజ్యు విద్యారణ్యున్
హృద్యస్థితి మది నిడుకొని,
ప్రోద్యన్మహిమన్ రచించు భువనగురుండై. ౪౭

శా. ప్రస్థానత్రయభాష్యశాంతి శతపర్యాయంబులుం జేసి, శి
ష్య స్థానీయులు వ్యాఖ్యలన్ సలుపఁగా సామర్థ్యముం గూర్పఁ బీ
ఠాస్థానంబు కుబుద్ధిదుర్విషయమై, యానందధామంబుఁ గ్రీ
డాస్థానం బయి పొల్చెఁ బండితమహార్యశ్రేణి కశ్రాంతమున్. ౪౮

క. పరమేశ్వరి నొక వాసం
కరు నొకటఁ బ్రతిష్ఠసేసె గర్తపురమునన్;
మఱి బహుదైవతమూర్తులఁ
బరినిష్ఠించెను సమస్తభారతభూమిన్. ౪౯

వ. శ్రీ కల్యాణానంద భారతీ జగద్గురుచరణులు వైదికధర్మ సంరక్షణార్థంబు నిబంధించిన గ్రంథజాతంబు శతాధికంబై యొప్పు. అందు,

గీర్వాణభాషయందు — కల్యాణశ్రీకల, శ్రీ లలితా రహస్యనామ స్తోత్ర శ్రుతి సీమంతంబునకు వైదికగ్రాహ్యైక మహాభాష్యంబై తన రారు; బ్రహ్మకల, యుపాసనాసర్వస్వ మూర్తంబై యొసంగు; పూర్ణమీమాంస, పూర్ణస్వరూపదర్శనంబై భాసిల్లు; సంజీవని, ఆపస్తంబీయ దర్శపౌర్ణమాసవ్యాఖ్యా సముజ్జీవకంబై శోభిల్లు; సంధ్యాకళ, సంధ్యావందన సూత్ర భాష్య ప్రఖ్యాపకంబు; తంత్ర జ్యోత్స్న, సర్వతంత్రైకదీపంబై వెలుంగు; బ్రహ్మసూత్రసంజీవని, కువ్యాఖ్యావిష మూర్ఛిత ప్రాయంబగు బ్రహ్మసూత్రంబునకు సంజీవ నౌషధియై యొప్పు; కల్యాణసంహిత, సర్వద్విజకులావశ్యాధ్యేతవ్య కృష్ణయజుస్సంహితాభాగ విహితంబై యలరారు; కల్యాణస్మృతి, ప్రాయశ్చిత్తపశునిర్ణయము, శ్రీయాగసూత్రము, సర్వదేవతాప్రతిష్ఠా విధి, క్రియామయదీక్షావిధి, మహారుద్రయాగత్రయము, సంన్యాస దీక్షావిధి, మున్నగునవి తత్తద్విషయ విధాయక ప్రమాణగ్రంథం బులు. అట్ల యాంధ్రంబున, — కల్యాణసుధ, శారీరకమీమాంసా భాష్యంబున కపూర్వవివరణరూపంబు; గీతామృతతరంగిణి, భగవద్గీ తార్థదర్పణంబు; వేదాంతమీమాంసాశాస్త్ర హృదయము, బ్రహ్మ సూత్రార్థసారంబును నై విలసిల్లు. ఇవ్వియుం గాక, శ్రీవారు లోక సంగ్రహార్థంబు రచించిన శ్రౌతస్మార్త ధర్మంబులు, ఉపాసనావిశేషం బులు, వేదవేదాంత రహస్యంబులు వివరించు గ్రంథజాతం బసంఖ్యంబై యలరారు. పరమహంసల పూర్వాశ్రమ స్మరణంబు దురితా వహం బను పండితమాన్యుల వాక్యంబు కులగోత్రహీను లగు కౌలిక గురులక యన్వయించుగాక, యని నిరసించి, శ్రీవిద్యాశంకర భగవత్పాదులజన్మకారణు లయిన నారాయణగురువుల నామపూర్వ కంబుగాఁ దజ్జన్మకథా స్మరణ విస్తరణంబులు శంకరజయంత్యాదిక మహాపర్వంబుల సకలశిష్టజన పరిగృహీతమ్ముల యని సుఋతుసం దెచ్చి, యీకృతి కర్తృతాతల పూర్వాశ్రమ గోత్రాన్వయాది కీర్త నమ్ము కలిజనపావన మ్మని, సంక్షిప్తరూపమ్మున సంస్మరింతు. ౫౦

తే. మున్న తంజాపురీరాజభూమియందు,
బ్రాహ్మణాగ్రహారంబు వెలంగమాను
వెలయు; నందు నిత్యాగ్నులు వేదవిదులు
రాజిలిరి పదుమూఁడు గోత్రములవారు. ౫౦

క. ఆ రాజ్యపతియధర్మం
బోరువ కొకనాఁడు వార లొక్కుమ్మడిగా
నా రాజ్యము వీడి బయలు
దేరిరి కాశికిని బోవఁ దివిరినమతితో. ౫౧

క. తమతమ యగ్నులు మాత్రమె
తమ సర్వస్వంబు గాఁగఁ జరలి నడచు వా
రమలం బగు గోదావరి
సముపాంతస్థలము విడిసి సాగిరి దారిన్. ౫౨

క. వారల కథ విని పెద్దా
పూ రేలెడు రాజు, వేఁడి, పోనీయక, పే
రూ రగ్రహార మిచ్చి స
గౌరవముగ నిల్పె వారిఁ గడుఁ బ్రీతి నటన్. ౫౩

వ. తేదాదిగాఁ దద్వంశంబులవా రాంధ్రసమ్రాట్టుల పూజావిశేషంబులఁ
బరివృద్ధులై పేరూరిద్రావిడులను నామంబునఁ బ్రసిద్ధులై, యజ్వలై,
యాజకులై, వేదవేదాంగవిదులై, వెలయుచుందురు. అట్లు లాంధ్ర
భూమికి వలస వచ్చిన కుటుంబములు పెక్కులు గలవు. ౫౪

తే. వారిలోఁ బెదవజ్ఝులు భార్గవుఁడును
వైతహవ్య సావేతస ప్రఖ్యులైన
గోత్రఋషుల వాధూలస గోత్రుఁ డొప్పె
నన్నిటం బెద్ద యగ్రహారాగ్రణి యయి. ౫౫

వ. ఆ పెదవజ్ఝలకు వేదాధ్యయనపరు లగు నేవురు పుత్త్రు లుదయిం
చిరి. అందు జ్యేష్ఠపుత్త్ర వంశములోనివాఁ డగు గంటి లక్ష్మణా

శాస్త్రి, మహాపండితుఁ డగుట విజయనగర భూపాలుం డాతనికిఁ దన యాస్థాన పండితపదవి నొసంగి, గోష్పనీ సాగర సంగమ ప్రదేశంబునఁ గల సంగమవలస యను గ్రామము నెలవు గావించి, సమగ్రంబు లగు వసతుల నర్పించె. వారి వంశక్రమంబున వీరేశ్వరశాస్త్రి యుదయించి, భీమునిపట్టణంబున గృహంబులు నిర్మించె. ఆతని పుత్త్రుండు లక్ష్మణశాస్త్రి మహాపండితుఁ డయ్యెను. ఆతనికి బ్రహ్మముఖంబులం బోని నలువురు సుతు లుదయించిరి. అందు రెండవవాఁడగు వీరేశ్వరశాస్త్రి మేధావియై యొప్పుచుఁ, బరమసాధ్వి యగు జోగమ్మను బరిణయం బాడె. ఆ పవిత్రదంపతులకు కామేశ్వర దేవతాప్రసాదంబున నిరువురు పుత్త్రులు పుట్టిరి. అందు — ౫౭

క. సురవైద్యుఁ డవతరించిన
సరణిం బెదకామఁ డఖిల సంస్తుతుఁ డయ్యెన్;
సురగురుఁ డన పఠ్యాపలు
కఱచిన చినకామఁ డొప్పెఁ గడుఁ బాత్రుండై. ౫౮

వ. మఱియు నా పేరూరిద్రావిడవంశంబులందు నేకతాతాగ్రహారంబు నివాసంబుగాఁ గలిగి, ౫౯

క. తాతావంశము వేదస
నాతన; మం దొప్పు సూర్యనారాయణ వి
ఖ్యాతావధాని; సోదెమ
నాతండు గ్రహించి మించె నాత్రేయసుఁడై. ౬౦

క. తాతా సుబ్బారాయం
డాతనికి ద్వితీయపుత్త్రుఁ డై నెలసెఁ; బుధుం
డాతండు విజయనగర
స్థిత మహారాజగురుఁడు విద్వద్గురుఁడున్. ౬౧

క. తాతా సుబ్బారాయని
కై తోఁబుట్టువుగఁ బార్వతమ్మ యొసఁగె నా

నాతిన్ గ్రహించె గుణవి
ఖ్యాతుఁడు సతిగాఁగఁ జిన్నకామేశుఁ డొగిన్. ౬౨

తే. పార్వతీదేవి నిండుగర్భంబు దాల్చి
యరుణగర్భయౌ ప్రాచీదిగంగనవలె
సూర్యనారాయణావధాన్యార్యునింట
నేకతాగ్రహారమం దెలమి నుండ, ౬౩

క. వేదపదక్రమ పాఠని
నాదంబులు వినుచు సూర్యనారాయణుఁ డా
వేదముఖుం డుదయించును
నాదౌహిత్రుఁడుగ నంచు నందించు మదిన్. ౬౪

తే. చిత్రభాను వైశాఖ పవిత్ర శుద్ధ
పక్షమున సప్తమిన్ జయవాసరమున
మిథున లగ్నంబునం బుష్యమీప్రయుక్త
తారఁ బార్వతి కనెఁ బుత్త్రు సూరిమిత్రు. ౬౫

క. కేశుఁడు మేశుం డీశుం
డేశబ్దంబున వెలయుదు రేకపదంబై,
యాశబ్దము కామేశం
బా శిశువున కమరె సార్థకాహ్వయ మగుచున్. ౬౬

క. కౌమారము యౌవనమును
గామేశుఁడు మాతులునకుఁ గడుఁ బ్రియుఁ డగుచున్
దా మని తాతాసుధికడ,
నేమంబునఁ జదువు లెల్ల నేర్చుచుఁ గడపెన్. ౬౭

శా. తాతా రాయుఁడుశాస్త్రి వ్యాకరణశాస్త్రప్రాజ్యసామ్రాజ్యుఁడై
సేతుశ్రీహిమశైలమధ్యమహి వాసిం గాంచె నాచార్యతా
ఖ్యాతిం బ్రాప్తసమస్తవిద్యల ననన్యాత్తప్రభాధుర్యుఁడై
యాతం డొందె మహామహోపపద ధుర్యంబౌ నుపాధ్యాయతన్.

శా. తాతారాయఁడుశాస్త్రి గీ మఖిలవిద్యాపీఠమై మండన
స్థితాస్థానము వోలె వెల్గ నచటన్ విద్వాంసులున్ ఛాత్ర వి
ఖ్యాతిన్ వ్యాకరణంబు న్యాయమును వేదాంతంబు మీమాంసయున్
శ్రౌతస్మార్తవిధానపాళి సరహస్యం బభ్యసిం ప్రెప్పుడున్. ౧౯

సీ. పాతంజలము మహాభాష్యంబు నొక్కెడ
జైమినీయ మ్మొక్క చక్కి వినును,
గౌతమీయన్యాయరీతి నొంటఁ గణాద
వైశేషికము నొక్కప్రక్కఁ దెలియు,
సప్రయోగమ్ముగా శ్రౌతసూత్రము నొక్క
చాయను విను స్మృతిజాత మొకట,
భాష్యయుక్తంబుగా బ్రహ్మసూత్రంబులు
నుపనిషత్తులు గీత లొకట నెఱుఁగుఁ,
బ్రాతిశాఖ్యల కొకవేళ శ్రవణ మొగ్గు,
శాస్త్రసాహిత్యగోష్ఠులు సలుపు నొకట,
నా మహామహోపాధ్యాయుఁ డైన సుబ్బ
రాయ నింటఁ గానేశుండు ప్రకట నిరతి. ౨౦

శా. ఆలించుం గడు శ్రద్ధ వేదములు శాస్త్రాలిం దదభ్యర్థియై,
పాలించున్ శ్రుతిసిద్ధ నిత్యవిధులన్ బ్రాహ్మలకే, కాని, యే
వేళన్ దానఁ దవుల్పడండు, దగులున్ వేదాంత వాక్యంబులన్,
బాలప్రాయమునంద వాని కవి విస్పష్టంబులై యొప్పుటన్. ౨౧

క. ఎలప్రాయంబున నతనిం
దలిదండ్రులు మఱి గృహస్థ ధర్మునిఁ జేయన్
లలిఁ బట్టించిరి కే లొక
యెలనాగన్ వేదవిదులయింటి దగు సతిన్. ౨౨

తే. పరిణయమహోత్సవం బట్లు పరిఢవిల్లు
పట్ల నైదవనాఁడ యా వరునితల్లి

పార్వతీదేవి దేహంబు వదలి చనియె,
వచ్చి యాకస్మికమ్ముగా వ్యాధి యొండు.

ఉ. దీక్షితుఁడై వివాహవిధిఁ దీర్పఁగ నొప్పిన రూపు[illegible]
దీక్ష నుపక్రమించె వినతిం బచరింపుచు నౌర్ధ్వదేహికం
బక్షయలోక మీ జనని, కాతనిఁ జూచిన గేస్తు రెల్లరుక్
వీక్షణపంక్తి నశ్రువులు నిండఁగఁ గాఱిచి రేకధారగా.

క. కామేశుని నెమ్మది నది
నీమంబున భవవిరక్తి నిష్ఠం బెంపన్,
గామినిఁ జూడఁడు లోలతఁ,
గామినులును శుకునినట్లు కాంచెద రతనిన్.

తే. దక్షిణాచారమార్గ మాంధ్రమున నొక్క
రాణిచయనుల సంప్రదాయాన నెసఁగు
నని వినుట నమ్మహామహు నెనరు వడసి
పొందె మంత్రోపదేశ మమందవృత్తి.

సు. ఒకనాఁ డాతని కద్భుతంబుగ శ్రవోయోగంబునన్ [illegible]
నకలంకంబును రోదసీకుహరపర్యాప్తంబు జ్ఞానైకరూ
పక మానందమయం బఖండమును విశ్వస్ఫూర్తిబీజం [illegible]
నొక నాదం; బది తన్నుఁ బిల్చు ప్రణవధ్యోవాణిగా నెంచుచున్.

మ. ఎద నేదో మధురార్ద్రితాపశిఖ బాధింపంగ రాపాడుచున్
మది యెప్పాటను శాంతి నొందమి నకస్మాజ్జాతమౌ నూహ [illegible]
య్యది యే దీనికి నౌషధం బనుచు బోధానందమౌనీంద్రులన్
వెదుకంగాఁ జని యెట్టకేని దరిసించె న్వారి నమ్మాపురిన్.

వ. అచ్చట బాలకామేశ్వరశర్మ పండిత పరిషదనుజ్ఞతోఁ బ్లవనంవ [illegible]
శుద్ధచతుర్దశీ గురువాసరమ్మున యథాశాస్త్రీయమ్ముగాఁ దుకీ[illegible]
శ్రమ స్వీకారం బొనర్చి, జగద్గురు శ్రీ బోధానందభారతీ యతీంద్రుల
యనుగ్రహంబున మహోపదేశంబు నొంది కల్యాణానందభారతి [illegible]

సవిత్రనామంబున ద్వితీయ జన్మంబు నొంది, పిమ్మట రుధిరోద్గారి మార్గశీర్ష పూర్ణిమా భానువాసరమ్మున జగద్గురుపదవి నభిషిక్తులైరి.

## వ్యాఖ్యాన సింహాసన వర్ణనము

సీ. బ్రహ్మవర్చస్స్ఫూర్తి వరలుమూర్తిం గన
నగ్ని దేవుం డితం డనంగఁ దోఁచుఁ,
గాంతిపుంజం బైన కాయంబు గాంచిన
బాలసూర్యప్రౌఢిఁ బరిఢవించుఁ,
జిఱునవ్వు వెన్నెలల్ గురియు మోమును జూడఁ
బూర్ణచంద్రుండను బుద్ధి వొడము,
బహుముఖప్రస్ఫురత్ప్రవచనంబులఁ గాంచ
భారతీశుం డను భావ మొదవుఁ,
ప్రబలధర్మేతరములఁ గోపంబు చూడ
నితఁడు భార్గవరాముఁ డన్పించుఁ బ్రజకు,
బాల కల్యాణయతి పూజ్య పాదగురులు
పరమహంస సామ్రాజ్యాధిపదము దాల్చ. ౮౦

వ. శ్రీమ త్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పదవాక్యప్రమాణ పారావారపారీణ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమా ధ్యష్టాంగ యోగనిష్ఠా గరిష్ఠ తపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్త సాంప్రదాయిక షడ్దర్శనాచార్య వ్యాఖ్యాన సింహాసనాధీశ్వర సకలవేదార్థ ప్రకాశక సాంఖ్యత్రయీ ప్రతిపాదక సకల నిగమాగమ సార హృదయ వైదికమార్గ ప్రవర్తక సర్వతంత్ర స్వతంత్ర విద్యానగరాది మహారాజధానీ కర్ణాటక సింహాసన ప్రతిష్ఠాపనాచార్య తుంగభద్రాతీరవాస ఋష్యశృంగగిరి పురవరాధీశ్వర శ్రీ విరూపాక్షాధీశ్వర శ్రీమ దాచార్యాన్వయ పరివృఢ శ్రీమ ద్రాజాధిరాజ మహారాజ గురు భూమండలాచార్యాన్వర్థ సకలబిరుదావలీ విరాజమాన శ్రీవిద్యాశంకర పదమావేశ ప్రకాశిత శృంగగిరి శ్రీవిరూపాక్ష శ్రీపీఠాధీశ్వర భారతీ సంప్రదాయ

సార్వభౌమ జగద్గురు శ్రీ బోధానందభారతీ మహాంతాచార్య మహా
స్వామి కరకమలసంజాత జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ మహాంతా
చార్య మహాస్వామి చరణులు, వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితులై
యెసఁగుతఱి, ౮౧

శా. బాలార్క ప్రతిమాన తేజుఁడు శ్రుతిప్రఖ్యాత దివ్యార్గళీ
లా లోలాత్మముఖుండు నిత్యరసనా లాస్య స్థితద్భారతీ
కేలీ మంగళ విగ్రహుం డతఁడు పంకేజాత గర్భుండు తా
నై లోకంబు సముద్ధరింప దిగి కొల్వైనట్లు భాసిల్లెడిన్. ౮౨

చ. సనకసనందనాది మునిచంద్రులు వీరు, వసిష్ఠుఁ డీతఁడీ
మునిమణి నారదుం డనుచుఁ బూజ్యతఁ గొల్చుచుఁ దత్సభం దపో
ధనులు తురీయధర్ములు సతంబు గురూత్తముఁ గొల్చుచుందు రా
ఘనుకరకంజజాత శుభగాత్రులు మానసమాత్ర సంభవుల్. ౮౩

మ. ఎదలం బేర్చినభక్తి కౌతుకధృతిన్ హెచ్చింప శ్రౌతాగ్నులన్
వదలంబోవక యాత్మలో వెలుఁగు దివ్యజ్యోతి నశ్రాంతమున్
బదిలంబుం బొనరించి కాంచుచును విశ్వవ్యాప్తిఁ దద్వ్యాప్తిఁ ద
త్పద మేవేళ సమాశ్రయింత్రు త్రిపురాతాత్పర్యయోగీశ్వరుల్. ౮౪

సీ. లక్ష్మ్యం డొకండును రాముం డొకండును
విమలుం డొకండు శ్రీవిద్య యొకఁడు
వేద మొక్కండును విరజుం డొకండును
సత్యుం డొకండును నిత్యుఁ డొకఁడు
నొకఁడు విమర్శుండు నొకఁడు విజ్ఞానియు
విజయుం డొకండును వినయుఁ డొకఁడు
పూర్ణుండు బ్రహ్మంబు బోధుండు నమలుండు
నచలుండు జయుఁడు నారాయణుండు
సర్వుఁడున్ భూమదుఁడు శివుండు శంకరుండు
పరుఁడును సుశీలుఁడును యోగివరులు సతముఁ
గొలుచుచుందు రానందనాథులు తదీయ
శిష్యులై పాదుకాంతదీక్షితులు భక్తి. ౮౫

తే. మఱియు మహిమాఢ్యు లున్నారు మహితయశులు
యోగివర్యులు కల్యాణ యోజితాత్మ
పాదుకాంత దీక్షాచార్యపదులు పంక్తి
పావనులు లోకపావన భవ్యతనులు. ౮౬

సీ. క్రమ జటా ఘనల సాంగముగ శ్రావ్యంబుగా
నర్చించు సూర్యనారాయణుండు,
వేదాంతగోష్ఠి వినోదంబు పచరించు
సుధి యల్లు లింగన సోమయాజి,
చర్చించు దైవజ్ఞ సార్వభౌముఁడు దివ్య
గమనముల్ వేంకట రమణశాస్త్రి,
పాణిని వరరుచి పాతంజలప్రౌఢి
కలయఁ బేర్చును నీలకంఠసూరి,
సరస సాహిత్య సంపద సంతరించు
శ్రీయశశ్శాలి మాధవరాయశర్మ,
శ్రీ జగద్గురు కల్యాణ రాజ పూజ్య
యతుల యాస్థాన పుణ్య సభాంతరములు. ౮౭

సీ. సదమల సాహితీసమితి సభాపతి
సత్కవీంద్రుఁడు శివశంకరుండు,
కవికుటీరావాసి కావ్యమర్మజ్ఞుండు
ప్రౌఢకావ్యుఁడు వీరరాఘవుండు,
కవితావతంసుండు గట్టి నృసింహుండు
కామసంజీవన కావ్య కర్త,
జ్ఞానవాసిష్ఠ నిర్మాణదక్షుఁడు సూక్ష్మ
బుద్ధి శ్రీరామ సద్బుధవరుండు,
కవి విధేయుఁడు గురుకటాక్షప్రసార
సార హృదయాబ్జుఁ డీ నోరి నారసింహుఁ,
డా మహాస్థాన మెవ్వేళ నాశ్రయించి
కవిత వెలయింతు రిష్ట సత్కవులఁ గూడి. ౮౮

సీ. జ్యేష్ఠుండు శిష్యుల శ్రేష్ఠుండు యోగుల
లక్ష్యుండు లక్ష్మీనారాయణుండు,
పరిగ్రహీత సర్వాగమవిదుఁడు వి
రజుఁడు చిద్వ్యాప్తి శ్రీరామమూర్తి,
ఘనవేదపాఠి వేంకట సోమదీక్షియుఁ,
క్రమపాఠి విమలసూరావధాని,
శుక్లయజుర్వేద సూరి యాచార్యుండు
పురుషోత్తమవధాని పూర్ణయోగి,
పరమ సత్యధర్ముండు సాంబశివశాస్త్రి,
యమల పూర్ణాత్ముఁ డాదినారాయణుండు,
సుబ్బరాయుండు సౌశీల్య శుద్ధబుద్ధి,
కొలిచియుండును కల్యాణగురుల సతము.

వ. ఇట్లు ధర్మసంపన్నంబగు మహామహిమనొప్పారు నపూజ్యపాదుఁ...

సీ. వ్రాయుచు నొకవేళఁ బ్రస్థానములు మూఁడు
భాష్యతద్వ్యాఖ్యాప్రబంధయుక్తి,
వివరించు నొకవేళ వేదవాక్యార్థముల్
కల్పోక్త మాధవోక్త క్రమమునఁ,
వర్ణించు నొకవేళ శ్రౌతప్రయోగ ర
హస్యంబు లనితరాభ్యాస ఘనశక్తి,
[illegible] నొకవేళ నిగమాగమాచార
[illegible]ష్ఠాక్రమము ధర్మనిష్ఠుఁ డగుచు,
స్థిరచరంబులకా సద్గురుమూర్తి ప్రతిష్ఠ
లొక్కవేళ నొనర్చు నొక్కొక్క వేళ,
భువనగురుఁడు శ్రీ కల్యాణ పూజ్య పాద
పరమహంసుఁడు భారతీవంశవిభుఁడు.

మ. ద్వైతధ్వాంత ప్రచండభాస్కర పదప్రఖ్యాతి దీపింప, న
ద్వైతద్వేషులు ముష్టివాదరణయాత్రల్ సల్ప వారింపఁడే,

ణీతిం బాజీన నాదవానివజకుణ వెన్నాడి భంగింపఁడే
యా తీర్థాఖ్యు సుదర్శనాయుధ ధరుం డాచార్యుఁ డుద్దండుఁడై. గ-౨

## కృ తి న మర్ప ణ ము

వ. అట్లు త్రిలోకీతత నిజ కీర్తిచంద్రాతపద్యుతి యగు శ్రీ కల్యాణానంద భారతీ యతీంద్రు లొక్క శుభవాసరంబున వ్యాఖ్యానసింహాసనం బునం గొలువుండి తత్పద శ్రీ రాజీవ నిరంతర ధ్యానాయత్త చిత్తుండ నగు నన్నుఁ రావించి నిజ శ్రీపాదపీఠాంతికమునఁ గూర్చుండ నియ మించి సమ్ముఖంబున బహుళమంత్రమంగళంబుగా శ్రీకలశంబును బంచపల్లవాలంకృతంబును నవరత్న సంపన్నంబును దివ్యౌషధివాసనా శ్రీ వాసిత పవిత్ర వారిపూరితంబును బ్రతిష్ఠించి శ్రీపాదసమర్చిత పాణియుగళుండ నగు నాకు — గ-౩

క. శ్రీవిమలంబు సదాశివ
పావనయంత్రాంకితంబు వరమహిమము సౌ
వర్ణ పట్టమును గురు
దేవులు కట్టిరి లలాటదేశమునఁ గృపన్. గ-౪

మ. శాంతప్రక్రియ నంత సద్ద్విజవరుల్ సామ్రాజ్యమంత్రంబులన్
జెంతం దోడుగ నుచ్చరింపఁగ శ్రుతిస్నిగ్ధంబుగా శ్రీగురుల్
పొంతం బొప్పఁగ స్వీయపాణికలనన్ మూర్ధాభిషేకం బవి
భ్రాంతశ్రీకత నా కొనర్చిరి సభన్ స్వస్తిశ్రుతుల్ పొంగఁగన్. గ-౫

ఉ. ఆ శుభవారిపూత సకలాంగుఁడనైన యొకమాట రాక యా
కాశధునీ పవిత్ర జల క్రమ జటాకలితాంగునిన్ భవా
వేశుని నాత్మలోఁ దలఁచి యేనును స్థాణుఁడు వోలె నుండ శ్రీ
దేశికవర్యుఁ డిట్లని వినిపించిరి సద్గురు లిట్టు లాసభన్. గ-౬

తే. మున్నె యాతండు మద్దత్త పూర్ణదీక్ష
నమల పరమంత్ర సామ్రాజ్య మధివసించె;
నుటియు నేఁ డిందుఁ బరిషత్సమక్షమందుఁ
జేసితిఁ గవిసామ్రాజ్యాభిషేచనంబు. గ-౭

సీ. మేము వైయాకరణసార్వభౌమబిరుద
సహితుఁగాఁ జాత రాముఁడుశాస్త్రిఁ దొలుత,
మరల దైవజ్ఞసార్వభౌమపదమహితుఁ
జలిపితిమి వేంకటరమణశాస్త్రి నిట్లు. ౯౮

తే. ఇట్టిఁ డగుఁ బాత్రుఁడు కవిసమ్రాట్టు నాఁగ
మా యొనర్చెడినామముల్ మాన్యము లగు,
నవి యొసంగుఁ ద్రిలోకి నన్వర్థసంజ్ఞ,
నదియు నీసభ యంగీకరించుఁగాక. ౯౯

ఉ. పేరుగలాఁడు సత్కవులు పేర్చెడి సర్వసభాంతరంబులం
దీరు సభాపతిత్వపద నిష్ఠితుఁ డీ శివశంకరుం డిదే
తీరిన యాభిషేచనికదీక్షఁ గనుంగొనెఁ గాన నాతఁ డీ
నోరి నృసింహశాస్త్రి శుభనూతననామము చాటి చెప్పెడిన్. ౧౦౦

వ. అని యానతిచ్చిన, సభాపతి శివశంకరుండు శ్రీ జగద్గురువుల యాదేశంబు సభతోడం దనకును బరమసమ్మతంబుగా లేచి, నోరి నరసింహశాస్త్రి కవిసమ్రాట్టని ముమ్మారు సభామధ్యంబున నుద్ఘోషింప,

మ. కరుణాపాంగవిలోకనామృతముతోఁ గల్యంబుగా నంత శ్రీ
గురువర్యుల్ సకలాంగసేచనము నాకుం జేయుచున్ నాపయిన్
బరమా శాటి యొకండు కప్పి, "కవిసమ్రాట్సిద్ధనామ్నా చిరం
పరివర్ధస్వ" యటంచు శీర్షముపయిన్ స్వర్ణాక్షతల్ వైచినన్. ౧౦౨

తే. మొరసె భూసురాశీర్వాదముఖరరవము
తోనెనసి కవిమిత్ర సంతోషరవము,
సభ సముత్పన్నమై జయజయరవంబు
ప్రతిరవ మిమ్మానె దశదిశావరణములను. ౧౦౩

ఉ. ఆ పరిషత్సమక్షమున నంత జగద్గురుపూజ్యపాద సు
శ్రీపదపంకజార్పణము సేయుచు భక్తిని కంఠ మెత్తి యీ
శ్రీపర దేవి భాగవత సిద్ధపురాణము వించితిన్ శిరం
బూఁప సదస్యు లెల్లరు మదార్జితజన్మము సార్థకంబుగాన్. ౧౦౪

వ. మఱియును శ్రీసదనంబున శ్రీగురుదేవప్రతిష్ఠిత శ్రీమహాకామేశ్వర్యంబా రాజరాజేశ్వరీ ప్రతాపభారతీ పరాభట్టారికా పరదేవ్యాయతన ముఖమంటపంబున నఖిల చాతుర్వర్ణ్య శిష్యబృందంబులుఁ జూడఁ శ్రీ సదాశివానందభారతీ యతీంద్రుల శృంగేరీ శ్రీవిరూపాక్ష శ్రీ పీఠాధీశ్వరపదవి నధిష్ఠింపఁజేయ నుద్యుక్తులై వారలకుఁ బరమహంస సామ్రాజ్యాభిషేచనంబు నిర్వర్తింపఁబోవు సమయంబున, వ్యయ సంవత్సరాశ్వయుజ పూర్ణిమా గురువాసరమ్మున మిథునలగ్నమ్మున నన్ను శ్రీగురుదేవులు మరల రావించి, యందుఁ గొలువున్న శ్రీ రాజరాజేశ్వరీ పరదేవతా సమక్షంబున నుభయ జగద్గురువుల సన్నిధానంబున శ్రీ సత్యానందయతీంద్రులును బరివేష్టిత సకల కవి విద్వద్యోగివరేణ్యులును నాలింప నస్మత్కృత శ్రీదేవీభాగవతకథార్థంబు కొంత వినిపింపం బంచిన, న ట్లొనర్చి కృతార్థుఁడనై వందనం బాచరించిన నాకుఁ దత్సభాముఖంబున నాశీరక్షతప్రక్షేపణ పురస్సరంబుగఁ గవిసమ్రాట్టను శ్రీముఖపత్రంబు ప్రసాదించి యనుగ్రహించిరి. తదాదియు నేనును, ౧౦౫

ఉ. ఆ పరదేవికోమలకటాక్షము పాఱిన దీవిధంబుగా
నాపయి, దానియిచ్చకు గుణం బది యేటికి లెస్స, గాని నే
నీపయి నెట్టు లీసరణినే సిరిచూడ్కికిఁ బాత్రభూమినై
యోపుదునో చరింప, నని, యుందు నితాంతతదాత్మబుద్ధినై. ౧౦౬

ఉ. కోరను దీనికై ధనము, కోరను సద్యశమైనఁగాని, నేఁ
గోరను గౌరవాంకములు, కోరను సత్పదజన్మభాగ్యముల్,
కోరను జన్మమోక్షణము, కోరుద నొక్కటె సుస్థిరంబులై
శ్రీరమణీయపాద సరసీరుహముల్ విలసిల్లుట ల్మదిన్. ౧౦౭

## కృతికర్తృ వంశ వర్ణనము

వ. హారితాంబరీష యౌవనాశ్వ ప్రత్యగ్రశ్రేయం బగు హారితగోత్రంబున నాపస్తంబసూత్రులు యజుశ్శాఖాధ్యాయులును వైదికనిష్ఠాభాసు

ములు నను భానుకులం బాంధ్రదేశంబునఁ బొలుపొందు వెలనాటి సమాజమందు, ౧౦౮

తే. శ్రీగిరీంద్రంబు మొదలు వార్ధియనుదాఁక
వృషభశైలాది సింహాద్రివిస్తృతమహి
యజ్వలై కవులై పండితాగ్ర్యు లగుచు
నోము గలవారు సిరి మీఱు నోరివారు. ౧౦౯

వ. అందు, ౧౧౦

తే. వేదనాదంబుతోడ నభిన్నవృత్తి
శ్రావ్యసంగీతనాదంబు సంతరించు
నతఁడు బ్రాహ్మణకోటీరమనఁగ వెలసి
మాన్యుఁడై పేరు గనె హనూమద్బుధుండు. ౧౧౧

క. అతనికి వేంకమ సాధ్వికి
సుతుఁడై గోపాలకృష్ణసూరి వెలసె స
న్నుతుఁడై యమోఘవాక్కని
వితతప్రథ మంత్రమర్మవిదుఁ డని బుధులన్. ౧౧౨

వ. ఆ గోపాలకృష్ణునకు శంభమసతియం దిద్దఱు పుత్త్రికలును, నలువురు పుత్త్రులును గల్గిరి. ఆపుత్త్రులలో జ్యేష్ఠుం డగు నాగేశ్వరరాయుండు వంశకరులగు పుత్త్రులం గాంచె. ద్వితీయుం డగు రాజేశ్వరరాయుండు కవియై బహుకావ్యంబులు సంతరించి యశోమాత్రపుత్త్రుం డై గతించె. మూఁడవకుమారుం డగు హనూమద్బుధుండు మత్పితృపాదుండు వేదవిద్యాసనాథం బగు కౌండిన్యగోత్రంబున నేతివంశంబున నుండి, క్రమాంతస్వాధ్యాయపరుండును నగ్న్యాధానదీక్షితుండును - పరమవైదికధర్మనిష్ఠాభాసురుండును నగు నాగలింగదీక్షితుల ద్వితీయ పుత్త్రిని మహాలక్ష్మిని వివాహమాడె, నలువురు పుత్త్రుల నొక్క పుత్త్రికను గాంచె. గోపాలకృష్ణుని కనిష్ఠపుత్త్రుండగు గురులింగశాస్త్రి చెన్ననగరంబునఁ బండితపదవీ సుప్రతిష్ఠితుండై, ౧౧౩

సీ. భారతం బాదిగా బహుపురాణంబులు
రచియించెఁ దెలుఁగున వచనశైలి,
ధర్మశాస్త్రాళికిఁ దతసూక్ష్మవిస్తర
వ్యాఖ్యానములు కూర్చె నాంధ్రభాష,
జైమినీయాదిక జ్యోతిషగ్రంథార్థ
కలన నిరూపించెఁ దెలుఁగువాణి,
గీతారహస్యార్థ జాతప్రకాశాది
వేదాంతకోశముల్ వెలయఁ జేసె,
వేయు నేటికి విజ్ఞాన భిక్ష నేటి
యాంధ్రజాతికిఁ బెట్టిన దతఁడ కాదె,
శాబ్ద వేదాంత హోరాది శాస్త్రవిదుఁడు
నోరి గురులింగబుధుఁడు విస్తారయశుఁడు. ౧౧౪

తే. అస్మత్పితృపాదుం డగు హనుమద్బుధుండు, ౧౧౫

తే. సంస్కృ తాంధ్ర సాహిత్య వశంవదుండు,
శ్రీమహా పాదుకాంత దీక్షా మహితుఁడు,
జనకుఁడు మదీయ సవితృదీక్షాగురుండు,
విదిత పండితకవి నా కవిత్వగురుఁడు. ౧౧౬

క. శ్రీమాతయె యీరీతిగ
నీమెయి ధరియించి యవతరించె ననఁ దనర్, 
క్షేమహిత మహాలక్ష్మ్యసి
నామాత్రం గొల్తు భక్తి మహితస్వాంతక్. ౧౧౭

వ. వారికి రాజగోపాలశాస్త్రియు, సీతారామశాస్త్రియు, వేంకట లక్ష్మీ నరసింహశాస్త్రియు, చంద్రశేఖరశాస్త్రియు నను నలువురు పుత్త్రులును, రాజ్యలక్ష్మి యను పుత్త్రికయుం గలిగిరి. అందుఁ దృతీయ పుత్త్రుండ నగు నేను కౌండిన్యసగోత్రుం డగు నేతి శ్రీరామశర్మ పుత్త్రి మత్పితృసనామ్ని ధర్మపత్నిగాఁ బరిగ్రహించి సకుటుంబంబుగా శ్రీ జగద్గురుకరుణా కటాక్షపాత్రుండనై వర్ధిలుచుండు. ౧౧౮

క. కల్యాణాస్పదచరణా!
కల్యాణైకస్వరూప! కల్యాణగుణా!
కల్యాణప్రద! భారతి!
కల్యాణానందనామ! ఘనయతిసోమా! ౧౧౯

క. సాక్షా ద్వ్యాసుఁడ వంచును,
సాక్షాత్పరదేవి వంచు, సత్కవి వంచున్,
వీక్షించి, సమర్పించితి;
నక్షయ్యకటాక్ష మిందు నమరింపఁగదే! ౧౨౦

క. ప్రజ్ఞాన ఘన కథాద్యుతి
నజ్ఞానధ్వాంత పరమహంసార్పిత మీ
విజ్ఞానయోగి కృష్ణో
పజ్ఞము తనప్రజ్ఞ నిట్లు ప్రతిదీపించున్. ౧౨౧

తే. అవధరింపు, భవత్పూజ్య హస్త పంక
జాభిషేచన సామ్రాజ్య శోభితుండు,
దివ్యమగు విద్య విజ్ఞానదీక్షితుండు,
పట్టికాశ్రీకుఁడు కవిసమ్రాట్టు, పలుకు. ౧౨౨

శౌనక ప్రశ్న

తే. పుణ్యమై యొప్పు నైమిశారణ్యభూమి
శౌనకాదులు కలిభీతి సంశ్రయించి;
రందుఁ బౌరాణికోత్తముఁ డయిన సూతుఁ
గాంచి శౌనకమౌని భాషించె నిట్లు. ౧౨౩

శా. సూతా! ధన్యుఁడ వయ్య! శుద్ధులఁ గడున్ శుద్ధుండ వీవే; పరి
జ్ఞాతం బయ్యెఁ బురాణసంహిత సమస్తంబున్ సమర్థంబు నీ
చేతన్ వ్యాసమునీంద్రుకూరిమి; భవచ్చిత్తంబు తాపత్రయా
పేతంబౌతఁ; జిరాయు రున్నతి యశస్స్ఫీతుండవై వెల్గుమా. ౧౨౪




తే. మునుల విశ్రామదేశ మీ పుణ్యవనము
విశ్వసననామకం బయి వెలయు నిందుఁ
గూడిన మునీంద్రసమితికి వేడుకయ్యె
బ్రహ్మసమ్మిత దివ్యపురాణము విన. ౧౫

తే. షాడబోపేత రుచిరాన్న సన్నికర్ష
జిహ్వాకాహ్లాద మేరీతి సిద్ధ మట్లు
బుధిమంతుల వాక్సుధాపూరములను
శ్రోత్రి మానందకందళ చుంబిత మగు. ౧౬

తే. చెవులు లేనట్టి చిలువలే యవశము లయి
యాడును మనోహరధ్వని కనుగుణముగఁ;
జెవులు కల్గియు వా రయ్యొ! చెవిటివారె,
విధిహతులు సత్కథావళి వినని నరులు! ౧౭

మ. కలికిన్ భీతిలి యీ పవిత్రతమమహా కాంతారమధ్యమ్మునన్
కలి వర్జ్యం బని చేరి, పాసి కలుఁకంపఁ; గాలంబు వెళ్లింప, ని
చ్చలు శాస్త్రార్థములం బురాణకథలన్ జన్నంబులన్ సత్రదీ
క్షల నా సత్యయుగప్రతీక్ష నిటు వాసం బుంటి మో పుణ్యులా!

క. వేదాంతము సాత్త్విక మగు,
నాదట మీమాంస రాజసాత్మకము నగున్,
వాదవితండము న్యాయం,
బాదిం ద్వ్యాజ్యంబు తామసాత్మక మగుటన్. ౧౯

క. ఏచాయ శాస్త్రరీతులా,
యాచాయఁ బురాణచయము నగుఁ ద్రిగుణంబై;
వాచంయమీంద్రు లిందున్
యాచింతురు శుద్ధసాత్త్వికాఖ్యానంబున్. ౨౦

ఉ. ఏది స్మరింపఁ గామదుఘ, మేది వినన్ సకలార్థ సిద్ధిదం,
బేది పఠింప ధర్మకర, మేది విచింతన సేయ ముక్తిసం

పాదక మహా ముముక్షులకుఁ భవ్యము దివ్యము వేదసమ్మితం
జేది పరాత్పరం, బది వచింపుము భాగవతాఖ్యసంహితన్. ౧౩౪

తే. యజ్ఞశతము లొనర్చి నే మలసినాము;
శాంతి నొందము కేవల స్వర్గవాంఛ;
నమృత మేల పునర్జన్మ మగునయేని?
జ్ఞానమే వినా మోక్షసిధాన మున్నె? ౧౩౫

క. కావున నే మర్థింతుము
పావనము రసైకఘుటిక పరమరహస్యం
బావలఁ జేర్చెడుతరి శ్రీ
దేవీభాగవతకథను దెలుపఁగ సూతా! ౧౩౬

## కథాప్రారంభము

క. ధన్యోస్మి యంచు సూతుఁడు
మున్యాదేశంబు వించు, మూర్ధాంజలిబం
ధన్యాసమ్మునఁ దగి, స
మ్మాన్యము లగు పలుకు లిట్లు మాలిమిఁ బలికెన్. ౧౩౭

క. ఆహా నా సౌభాగ్యము!
మోహాళి విదల్చి ముక్తి మునుకొను దేవీ
మాహాత్మ్యసత్కథావళి
వ్యాహరింపంగ మీర లాజ్ఞాపింపన్. ౧౩౮

తే. వ్యాసఋషి తదుపజ్ఞమహా భాగవతము
నం దధిష్ఠాత్రియై పొల్చు నాదిలక్ష్మి,
దీపశిఖవోలె మూఁడు వర్తికలమెలిసి
యేకమై వెల్గు నార్ద్రిమై యెడఁద ప్రమిద. ౧౩౯

తే. అఖిలశాస్త్రంబులందు గుహ్యాతిగుహ్య,
ముత్తమాగమములలో ననుత్తమంబు

వేదవిదితంబు శ్రుత్యర్థవిహితపదము
నౌ పురాణంబు ప్రవచింతు ననఘులార! ౧౩

కం. ఖ్యాలితముఁ దత్పదకంజముఁ
గొలుతుఁ, యోగులకు ముక్తిఁ గూరిచి, బ్రహ్మా
దులకుఁ సేవ్యం బై, హా
నులకుఁ ధ్యేయైకపదము, నుతసత్పథముఁ. ౧౩౮

ఉ. వేదములందు విద్య యని విశ్రుత మెయ్యది, యాద్యశక్తి యా
నేది, పరాభిదం బెఱుక యేది, విదిర్వఁగ బంధముల్ క్షమం
బేది, దురాత్మదుర్విషయ మేయది, హానికి ధ్యానగమ్య హా
నేది, య దే మదిఁ నిలిచి నృత్యము సేయుత మాయితంబుగా.

మ. చిదచిద్రూపక హా జగత్త్రఖిలముఁ సృష్టించి పాలించుచుం,
దుది సంహారము చేయు ముత్తెఱఁగులై తోల్కాడు శక్తిత్రయిఁ,
అద నైనఁ రమియించు నొక్కతయె యాత్మానందయై దాని నె
మ్మది ధ్యానించెద విశ్వసూతి నపరఁ మన్మాత నాత్మాత్మికఁ.

తే. ఈ సమస్తంబు బ్రహ్మ సృజించె నంచుఁ
బ్రథిత హాను బౌరాణికవచనసరణి;
బ్రహ్మ జనియించె హరినాభిపద్మమందు;
నన, స్వతంత్రుఁ డని వచింప నగు నె వాని? ౧౪

తే. ప్రళయకాలంబునఁ బయోధిజలములందు
శేషుని సహస్రఫణాశయ్యఁ జేర్చి మేను
నుఱచి కను మోడ్చి నిద్రించు మాధవుండు,
నస్వతంత్రుఁడ; భగవంతుఁ డగుట యెట్లు? ౧౪

తే. అచ్యుతాధార మైన యేకార్ణవమును
బ్రభు వనఁగ రా దపాత్రమై రసము లేమి,
భూత సర్వస్వమున శక్తిభూత యెవ తె,
శరణు చొచ్చెద నే దాని సర్వజనని. ౧౪

క. అజుఁ డంబుజస్థితుం డయి
నిజజనకుం గాంచి యోగనిద్రావశుఁగా,
భజియించె నెట్టి దేవిని,
భజ రే మన, యట్టి దేవి, భక్తశరణ్యన్. ౧౪౪

క. దానిని మాయన్ సగుణన్
దానినె నిర్గుణను ముక్తిదాత్రిని మదిలో
ధ్యానించి చెప్పఁ దొడఁగితి,
మానులు వినుఁడీ పురాణమాణిక్యంబున్. ౧౪౫

పు రా ణ ప్ర శం స

వ. అయ్యదియు శ్రీమద్భాగవతాభిధానంబునఁ బరమపుణ్యంబై, పదు నెనిమిదివేలు శ్లోకములు గలుగ, ద్వాదశస్కంధ సమ్మితం బై, మున్నూట పదునెనిమిది యధ్యాయంబులతో నొప్పు. అందుఁ బ్రథమస్కంధంబున నిరువదియు, ద్వితీయంబునఁ బండ్రెండును, తృతీయంబున ముప్పదియుఁ, జతుర్థంబున నిరువదియైదును, నైదవ స్కంధంబున ముప్పదియైదును, షష్ఠంబున ముప్పదియొక్కటియు, సప్తమంబున నలువదియు, నెనిమిదవ స్కంధంబున నిరువదినాల్గును, నవమంబున నేఁబదియు, దశమంబునఁ బదుమూఁడును, నేకాదశంబున నిరువదినాల్గును, ద్వాదశస్కంధంబునఁ బదునాలుగధ్యాయంబులును విలసిల్లు. మఱియు, శ్రీదేవీమహాపురాణంబు ప్రతిస్కంధ రసబంధు రంబై, ముముక్షుజన ప్రియంబై, యష్టాదశసాహస్రి సంహిత నాఁ బరగు. ౧౪౬

తే. సర్గ మనఁగను మఱి ప్రతిసర్గ మనఁగ
వంశ వంశానుచరిత మన్వంతరములఁ
బంచలక్షణ యుక్తమై పరగు చుండు
నార్షకృతులు పురాణవిఖ్యాతి నెసఁగు. ౧౪౭

తే. సత్యముగ నిర్గుణము బ్రహ్మ నిత్య మయ్యు
యోగిగణములఁ గృపతో సముద్ధరింప
వికృతియై వ్యాపికాకృతి వెలయును శివ
యయ్యది చరాచరాధార యగు తురీయ. ౧౪౮

సీ. దాని శక్తులు మూఁడు తన్వాతనువు లూను,
నందు మహాలక్ష్మి స్వచ్ఛసత్త్వ,
రాజసాత్మ మహాసరస్వతి యగు, మహా
కాలిక తామసాకార యగును;
ఈ మూఁడు శక్తులు సృష్ట్యర్థమై దేహ
సంగతి నొందుట సర్గ మండ్రు;
సృష్టి స్థితి వినాశ దృష్టిమై విధి హరి
శంకరజని ప్రతిసర్గ మండ్రు;
వంశ మగుఁ జంద్ర సూర్యాది వంశ్య గణన,
మఖిల మనుకాల గణన మన్వంతర మగు,
వారి వంశానుచరితమౌ వంశగణన;
పంచలక్షణ మీరీతి భాగవతము. ౧౪౯

తే. ఇట్లు పల్కిన సూతు నీక్షించి పల్కె
శౌనకుఁడు మౌనిసమితికి సమ్మతముగ,
స్మృతిపథమ్మునఁ దమ పూర్వవృత్త మూడ,
మఱియు నెఱుఁగఁ బురాణసమస్తమహిమ. ౧౫౦

ఉ. నేము కలిప్రవేశమున నేమరభీతి నజున్ భజింపఁగా
నా మునిపూజ్యుఁ డొక్క మహిమాన్వితచక్రము నిచ్చి, చక్రపు
న్నేమి విశీర్ణ మౌ నెచట నిల్చుఁ, డటన్ కలిబాధ లే దనెన్,
నైమిశ మయ్యె నేమి యిట నాశము నొందుట బ్రహ్మవాక్కులన్.

ఉ. ఏము తదాది నీయెడ మునీంద్రులు సిద్ధులు నాశ్రయించి యు
న్నా మిట నేకచిత్తుల మనామయ మీ రుచిరాశ్రమంబు, సూ

తా! మహనీయచిత్త! కడు ధన్యుల మైతిమి ... నే;
నామము లేవి తెల్పుము, వినఁగా మన సయ్యెఁ బురాణజన్మముల్.

తే. వితత సుగుణైకపాత్రమై యతి పవిత్ర
మఖిల జగదంబికానాట్య మటు విచిత్ర,
మఘకదంబంబు హరియించు నర్థకంద,
మది వచింపుము వ్యాసోక్త మంబిక కథ. ౧౫౩

వ. అన విని సూతుం డిట్లనియె. ౧౫౪

తే. భద్వయము, మద్వయంబును, బ్రత్రయంబు,
వచతుష్కము, లనాపకూర్మలయు నాల్గు,
స్కాంది యొక్కటి, లింగాదు లగును రెండు,
తెలియుఁ డష్టాదశపురాణము లివి యనుచు. ౧౫౫

వ. అందు, మాత్స్యంబు పదునాలుగు వేలును, మార్కండేయంబు తొమ్మిది వేలును, భవిష్యంబు పదునాలుగు వేల యైదువందలును, శ్రీమద్భాగవతంబు పదునెనిమిది వేలును, బ్రాహ్మంబు పది వేలును, బ్రహ్మాండంబు పన్నెండు వేలును, బ్రహ్మవైవర్తంబు పదునెనిమిది వేలును, వామనంబు పది వేలును, వాయవ్యం బిరువదినాలుగు వేలయాఱునూఱులును, వైష్ణవం బిరువదిమూఁడు వేలును, వారాహం బిరువదినాలుగు వేలును, అగ్నిపురాణంబు పదునాఱు వేలును, నారదం బిరువదియైదు వేలును, పాద్మం బేఁబదియైదు వేలును, లైంగంబు పదునొకండు వేలును, గారుడంబు పందొమ్మిది వేలును, కూర్మంబు పదునేడు వేలును, స్కాందం బెనుబదియొక్క వేలును, శ్లోకంబులు గలిగియుండు. మఱియు, సనత్కుమారంబు, నారసింహంబు, నారదీయంబు, శైవంబు, దౌర్వాసంబు, కాపిలము, మానవము, ఔశనసము, వారుణము, కాలికము, సాంబము, నాందికేయము, సౌరము, పారాశరము, ఆదిత్యము, మాహేశ్వరము, భాగవతము, వాసిష్ఠము, ననునుపపురాణంబులు పదునెనిమిదియు నార్షసమ్మతంబులై యొప్పారు. ౧౫౬

తే. ఎలమి నష్టాదశపురాణములను నుడివి,
యధ్యాపయశుండు సాత్యవతేయుఁ, డర్థిఁ
దదుపబృంహితమ్ముగ భారతమ్ముఁ బలికె,
నుద్ధరింపఁగ వేదబాహ్యులను గరుణ. ౧౫౭

క. ప్రతిమన్వంతరమందలి
ప్రతి ద్వాపరమందు వ్యాసభగవానుండై
హిత మాచరింప జగతికి
నతి కృప హరి యవతరించు నవతారంబుల్. ౧౫౮

వ. మహర్షిసత్తములారా! వినుండు. వైవస్వతాభిధం బగు నీ సప్తమ మన్వంతరంబున నిరువదియెనిమిదవదగు ద్వాపరంబున, శ్రీహరి, సత్యవతియందుఁ బరాశరుని వలన వ్యాసుండై యవతరించె. పరమధర్మవిదగ్రుఁ డగు సాత్యవతేయ గురు ననుగ్రహంబున నే నఖిల పురాణసంహిత నభ్యసించితి. భవిష్యం బగు నిరువదితొమ్మిదవ ద్వాపరమ్మున ద్రోణపుత్త్రుఁ డగు నశ్వత్థామ వ్యాసుండై యవతరించు. కడచిన యిరువదియేడుగురు వ్యాసులును నాయాయుగంబుల లోక హితార్థంబయి పురాణసంహితలఁ బ్రవచించిరి. అందుఁ బ్రథమద్వాపరంబున స్వయంబుగా స్వయంభువు వ్యాసుండై, వేదంబుల విభాగించె. ద్వితీయద్వాపరంబునఁ బ్రజాపతి వ్యాసుం డయ్యె. తృతీయంబున ఉశనసుండును, చతుర్థంబున బృహస్పతియుఁ, బంచమంబున సవితయు, షష్ఠంబున మృత్యువు, సప్తమంబున మఘవుండును, అష్టమంబున వసిష్ఠుండును, నవమంబున సారస్వతాభిధానుండును, దశమంబునఁ ద్రిధామనాముండును, ఏకాదశంబునఁ ద్రివృషుఁడును, ద్వాదశంబున భరద్వాజుండును, త్రయోదశంబున నంతరిక్షుండును, చతుర్దశంబున ధర్ముండును, పంచదశంబునఁ ద్రయ్యారుణియు, షోడశంబున ధనంజయుండును, సప్తదశంబున మేధాతిథియు, అష్టాదశంబున వ్రతియు, ఏకోనవింశంబున అత్రియు, వింశంబున గౌతముండును, ఏకవింశంబున నుత్తముండును, ద్వావింశమ్మున వాజశ్రవుం

డగు వేనుండును, త్రయోవింశమ్మున ఉముష్యాయణుం డగు సోముండును, చతుర్వింశంబునం దృణబిందువు, పంచవింశమ్మున భార్గవుడు, షడ్వింశంబున శక్తి, సప్తవింశంబున జాతుకర్ణుండు, అష్టావింశంబునం గృష్ణద్వైపాయనుండును, వ్యాసధర్మంబును నెరపిరి.

క. ఆ కృష్ణద్వైపాయన
ధీకల్పక దివ్యఫలము దీర్ఘాయుష్యం
బాకర్ణించితి వీనుల
నా కరుణాపూర్ణ గురుకటాక్షావాప్తిన్. ౧౬౦

క. వైరాగ్యయుక్తుం డై సం
సారార్ణవ దుర్విగాహ జలము తరింపన్
గోరి శుకుం డర్థించినం,
బారాశర్యుండు దీని వాక్రుచ్చె దయన్. ౧౬౧

శా. శ్రీమద్భాగవతం బఘాంధ్యములు తూలించుం బరంజ్యోతియై,
సీమాంతంబుల కార్తిమేఘములు పోం జిమ్మన్ మహావాయువై,
యామూలాగ్రము కుద్దలించు భవవృక్షౌఘంబు కుద్దాలమై,
కామాద్యం బగు శత్రుకానన మడంగం గాల్చు దావాగ్నియై.

శా. శ్రీమద్భాగవతంబు పుణ్యదము సుశ్లోకమ్ము మోక్షాస్పదం
బామోదావహ మిష్టకామదము శాస్త్రానేకసారాళి కా
రామక్షోణి రసైకపాత్రము శ్రుతిప్రఖ్యాతవాక్యార్థము
జ్ఞామంజూష శుభప్రదం బది సమాకర్ణించినం బల్కినన్. ౧౬౩

క. శ్రీమద్భాగవతామర
భూమీరుహ రుచిరఫల బుభుక్షువులారా!
ఈ మహితక్షితి మీరలు
నేమనంబున విన్న ముక్తిసిద్ధిం గను టరుదే? ౧౬౪

శా. పాపీయుం డయి వేదధర్మవిహిత స్వాచారహీనుండు కా
నీ, పుణ్యోత్తరసత్పురాణము యదృచ్ఛేచ్ఛంబుగా విన్నచో,

ప్రాపించున్ బహుభోగ మాతనికి, నాపై దేహపాతంబునన్
శ్రీపాదాంకితసుందరం బఖిలమాన్యప్రాప్య నిర్వాణమున్. ౧౬౫

తే. హరిహరాదుల కైన దురాప మయ్యుఁ
బండిత సమాధిగమ్యమౌ పరమవిద్య,
యొనఁగు దేవీపురాణ మాలించు శ్రద్ధ
నతని చిత్తాబ్జపీఠము నధివసించు. ౧౬౬

క. వినిపించిన వినఁ డెవ్వఁడు
జననవనిధితరణనౌక సకలేశకథన్,
వినుదతిఁ బరనిందల, నా
మనుజుని తను వేల? వినికి మనికియు నేలా? ౧౬౭

శుకోత్పత్తి ప్రశ్నము

క. అని పలికిన సూతునిఁ గని
మును లడిగిరి వ్యాససుతుని పుట్టుక యెట్టులో?
జనితోఁ గవి యగు నతఁ డెటు
విని భాగవతంబు? వినఁగ వేడుక యయ్యెన్. ౧౬౮

వ. నావుడు సూతుం డి ట్లనియె. ౧౬౯

తే. పూర్వము సరస్వతీతీర పుణ్యభూమి
నాశ్రమమున సాత్యవతేయుఁ డధివసించి,
యుండుఁ గలవింక మిథునచర్యలను గాంచి
చూతఁ డొకనాఁడు విస్మితుఁ డయ్యె మిన్నుల. ౧౭౦

సీ. అవిసినంతనె యండ మతి మనోహరముగా
శిశు వొండు జన్మించి, చెలఁగి గూటఁ;
చాంద్రమాస్యమై శుభతన్వంగసర్వమై
పిచ్ఛాంకురము లేక వెలయుదాని
మాటిమాటికి దాని మాతాపితలు ప్రీతి
ముక్కున ముక్కుఁ జేర్చి బువ్వఁ బెట్టు;

బిడ్డ సర్వాంగముల్ బ్రేమతోఁ దడవుచు,
మై మెయి రాయుచు మరల రాయు;
ముఖము ముద్దిడుఁ బ్రేమతో ముఖముఁ జేర్చి
చూచుఁ, జూచినదుఁగనే చూచి మురియు;
నద్భుతం బయి వాత్సల్య మతిశయింపఁ
జటకదంపతి కాత్మలో క్షణముక్షణము. ౧౭౪

తే. చాల్మైరంబుపై నెదఁ జటకములకుఁ
బొంగు నద్భుతప్రేమపు బుగ్గఁ గాంచి
వ్యాసుని మనస్సు, మిగులఁ జింతాతురమ్మ
గాఁగ నిట్లని తర్కింపఁగాఁ దొడంగె. ౧౭౫

ఉ. ఈ కలవింకయుగ్మ మతిహీనవిహంగమజాతి, కామభో
గైక సమర్థమాత్ర ముపయామము వీనికి, వార్ధకంబునం
దీ కవపోషణం బయిన నియ్యది చేసెడియాస లేదు; కా
నీ, కడుఁ జోద్య మయ్యె నివి యిట్టులు పొంగుట పుత్రజన్మకున్.

సీ. స్వర్గలోకావాప్తి సాధించునా పుట్టి?
మృతి గన్న జనుపునా ప్రేతవిధులు?
సలుపునా గయలోన శ్రాద్ధపిండజలంబు?
విధిగ నీలోత్సర్గవిధి నెరపునొ?
ధర్మిష్ఠుఁడై వీనిఁ దనియించునో, పుణ్య
భాగ్యంబు విత్తసంపత్తిఁ గూర్చి?
పుత్త్రపరిష్వంగ భోగ మొక్కటి దక్క
యోజింప లే దే ప్రయోజనమ్ము;

నిట్టి తిర్యక్కులకె ప్రేమ యింతయైన
నెంత యనవచ్చు నరుల పుత్త్రైషణమ్ము?
లే దపుత్త్రునకుఁ బరంబు లే దటంచు
స్మృతులు ప్రత్యక్షముగను ఘోషించు శ్రుతులఁ, ౧౭౬

క. ఏ మగు సాధన మింతయు,
నీ మందిర మెవ్వఁ డనుభవించునొ, యుంచున్,
స్వామీ శయ్యన్ దుఃఖ
గ్రామాన్వితుఁడై, దుర్గతి ననపత్యుఁడు కూలున్. ౧౬౫

తే. ఇట్లు వ్యాసుం డనేకథా మొసఁగు చింత
నుష్ణమై దీర్ఘమగు నక్క యూర్పు పుచ్చె;
మది విచారించి మనసు సుస్థిరము చేసి
తపము చేయంగ మేరువు దరికి నరిగె. ౧౬౬

మ. హరియో రుద్రుఁడొ కార్తికేయుఁడొ సహస్రాక్షుండొ లోకేశుఁడో,
వరుణుండో యినుఁడో గణేశుఁడొ జగత్ప్రాణుండొ సప్తార్చియో,
వరదానప్రవణుండు నా? కని మదిన్ వ్యాసుండు తర్కించుచుం
డ, రవిజ్యోతియుఁ బోలె నారదుఁడు వీణాపాణియై కన్పడెన్. ౧౬౭

క. వచ్చిన సురముని కాసన
మిచ్చి సమర్చించి యర్ఘ్యమిచ్చి సుపాద్యం
బిచ్చుచుఁ గుశలం బడుగ, వి
యచ్చరముని, హేతు వడిగె వ్యాసుకలంతరున్. ౧౬౮

తే. అంత, వ్యాసుండు దేవర్షి కనియె నిట్లు:
పుత్త్రవిరహితునకు లేవు పుణ్యగతులు;
సుతునిఁ గామింతు; నామది సుఖము లేదు;
మఱి విచారింతు నందుకే మరల మరల. ౧౬౯

ఆ. పుత్త్రుఁ డెట్లు గలుగుఁ? బుత్త్రుఁ బ్రసాదించు
పుణ్యదైవ మెద్ది పూజ సేయ?
శరణు సొచ్చినాఁడ, సర్వజ్ఞ! సెలవిమ్ము;
యెవని పూజ సేతు? నేది దిక్కు? ౧౭౦

క. వ్యాసుఁడు చేసిన ప్రశ్నం
బా సంయమివరుఁడు వించు ననె నాదృతిని.

ట్టి సంప్రశ్నమె విష్ణునిఁ
జేసెన్ మాతండ్రి మున్ను, చెప్పెద వినుమా. ౧౮౧

శా. శ్రీనాథుండు జగద్గురుండు విలసత్ శ్రీవత్సవక్షుండు ని
ధ్యానస్థుం డయి యుండ, వేధ యొకనాఁ డత్యద్భుతావిష్టుఁడై
కానన్ లేక తదీయహేతు, వెఱుఁగం గాంక్షించె దామోదరున్
శ్రీనారాయణు నాదిదేవు హరి శౌరిన్ విష్ణు సర్వాత్మకున్. ౧౮౨

తే. భూతభవ్యభవత్ప్రభూ! పీతవసన!
దేవదేవ! జగన్నాథ! తెలియఁ జెప్పు
దేనికై తప మొనరింతు? ధ్యేయ మేది?
విస్మయం బయ్యె ధ్యానింప విశ్వపతివి. ౧౮౩

క. నీ వాదికారణంబవు;
నీవే కర్తవు, సమస్త నిర్వాహకుఁడవున్;
నీవే సంహర్తవు తుది;
నీవే సకలార్థకరణ నిపుణుఁడవు హరీ! ౧౮౪

క. నీ నాభిన్ జన్మించిన
నే నీయాజ్ఞన్ సృజింతు నిఖిలజగత్తున్;
దానికిఁ గాలము రా, నీ
శానుఁడు, నీయాన, సమయుఁజలుపును దేవా! ౧౮౫

క. రవి తిరుగు, టగ్ని కాల్చుట,
పవనుని చలనంబు, మఘవు వర్షించుట ము
న్నవు నివి నీయాజ్ఞనె; ప్రభుఁ
డెవఁ డుండుఁ బరుండు నీకు నిటు ధ్యానింపన్? ౧౮౬

తే. ఇట్లనంగ బ్రహ్మ, హరి వచించెఁ బ్రీతి:
వత్స! విను మేకమనమునఁ బల్కెదాని,
స్థితికి నే, నీవు సృష్టికి, హతికి శివుఁడు,
కారణము లంద్రు నరదేవగణములెల్ల." ౧౮౭

క. కానీ నీకున్ నా కీ
శానునకుం గారణంబు శక్తి యటంచున్
జ్ఞానులు శ్రుతిపారగు లగు
మానుల సిద్ధాంతవచనమార్గము, వత్సా! ౧౮౮

క. నాయందు శక్తి సాత్త్వికి,
యా యీశుని శక్తి తామసాత్మికయు నగున్,
నీయందు రాజసం బగు,
నాయంబకు ముప్పురమును స్వాధీనులమే. ౧౮౯

క. నేను స్వతంత్రుఁడ నెన్నఁడుఁ
గా, నెఱుఁగవె శేషశయ్యఁ గనుమూయుదుగా,
నే నాశక్తి కధీనుఁడ
నై నిత్యము తపము సేతు, నదియే కొలుతున్. ౧౯౦

మ. ఒకనాఁ డామె యనుజ్ఞ శ్రీ మెఱయఁ, గ్రీడోల్లాసినై యుందు; నిం
కొకచో దానవకోటితో భయదమౌ యుద్ధంబు సర్వాంగముల్
వికలంబై చనఁ జేయుదుం; దెలియవో వీక్షింపవో మున్ను జ్ఞ
ప్తికి రాదో, మధుకైటభాసురులతో విఖ్యాత దోర్యుద్ధమున్. ౧౯౧

తే. జగతి యేకార్ణవం బైన సమయమందుఁ
గర్ణమలభూతులై మదగర్వితు లగు
వారితో నైదువే లేండ్లు పోరి జయముఁ
గంటి దేవీప్రసాదంబుకలిమిఁ దుదకు. ౧౯౨

క. గడగడ వడఁకుచు బడలిన
వడువున నుడివడుచు వ్రాలి పద్మముమీఁదన్
పడియుంటి వప్పుడు చూడవో
యడిగెదు మఱి కన్నులార నరసినదానిన్. ౧౯౩

తే. కూర్మమై క్రూర నరసింహమై కోలమ యయి
యేల తిర్యక్కు నౌదు నే స్వేచ్ఛ యున్న?

నా పరాశక్తి, కింకరుం డౌదు నేను;
హీనయోనిజన్మం బెవఁ డిచ్చగించు? ౧౯౪

తే. పూర్వ మొకమాఱు నాశార్ఙ్గమౌర్వి విరిఁగి
శిరము తెగిపోవఁగా హయశిరముఁ దెచ్చి
శిల్పిచే నీవె యోజింపఁ జేసినావు;
హయశిరుఁడ నైతి, నెఱుక యున్నదియొ లేదొ! ౧౯౫

క. శక్తికి స్వాధీనుఁడ నై
శక్తినె ధ్యానింతు నేను సతతము భక్తిన్;
శక్తికిఁ బరతర మగునది
శక్తుఁడఁ గా నే వచింప, సత్యము వత్సా! ౧౯౬

తే. ఆ మహావిష్ణు వాక్యము లబ్జజుండు
తాను విన్నవి నాకును దయ వచించె;
నఖిల కల్యాణ కామితావాప్తి యగును,
నీవు హృద్వీధి నిలుపు శ్రీదేవి పదమె. ౧౯౭

తే. వ్యాసుఁ డాలించి నారదువచనసరణి,
నాత్మ యుప్పొంగ దేవీపదాబ్జయుక్తిఁ,
దప మొనర్చెను మేరుపుతటమునందు
నంచుఁ బల్కిన సూతున కనిరి మునులు. ౧౯౮

హయగ్రీవావతారము

తే. విస్మయం బయ్యె, నుతియించు వేద మెవని,
నాదిదేవుండు మాధవుం, డతని శిరము
దైవయోగంబుచే నెట్లు తెఱుఁగఁబడియె?
హయవదనుఁ డెట్టు లయ్యె జనార్దనుండు? ౧౯౯

వ. అనిన సూతుం డి ట్లనియె. ౨౦౦

తే. అదియు తెల్పెద వినుఁడయ్య సావధాన
మైన మనమున మీ రెల్ల మాన్యులార!
శర్మదంబును సకలార్థసాధనంబు
దేవదేవేశుపావన దివ్యగాథ. ౨౦౧

క. వేయేండ్లు దశక మసురల
తో యుద్ధము చేసి యచ్యుతుఁడు శ్రాంతుండై
పై యొఱఁగక సజ్యధను
స్సే యవలంబించి కోటి నెంతయుఁ గూర్కెన్. ౨౦౨

క. పద్మాసనుఁడై యొక్కెడఁ
బద్మాపతి విల్లు కంఠభాగమునందున్
ఛద్మగతి వ్రేలఁగా నిజ
సద్మంబునఁబోలెఁ గోసయె స్వాపనిరూఢిన్. ౨౦౩

తే. హయశిరోనామకాసురహతికి సురలు
మఖ మొకఁడు చేయఁ దలపెట్టి మఘవుఁ గూడి
విధిహరులు ముందుఁ జన నొక్కవేళఁ జనిరి
ప్రభువు మఖపతి విష్ణు దర్శనము చేయ. ౨౦౪

తే. చక్రి వైకుంఠమున లేమి, జ్ఞానదృష్టి
నెఱిఁగి కలచోటు, చేరెను సురగణమ్ము;
చేరి చూచె విచేతను శౌరి విష్ణు
యోగనిద్రావశాత్ముఁడై యున్న విభుని. ౨౦౫

తే. దేవదేవుఁడు నిద్రింప, దేవగణము
చింత నొందె నొక్కింతయుఁ జేయ లేక;
సురపతి వచించెఁ "బల్కుఁడీ, సురగణములు,
భంగ మొనరింప నిద్ర కుపాయ మేమొ". ౨౦౬

శా. రుద్రుం డంతట దేవతాళి కిటులన్ రూపించెఁ గర్తవ్యమున్;
నిద్రాభంగము చేయ రా, దయినఁ గానీ, యజ్ఞకార్యంబుగా

భద్రం బౌ నొక వమ్రి సృష్ట మయి భూపాన్విష్ఠ ధన్వాగ్రము
చ్ఛిద్రింపన్, ధనువుల్ విముక్త మగు, నీ శ్రీనాథుఁ డున్నిద్రుఁడౌ.

తే. శివుని ధ్యానంబు నొదలఁ జేర్చి, యపుడు
వమ్రి నొకదాని సృష్టించెఁ బద్మభవుఁడు;
దేవకార్యముఁ దీర్ప సందిష్ట మయ్యు,
వమ్రి యొల్లక వేధతోఁ బలికె నిట్లు. ౧౧౮

ఆ. తెలుపుగల ప్రీతి యుడుచుట, కథమధ్య
విఱచుటయును, వేఱుపఱచుటయును
నిసువుఁ దల్లినుండి, నిద్దురఁ జెఱచుట
బ్రహ్మహత్య లంచుఁ బల్కు స్మృతులు. ౧౧౯

ఆ. ఏమి కోరి సేతు నీ మహాపాపంబు!
పాతకంబు సేయు ఫలము వలదె?
దేవదేవ! నిద్ర దెలిపినచో నాకుఁ
జేయు లాభ మేమొ చెప్పుమయ్య! ౧౨౦

వ. దానికి బ్రహ్మ యిట్లనియె. ౧౨౧

క. మఖభాగము గల్పించెద
మఖహూతులను వమ్రి! పార్శ్వ మఖస్థలితం బౌ
మఖహవ్యము నీ కిచ్చితి;
సుఖముండుము; వేగ దీర్పు సురకార్యంబున్. ౧౨౨

తే. అ ట్లనుజ్ఞాత యై వమ్రి యంతి మొనసి
వేగమే నేల నాసిన వింటి కొనను
విఱియఁగా మౌర్వి ధనువును త్తరపుకొప్పు
ముక్త మయ్యె మహాధ్వని ముక్త మయ్యె. ౧౨౩

శా. క్షోణీభాగము దద్దరిల్లి యదరెన్, క్షోభిల్లె బ్రహ్మాండ మ
క్షీణోద్విగ్నము లయ్యె వారినిధు, లబ్ధిప్రల్ కలంగెన్, గిరు

శ్రేణుల్ కంపము నొందె, దిక్తటుల వీఁచెన్ ఘోరవాతూలముల్,
ప్రాణస్థానమునన్ నిరంతర మహోల్కా వర్షధారల్ పడెన్. ౨౧౪

తే. ఇటు మహోత్పాతములు పుట్ట నెల్ల దిశలు
భూరిదుఃఖానుశంసన ఘోర మయ్యె,
నంధతమము వ్యాపించె నహస్కరుండు
కాన రాకుంట సుర లెల్ల మ్రానుపడిరి. ౨౧౫

తే. కొంతవడి నంధకార మొక్కింత విరియ
నరమకుటకుండలోద్భాసి శిరము లేని
దేవదేవుని విష్ణుని దివ్యతనువు
వికృతరూపంబు గాంచిరి విధియు శివుఁడు. ౨౧౬

క. అయ్యో! నాథా! యిది యే
మయ్యా! ప్రభు! దేవదేవ! హరి! యెవ్వరిమా
యయ్యా! యిఁక దిక్కెవ రని
కుయ్యిడెను సమస్త దేవకోటియు నార్తిన్. ౨౧౭

తే. నీ వభేద్యుఁడ వచ్ఛేద్య నిపుణగతివి
మాయ కీశుఁడ వౌట నే మాయ యేనిఁ
బ్రభు! జగద్గురు! నినుఁ గ్రిందు పఱుప లేదు;
నీవు లేకున్న మే మెట్లు నిలువఁ గలము? ౨౧౮

తే. రాక్షసులు కాదు చేయరు యక్షు లెవరుఁ,
జేతులారంగ నిది మేమె చేసికొంటి;
నేమి చేతుము? మే మిప్పు డెందుఁ బోదు?
మెవరు శరణంబు? మా కింక నేది దిక్కు? ౨౧౯

తే. శివపురోగమ మైన దేవనివహ మేడ్చు
చుండ వారించి దేవగురుండు పల్కె:
నిట్లు పరిదేవనము చేయ నేమి లాభ?
మేది యైన నుపాయ మూహింప వలయు. ౨౨౦

క. దైవంబుఁ బురుషకారము
దేవతలారా! సమంబ, తెలియుఁడు మదిలో;
నేవాఁ డుపాయశాలియొ,
యావానికె యెపుడు దైవ మనుకూలించున్. ౨-౨౧

తే. ఇంద్రుఁ డది యాదరింపక యిట్లు పల్కె:
దైవమె పరంబు పర మని తలఁతు నేను;
పురుషకారం బ దేల! ఛీ! సురలయెదుట
ఛిన్న మైనది విష్ణువుశిరము కనమె? ౨-౨౨

తే. సంశయోచ్ఛిత్తికై యంత స్రష్ట పల్కెఁ:
గలుగును శుభాశుభంబులు కాలవశత;
దేహి సుఖదుఃఖములు గుడ్చి తీరవలయు;
దైవము నతిక్రమింపఁగా దక్షు లెవరు? ౨-౨౩

క. నాశిరము మున్న త్రెవ్వఁడె
యీ శంభుఁడు? శాపవశత నితనికిఁ గూడన్
నాశం బొందదె లింగము?
శ్రీశునిశిర మిపుడు పడియె సింధువులోనన్. ౨-౨౪

ఆ. వజ్రి యెన్నిమార్లు స్వర్గవిచ్యుతుఁ డయ్యె?
నొక్కతఱి సహస్రయోని యయ్యె;
భవము నొంది దుఃఖభాక్కు కాని దెవండు?
కాన శోక మొందఁ గాదు బుధులు. ౨-౨౫

తే. బ్రహ్మవిద్యాత్మ యెది, పరాప్రకృతి యెవ్వ,
రేయమ సనాతనీమహామాయ యందు,
రా జగద్ధాత్రి జనయిత్రి నఖిలధాత్రి
శరణు వేఁడుఁడు, మీకోర్కె సఫల మగును. ౨-౨౬

ఆ. ఇట్లు పలికి సుంత యెదలోన ధ్యానింప,
నిలువఁ బడియె నెదుట నిగమరాశి,

దినకరాయమాన దీవ్యత్తనువు దాల్చి,
దేవకార్యవిధముఁ దీర్పఁ గోరి. ౨౨౭

తే. సర్వకార్యసిద్ధి సాధనీభూతము
పరమగూఢ మైన బ్రహ్మవిద్య
వినుతి సేయఁ డంచు వేధ యాదేశింప
శ్రుతులు దేవి నిట్లు స్తుతి యొనర్చె. ౨౨౮

## వేదకృత దేవీ స్తోత్రము

క. మాతల్లి! నమస్కారము
చేతుము విశ్వైకజనని! శివకామేశీ!
భూతముల కెల్ల భూమిా
భూతవు, ప్రాణులకుఁ బ్రాణభూతవు దేవీ! ౨౨౯

క. శ్రీ ధీ కాంతి క్షాంతులు,
మేధా శాంతులును, శ్రద్ధ స్మృతియుఁ ధృతియుఁ,
నీ ధామంబున వెలిఁగెడి
దీధితులే కాదటమ్మ త్రిదశజనిత్రీ! ౨౩౦

క. గాయత్రీ వ్యాహృతులును
నా యుద్గీథార్థమాత్ర యను ధాత్రివి నీ
వోయంబ! కీర్తి లజ్జలు
నాయత విజయా జయా దయా స్పృహ లీవే. ౨౩౧

ఉ. అమ్మ! జగత్త్రయమ్ముఁ గనినమ్మ! జనమ్ములు నమ్మినమ్మ! లో
కమ్ముహితమ్ము నెమ్మదిఁ గ్రమ్మినయమ్మ! దయారసైకమూ
లమ్మగు నమ్మ! సంస్కృతిఁ దొలంచి శివ మ్మొనగూర్చు విద్యవై
నమ్మ! వరేణ్య వాగ్భవ హృదాలయవమ్మ! నుతింప నిమ్ముమా!

క. స్థావర జంగమములకుఁ
నీవే జనయిత్రి వగుట నీ పసిపాపల్

గోపింప విధి గిరీశులు
దేవేశ దినేశ భువన దిగధీశు లుమా! —౧౩౩

తే. ఎన్నఁ డీ విశ్వసృష్టి గావింతు వంబ!
యంత హరి హర విధుల సృష్టింతు వీవు;
స్థితి లయ విసర్గములు వారిఁ జేయఁ బూన్చి,
యేకవై యుందు సంస్మృతి యేమి లేక. —౧౩౪

శా. నీరూపం బెఱుఁగన్ సమర్థునిఁ గనన్ లే మీ ప్రపంచంబునన్?
నేరం బోలు నెవండు నామములనేనీ నీవి లెక్కింపఁగా;
నూరం జిన్ని మడుంగు దాఁట బరువై, యుద్యుక్తుఁ డైనన్ మహా
పారావారదురూహవారిఁ దరియింపన్ హాస్యపాత్రం బగున్. —౧౩౫

తే. నీవు భువనైకజననివి, నీమహత్త్వ
దేవతలలో నొకండును దెలియఁ డంబ!
యెట్లొకతె వీ జగత్సృష్టి సృష్టి సేతు,
వెఱుఁగు టెట్లు శ్రుతిప్రమాణేతరమున? —౧౩౬

తే. నీచరిత్రంబు చిత్రంబు నిఖిలసృష్టి
కారణమ వయ్యును సిరీహ వారయంగ,
నీస్వరూప మందదు మాకు నిగమములకే,
యెవ్వఁ డెఱుఁగ సమర్థుఁ డౌ, నెట్లు సెప్పు? —౧౩౭

చ. ఎఱుఁగవొ తల్లి! యిప్పుడ యుపేంద్రుశిరశ్శిర మదృశ్య మాటు? లో
నెఱిఁగియు నిచ్చగింతువొ రమేశునిశక్తి పరీక్ష సేయ? నీ
హరి యొనరించినట్టి దురితౌఘ మవార్య మటంచు నెంచెదో?
దురితము లున్నె నీ చరణతోయజగంధ సమాశ్రితాళికిన్? —౧౩౮

మ. జననీ! విష్ణుశిరోనిపాతము మహాశ్చర్యంబు, తద్ధేతు వే
మనవచ్చున్; హరిశక్తిఁ జుట్టితె సురానీకంబుదోషం బెదే,
దనుజేంద్రుల్ వర మొందినారొ నిను సంతర్పించి పూజన్, జనా
ర్దనుగర్వం బుడుపం దలంతువొ, వినోదం బయ్యెనో యాక్రియన్?

తే. సింధునందనమీఁద కోపించినావొ,
యెటు లనాథయా నీవె నీక్షింపఁ గలవు?
స్వాంశజాతాపరాధ మే మైన మఱచి
సిరికి మోదంబు గూర్పు, శ్రీధరుని లేపు. ౨౮౧

ఉ. నీకు నమస్కరించి, నిను నెమ్మది నిల్పి, భవన్నియోగముల్
చేకొని, కార్యదక్షు లయి, చేతు రనారత మీ సుధాశనా
నీకము శోకముం దొలఁగ, నీరజనాభుశిరంబు గూర్పు, త
ల్లీ! కనరాదు వేఱె గతి, యీవ జగత్తుకు జీవదాత్రివే! ౨౮౧

తే. సామగాన మనోహర శ్రావ్యఫణితి
సాంగవేదంబు లిటు దన్ను సంస్తుతింప,
సురలకుఁ బ్రసన్న యై పల్కెఁ బరమమాయ,
నింగి నశరీరవాణియై నిలిచి యిట్లు. ౨౮౨

క. వేదప్రార్థనచేతన్
మోదించితి భయము సురలు పొందకుఁ డింకన్,
వేదసమానం బీస్తుతి,
ఖేదంబులు వాపు విన్నఁ గీర్తించినన్. ౨౮౩

చ. వినుఁ డొకనాఁడు పూర్వ మరవిందదళాక్షుఁడు శౌరి చెంగటం
గనులకు విందుగా నమృతగర్భునిచెల్లెలు పాలవెల్లికిన్
అనుఁగుకుమార్తె యుండ రమ; యామెముఖాబ్జముగాంచి ముగ్ధుఁడై
ననవిలుకాని, కల్ల చిఱునవ్వు వెలార్చె ముఖాబ్జసీమపై. ౨౮౪

చ. ఇది విపరీతరీతిని స్ఫురించెను మంగళబుద్ధి, కామె నె
మ్మది సురకార్యసాధనసమాప్తికిఁ దామసి యావహింప నా
వదనము చూచి నవ్వెడి, నవశ్యము, గేశవుఁ డన్యకాంతపై
నెద నిలిపెం గటా! పరిహసించెడి నన్నని నిశ్చితాత్మయై. ౨౮౫

ఉ. మంగళ కన్ను లెఱ్ఱనయి మంటలు గ్రమ్మి ముఖేందురేఖ స
ర్వాంగము కంప మొందఁగఁ మహోగ్రమహాభంగి శపించె నాథునిన్,

భంగమునొందఁ గావుత భవచ్ఛిర మంచు విఘూర్ణచిత్తయై,
యంగన లక్కటా! విధవ లౌట సహింత్రు, సపత్ని నోర్తురే? ౨౭౬

తే. సాహసము మాయ మూర్ఖతాశౌచములును
నన్నృత మతిలోభమును నిర్దయత్వ మరయ
సహజదోషంబు లివ్వి స్త్రీజాతి కెల్ల;
నదియుఁ గా కామెఁ దామసి యావహించె. ౨౭౭

క. హరి నిప్పుడ సశిరస్కునిఁ
బరికింతురుగాక, పావనమున శిర మా
సరివేశునిలో నదిఁగాను
మఱియుక్ మీరెరునేలు మలయును దీనన్. ౨౭౮

శా. గీర్వాణోత్తములార! పూర్వము హయగ్రీవాభిధుండౌ పురా
గీర్వాణుండు సరస్వతీతట మహాక్షేత్రంబునన్ నిష్ఠుఁడై
సర్వాహారవివర్జితుం డయి శరత్సాహస్ర మారూపిగా
శర్వాణిన్ ననుఁ గొల్చెఁ దామసిగ నాశ్చర్యప్రభావంబునన్.

క. ఏకాక్షరమాయామం
త్రైకాత్మకఁ జేయు చుగ్ర మగు తప మతఁ డే
యాకారగ నను నెంచెనొ,
యాకారం బది ధరించి యగపడితిఁ దుదిన్. ౨౮౦

క. ననుఁ గాంచి పులకితుండై
కనులన్ హర్షాశ్రు లురల గద్గదవస్త్రుఁడై
ఘనసంభ్రమమున మ్రొక్కుచు
వినుతించెన్ భక్తి వినయ వినతాననుఁడై. ౨౮౧

క. నీకు నమస్కారము త
ల్లీ; కామేశ్వరివి, మోక్షమిత్త్రువు నీవే,
యేకైకకారణంబవు,
లోకము సృష్టికిని స్థితికి లోఁగొంటకునున్. ౨౮౨

క. శ్రీదేవి పల్కె నిట్లని :
యో దానవ! నీతపస్సు కూర్జస్వితకున్
నీదగు భక్తికి శ్రద్ధకు
మోదించితిఁ గోరు మిత్తు ముద నేవరమో? ౨౫౩

క. ప్రమదావహ మద్భాషల
కమందహర్షంబు నొంది, యాత్మస్యైక్యముతో
నమరత్వ మజయ్యత్వం
బమరారి యపేక్ష సేయ నాతని కంటిన్. ౨౫౪

క. పుట్టినవారలు తథ్యము
గిట్టుట, జన్మంబు ధ్రువము గిట్టినయెడ; నీ
విట్టి జగన్మర్యాదన్
నెట్టన భావించి కోరు నిజవర మేదే. ౨౫౫

తే. ఆ హయగ్రీవుఁ డర్థించె నంత నన్నుఁ;
దను హయగ్రీవుఁ డొక్కఁడు దక్క యొరులు
చంపలేకుంట; వర మట్లొసంగినాను;
వాఁడు వరగర్వమున మీఱెనాఁడు నేఁడు. ౨౫౬

ఆ. తామసాత్మ నన్ను ధ్యానించుటన్ వాఁడు
వేదములను మునుల వేధసేయు
హయశిరం బొకండు హరిమేన సంధింపుఁ,
డతఁడు మాన్పు నంత నసురబాధ. ౨౫౭

క. శరదాగమ శుభ్రాంభో
భర శుభ గంభీరహారి భాషణము లిటుల్
పరమేశ్వరి పరపించిన
సురసంఘము లేచె కార్యశూరత మెఱయన్. ౨౫౮

క. పరమానందాశ్రుపరం
పర యురలం గనుల, మేన భరముగఁ బులకల్

తెరలఁగ, సురలును జయజయ
పరమేశ్వరి! యనిరి భక్తిపరవశు లగుచున్. ౨౫౯

క. పరమేష్ఠిని యోగంబునఁ
ద్వరితగతిం ద్వష్ట యొక్క వాజిశిరమ్మున్
ఛురికన్ ఛేదించి మనో
హరముగ యోజించె దాని హరిదేహమునన్. ౨౬౦

శా. భీషావేశము మాని దేవతలు నా వేషంబు వీక్షింపఁ బ్ర
త్యూషప్రోత్థిత పద్మమట్లు హరి సుప్తోత్థాపితుండై సటా
భీషత్ కేసర మొనర్చుచున్ సురగణం బెల్లం బ్రశంసింపఁగా
హేషాఘోషము నపూర్వముగ నిండించెన్ దిశాంతంబులన్.

క. ఆ హేషాఘోషం బవు
డూహింప నశక్య మయ్యె నుద్యద్వేద
వ్యాహృతియో త్రిజగత్స
మ్మోహన మనుకృతియొ వేణుమురజశ్రుతియో! ౨౬౨

క. జ్ఞానానానందమయా! దే
వా! నిర్మల మైన స్ఫాటికాకారు నినున్!
ధ్యానింతుము కొలుతుము వి
ద్యానికాధారుఁడ వని, హయవదన, హరీ! ౨౬౩

క. దేవత లిట్లు నుతింపం
గా, వాజిశిరుండు నలరి కరుణామయుఁడై
దేవముఖుండై వారల
దేవీమఖ మొండు చేయు దీక్ష నయించెన్. ౨౬౪

క. ఆనాదిత పరదేవీ
ప్రాసాదశ్రీకుఁ డగుచు వాజిముఖుండున్
వాసవవిద్వేషి హయా
స్యాసురుఁ బరిమార్చె నాజి నవ్యాహతుఁడై. ౨౬౫

తే. ఈ హయగ్రీవచరితంబు నెవరు విన్న
సర్వదుఃఖవిర్ముక్తులై జనము మండ్రు;
పావనము పాపనాశనపటువు శుభము
సంపదభిదాత్రి జనయిత్రి సచ్చరిత్ర. ౨౬౬

## మధుకైటభ కథా ప్రశ్నము

సీ. అది యాలించి ఋషీంద్రు లిట్లనిరి సూతా! యాత్మయుప్పొంగ సం
గదితంబైన హయాస్యపుణ్యకథచేఁ గల్యాణి సంకీర్తనన్
ముద మయ్యెన్, మధుకైటభప్రథన మామూలాగ్రముం దెల్పవే,
యెది జన్మం బెట్లు చంపె విష్ణువు జగం బేకార్ణవంబౌ నెడన్? ౨౬౭

క. నీవు బహుశ్రుతుఁడవు, మే
మా వినఁ గాంక్షించినార మధికశ్రద్ధన్;
దైవమె పూశ్రోతృత్వము
నీవక్తృత్వమునఁ గూర్చె నిక్కము సూతా! ౨౬౮

తే. మూర్ఖసంయోగము విషానుభూతి సమము,
జ్ఞానిసంయోగ మది సుధాశనసదృశము,
పశువులైన ననుభవించు విషయసుఖము,
లేద సదసద్జ్ఞతయు ముక్తిలేశకాంక్ష. ౨౬౯

క. శ్రవణసుఖం బెవఁ డెఱుఁగఁడో,
ధ్రువముగ నవ్వాఁడు పశుసరూపుఁడు తలఁపన్,
శ్రవణము దర్శన మను రెం
డవ్వి పంచేంద్రియములందు నగ్ర్యగుణంబుల్. ౨౭౦

తే. సాత్త్వికము వేదశాస్త్రాది సంశ్రవణము;
రాజసం బగు సాహిత్యరచన వినుట;
మొరులదోషప్రసంగంబు, యుద్ధవార్త
వినుట, తామసగుణ మని విజ్ఞు లండ్రు. ౨౭౧

తే. సాత్త్వికశ్రవణంబును తత్త్వవిదులు
ముక్తికై యగు నటంచు వాక్రుత్తు; రెండు
మోక్షదం బుత్తమము, స్వర్గముం దలంప
మధ్యమము, భోగదం బధమం బటంచు, ౧౭౨

క. శ్రీనిషధము సాహాత్మ్యము, స్వ
జనహితము దుత్తమంబు, నల వేశ్యాస్త్రీ
జనహాంబున మధ్యమ మగు,
నవ్విధమం బన్యయువతులం దగు నెడలన్. ౧౭౩

తే. ఉత్తమం శాత్రవాయిలో యుద్ధ మైన;
మధ్యమంబు విద్వేషిప్రమర్దనంబు;
నిర్నిమిత్తవివాదంబు నిర్నిమిత్త
కలహ మధమము, తామసకథయు నట్లు. ౧౭౪

క. కాన పురాణశ్రవణము
జ్ఞానం బొసగూర్చు, బుద్ధిసంపదఁ బెంచున్,
ఏనోనాశము, సంప
ద్దానంబును జేయుఁ, జెప్ప దయ దేవికథల్. ౧౭౫

వ. నావుడు సూతుం డి ట్లనియె. ౧౭౬

క. ధన్యులు మీరు మహాత్ములు;
ధన్యుఁడ నే; నుభయులమును ధన్యుల; మీరల్
ధన్యులు వినఁ జెప్పుటచే
ధన్యుఁడఁ గథనమున బుద్ధి దనుపుట నేనున్. ౧౭౭

మధుకైటభు**లు** వరంబు**లు** పడయుట

తే. మున్నొకానొక లయవేళ మునిఁగిపోయె
భువనములు మూఁడుఁ గనరాక పూర్ణజలధి;
నద్భుతం బయ్యె నప్పు డేకార్ణవంబు,
శేషుపాన్పున సుఖసుప్తిఁ జెందెను హరి. ౧౭౮

తే. అచ్యుతేచ్ఛానికర్ణమలమున నట్టివేళఁ
బుట్టి రెపుపురు దానవుల్ భూరిబలులు,
కవలునుం బోలె మధువును గైటభుండు
పెరిగి క్రీడింపఁ దొడఁగి రెవ్వేళ నబ్ధి. ౨౭౯

సీ. ఒకనాఁడు వారు మహోత్సాహయుక్తులై
యనన్తనజలమునం దట్లు నిట్టుఁ
దమమహాకాయముల్ తనియంగఁ గ్రీడించి
చింతింపఁ దొడఁగి రీ చిత్రరీతిఁ
గారణమేమి నమ్మై కార్యంబు, నాధార
హీనమై యాధేయ మెందు నున్నె?
యీ సుఖంబు బాసు జలం బెం దధిష్ఠించెడు,
నెవరు సృజించినా రెట్లు పుట్టె?
మనము క్రీడింతు మిట వారిమగ్నుల మయి,
యెట్లు జన్మించితిమి! మన మిద్ధరమును?
నెవఁడు పుట్టించెఁ, బితరులు నెవరొ? యనుచుఁ
దఱచి చూచియు నిశ్చయ మెఱుఁగరైరి. ౨౮౦

తే. తీవ్రముగఁ జాలసేపు చింతించి తుదకుఁ
గైటభుఁ డెఱింగి యిట్లు మధుఁ గాంచి పలికె;
నీజలంబుల మన స్థితిహేతు వరయ
నచల మగు శక్తి యొకటి మహాబలంబు. ౨౮౧

క. తత్శక్తిం బూజల నరా
వేశించి మనసంగ, నదియె విశ్రమపదమగా,
నాశక్తియె మన జన్మని
వేశం బగు పరమదేవి, విస్మయ మేలా? ౨౮౨

క. ఈరీతి విబోధితుడై
వా సుంజె మనోహరముగ వాగ్భవబీజా

వారిధ్వని నాకసమున
వారికి విన నయ్యె శ్రవణపర్వం బగుచున్. ౨౧౩

తే. వ్యగ్రులై వారు భక్తిఁ బరిగ్రహించి
యభ్యసించిరి దృఢముగా నదియు. వారి
కప్పుడు సౌదామినీరేఖ యంబరమున
నద్భుతం బయి వెలసి ప్రత్యక్ష మయ్యె. ౨౧౪

తే. అదియె మంత్రము సగుణమౌ ధ్యాన మనుచు
నిశ్చయించి విచారించి నిష్ఠతోడ
నశనమును నిద్ర మాని జితాత్ము లగుచుఁ
దజ్జపాభ్యాసు లైరి నక్తందివమ్ము. ౨౧౫

ఆ. వార లిట్లు తపము వర్షసహస్రమ్ము
నెరపఁ బ్రీత యయ్యెఁ బరమశక్తి;
దివి శరీరహీన దివ్యవాక్కుల, నిత్తు
వరముఁ గోరుఁ డంచుఁ బలికె నదియు. ౨౧౬

క. సురరిపు లది విని స్వేచ్ఛా
మరణం బర్థింప నద్ది మా కెటు పల్కెన్,
మరణం బట్లే కావుత,
మఱి సుర దైత్యుల కజేయ మహిమం గనుఁడీ. ౨౧౭

క. ఇటు దేవీపరివర్ధిత
పటు దర్ప శరీరు లగుచు వార్థి జలములన్
నటదూర్ముల నటియింతురు
చటులిఁ గ్రీడు లైన నెట్టి జలసత్త్వమునన్. ౨౧౮

మధు కైటభులు బ్రహ్మను దర్శించుట

క. యాదృచ్ఛికముగ నొకనాఁ
డా దైత్యులు కాంచి రందు నబ్జాసనునిన్
వేదంబులు నలుమొగముల
నాదవినోదంబు చేయ నందించు విభున్. ౨౧౯

క. ఆచతురాస్యుని వారలు
చూచినమాత్రమునఁ బొంగి శోరాంత మెఱయన్
మోచించిరి, భుజయుద్ధము
లే చేయుము, దిగుము గద్దె లేకున్న యెడన్. ౭౯–౧

క. మాభుజములతీఁట చనం
గా భాగ్యమునలన నీవు కనఁబడినా వీ
శోభాస్పద పద్మాసన
సౌభాగ్యము వీరభోగ్య సదనము సుమ్మా! ౭౯–౨

ఉ. ఆ మధు కైటభుల్ బలమదాంధులు త న్నిటు ధిక్కరించి మా
రా మొనరింప ముట్టి, వడి బ్రహ్మ విచారణ సేసె దక్షుఁడై,
సామము దాన భేదములు సంయుగ మిం దొనఁగూడ వింక శ్రీ
ధాముని మేలుకొల్పుటె విధాన మటంచు వినిశ్చితాత్ముఁడై.

సీ. మాధవా! నిద్ర లేలె మ్మనాథనాథ!
హరి! నమజ్జనదుఃఖాపహారి! లెమ్ము;
సర్వలోకేశ! లేవయ్య. సర్వశక్తి!
లేవయా దుష్టసంహార! దేవదేవ! ౭౯–౩

తే. శరణు సర్వజ్ఞ! రక్షింపు సురశరణ్య!
అఖిలవిశ్వంభరా! విశాలాక్ష! శరణు;
ఆతతాయులై నిల్చినా రసుర లదిగో;
అయ్య లేవయ్య! యేలనయ్యా యుపేక్ష? ౭౯–౪

క. ఆర్తుండై యీ తెఱఁగునఁ
గీర్తించియుఁ జాల తడవు కేశవునిద్రా
పూర్తిం గానక ద్రుహిణుఁడు
కర్తవ్యవిచారకలనఁ గావించెఁ గడున్. ౭౯–౫

ఉ. ఈ పురుషోత్తముండు నిదురించెడిఁ గన్నులు మూసి, యెంతిగా
లేపిన లేవఁడాయెను, జలింపఁ డొకింత గతాసువో యనన్,

సకలజనముల కీర్తియు శ్రద్ధ నీవ,
మఱియు రతి నీవ, కాంతియు క్షాంతియు నీవ. ౩౦౩

ఉ. అక్కడ వాక్కు వెళ్ళదను, నందు మనస్సు నివృత్తమౌను, నే
నొక్కటి నేర్తు చాలఁ గన నోప నటంచు, చరంతమైన నా
వాక్కులు దాని నిర్వచనవాయు నటంచును, వేదమాతయే
చిక్కనఁ జిక్కని న్నెలియఁ జెప్ప, నిఁ కేరికి సాధ్య మౌనమ్మా!

తే. తర్కకోటిఁ బ్రమాణశతంబుచేత
నిను దెలియఁగ నైతినే జగజ్జనని యనుచు,
నేఁడు ప్రత్యక్షముగ హరిబ్రదఁ జూచి
మొఱఁగితిఁగా, నిను హరిహరు లెఱుఁగ రంబ! ౩౦౪

క. స్వాహా యని నీనామ
వ్యాహృతి లేకుండ శ్రౌతయాజ్ఞికవిధులం
దే హోమము చేసిన య
జ్ఞాహారము సురల కెట్టు లందును? జననీ! ౩౦౫

క. కావున దేవతలకు నీ
వే వృత్తిప్రదవు, విష్ణుఁ డెంత పిలిచినన్
లేవం; డీ మధుకైటభ
దేవారిభయంబు నీవె తీర్పుము తల్లీ! ౩౦౬

క. అయ్యో బలదర్పితులై
యీ యసురలు నిలిచి యెదుట నీ దృష్టులతోఁ
గయ్యం బొనరింపఁగ భయ
మయ్యెడి, రక్షింపు శరణ మంటిని దల్లీ! ౩౦౭

ఉ. నీపదపంకజంబు లెద నిల్పి భజించుచు నన్యదేవతా
రోపణ చేయ రోయుచును లోకవిధాత్రివి కామదోగ్ధ్రివే
నీపరమైన భావనల నృత్యము సేయుచు నీపదంబు లా
లాపన చేయుచున్ నినుఁ దలంచుచుఁ జొక్కు మహాత్ములే కృతుల్.

తెఱచి కన్ను, లొడలు విఱచి, స్పందించుచు
నావులింప, వేధ యట్టె యుబ్బె. ౨౧౫

## శక్తి స్వరూప కథనము

చ. అది విని సంశయాత్ము లయి యమ్మును లిట్లని ప్రశ్న సేసి, "ఓ
వివిధపురాణజాత! యతి విస్మయ మయ్యె భవత్కథానకం
బది కడు నద్భుతం బెఱుఁగ మెన్నఁడు నిట్టిది, సృష్టికారణా
స్పదుఁడు విరించి, పాలకుఁడు శౌరి, లయంకరుఁ డీశుఁ డందురే!

ఉ. అందు జనార్దనుండు మహామహితసత్త్వుఁ డనాది సచ్చిదా
నందమయుం డనంతుఁడు సనాతనుఁ డాద్యుఁడు సర్వశక్తి ని
ష్యందుఁడు సర్వకర్త శుచి స్థాపితుఁడై వివశాత్ముఁ డెట్టు ల
య్యెం దయఁ బల్కుమా తపసి జయించిన శక్తికి రూప మెట్టిదో!

మ. ఎవ రాశక్తి? తదుద్భవం బెచట? నెట్లీశున్ జగన్నాథు నా
త్మవశుంగా నొనరింపఁ జాలె నది? యత్యంతాద్భుతం బయ్యెడిన్,
వివరింపంగదె వ్యాసశిష్య! హృదయావిర్భూత సందేహజా
ల విశేషంబులు జ్ఞానఖడ్గమున లీలం ద్రెవ్వి ఛేదింపవే. ౩౧౮

మ. చెఱున వ్యాతసియాననాజ్ఞముపయిం జెం దొంద సూతుండు ప
ల్కుఁ: రహస్యం బిది, తీర్ప నేర రిది ముల్లోకంబులందుం జరా
చరభూతావళి నొక్కఁ డేని, విధిసంజాతాదిమహామునీంద్రులే
యెఱుఁగన్ లే రల నారదుండు కపిలుండేన్ నాకు సాధ్యంబౌనే!

శా. ఆ నారాయణుఁ డాదిదేవుఁడు పరుం డాద్యంతశూన్యుండు దే
వానీకావనదక్షుఁ డాఢ్యుఁడు విరాడాఖ్యుం డటంచున్ సదా
శ్రీనాథుం బురుషోత్తమున్ హరినిఁ జక్రిన్ శార్ఙ్గిఁ బీతాంబరున్
ధ్యానాధిష్ఠితుఁ జేసి కొందఱు తపోధన్యాత్ము లౌదుర్గదా! ౩౨౦

మ. మఱియుం గొందఱు గొల్తు రీశుఁ డని సంభావించి గౌరీమనో
హరు నాగాంబరు నాగహారుఁ బురసంహారున్ మహాదేవు శం

కపట పంచాస్య హిమాంశుశేఖరు జగత్కల్యాణకృత్ త్ర్యంబకున్
హరు హుంకార విఘాత మన్మథ మహాహంకారు బంకాయునిన్.

క. ఉద్యంతుఁ బ్రశస్తమానుఁడు
నాద్యుమణిని నుభయసంధ్య లర్ఘ్యాహమునం
బాద్యుం జేసి ధ్యానింపఁగ
నుద్యోగించెదరు వైదికోత్తములు ద్విజుల్. 3-౧౧

క. కొందఱు కొలిచెద రగ్నిని,
గొందఱు కొలుతురు మహేంద్రుఁ, గొందఱు వరుణున్;
అందఱ కధికుఁడు విష్ణుం
డందురు ఋషివరులు గంగయుష్టులు నదులన్. 3-౧౨

వ. ప్రత్యక్షము, అనుమానము, శాబ్దము అని ప్రమాణములు మూఁడు. కొందఱు ఉపమానంబుతో నాలు గనియు, మఱికొందఱు అర్థాపత్తిం గలిపి యై దనియు, మీమాంసకులు అనుపలబ్ధితో నా ఱనియు, ఐతిహ్యమును జోడించి పౌరాణికు లే డనియు, వచింతురు. ఎందఱెన్ని ప్రమాణములను నొడివినను, పరబ్రహ్మ మెల్లప్రమాణముల కందరానిదై యొప్పు. 3-౧౩

తే. శ్రుతి విచారించి ప్రత్యక్షగతు లెఱింగి
శిష్టపథమున దృష్టాంతచింత చేసి
తర్క మొనరింపవలె బుద్ధిఁ దఱచి తఱచి
యిది పురాణముల్ మునులు కీర్తించుపథము. 3-౧౪

సీ. స్రష్టను లోకంబు సృష్టించుశక్తియు,
వైకుంఠునందుఁ దద్భరణశక్తి,
హరునందు సర్వసంహారకశక్తియు,
సంప్రకాశకశక్తి సవితృనందు,
దహనునిలో సర్వదాహకశక్తియుఁ,
బ్రేరణశక్తి సమీరునందు,

నాదిశేషునియందు నాదికూర్మంబున
ధరయందు నున్నది ధరణశక్తి,
శివుఁడు కుండలి విడిచిన శివత నొందు,
శక్తిహీనున కసమర్థసంజ్ఞ చెల్లు,
గమనభోజనముల శత్రుదమనమందు
శక్తిహీనంబు నింద్యంబు జగతి నెందు. 326

క. ఆశక్తియె సర్వగతం,
బాశక్తియె సర్వయోని, యదియే బ్రహ్మం,
బీశం, బని యోఁగి బుధుం
డాశక్తియుపాసనంబ ప్రారంభించున్. 327

క. హరి హర విరించు లైనన్,
వసుహాగ్ని యమేందు సూర్య వాసవు లైనన్,
సుర లెవరుం దమ పనులే
బరువై బ్రుంగెదరు శక్తివర్జితు లైనన్. 328

క. సగుణం బని నిర్గుణ మని
యగు రెండు విధంబు లదియు; నందు సరాగుల్
సగుణముఁ గొలుతురు, నిర్గుణ
మగున దెలుఁగుదురు విరాగులైన యతీంద్రుల్. 329

క. వరియించిన వర మదియే
కరుణించును విధివిధానకలితార్చలఁ ద
ద్వరివస్యాపరివర్జిత
ఖరతుల్యులు పెక్కు లుంద్రు కలిలో మనుజుల్. 330

మ. అదె బ్రహ్మాండము సృష్టి పాలనము సంహారంబు గావించు, స
య్యదె ధ్యేయంబు విధీశకేశవులకున్ యజ్ఞాదికర్మంబులం,
దదె ప్రాపించెను నారదుండు విధిచే, నాతండు గోవిందుచే,
నదె పారాశరి నిత్యసేవ్య మని నా కాదేశముం జేసె సూ. 331

క. పలికెను గమలి ట్లని హరి :
నిలు వత్సా! యింక నీవు నిర్భీకుఁడవై,
పొలియింతు నిపుడ వీరిం
జెలియ గర్వాయులుగఁ బోరఁ దివురుట నాతో. ౩౩౯

శా. అహో నచ్చటి కేగుదెంచిరి మదాహంకారహుంకారు లా
ఘీంకారోలితదీర్ఘజిహ్వులు మహావేశంబుతో వార్ధి క
ల్లోలాందోళన మూఁగులాడుచును బబ్బుల్ వాఱుచుం దైత్యు ల
ట్లాలోకించి విరించి నార్చి రొగి బ్రహ్మాండంబు భేదిల్లఁగా. ౩౪౦

క. పందా! పలాయితుఁడవై
యిం దేతెంచితివె నీకు నీతఁడు తోడా?
మ్రందింతుము నిను నీతని
ముందరనె నిలుము పోక పోకుము మాతో. ౩౪౧

క. ఇతని మహాభోగంబుల
యతిశయ మంతయును బోవ హరియింతుము, పో
యిత మొనరింపుము, కాదే
బ్రహ్మకుము దాసోస్మి యనుచుఁ బ్రార్థించి మమున్. ౩౪౨

ఉ. ఆ మధుకైటభాసుర మదాంధ వచస్సుల నాలకించి, యు
ద్దామరుషాభిభూతుఁ డయి, దానవవైరి వచించె వారికిన్,
మీ మద మిప్పుడే యుడఁగు, మీకు రుచించునయేని పోర నా
తో మఱి లెం డిదే సమరదోహలినై నిలుచుంటిఁ జూడుఁడీ. ౩౪౩

క. పలుకుచునే యిటు నిలిచెన్
నిలువునఁ దేజస్సు దిశల నిండఁగ, దనుజుల్
తిలకింపఁగ నచ్చెరుపడి,
యలరఁగ వెఱ యుడిగి బ్రహ్మ, యచ్యుతుఁ డంతన్. ౩౪౪

క. లేచినవిభు నా దైత్యులు
చూచి క్రుధన్ మండిపడెదు చూడ్కులతో, సం

గోచింపక హరికిని యు
ద్ధాచరణకు సిద్ధు లగుచు నార్చిరి పెలుచన్. ౩౮౫

ఉ. అంత నిరామయం బగు మహార్ణవసంచల దూర్మిమాలికా
సంతతులందుఁ గాళ్ళు నిలుపఁ జాలని చోట మహాద్భుతంబు న
త్యంతభయంకర మ్మగు మహాసమరం బొనరించె శౌరి యా
సాంతము వారితోడ నసహాయతఁ బంచసహస్రవర్షముల్. ౩౮౬

క. కాఱెనుబోఁతులద్వంద్వము
మీఱి రుసన్ వృషభరాజుమీఁదఁ గవియుచున్
బేరెములు వాఱు భంగిని
బోరిరి మధుకైటభులును బురుషోత్తమునోన్. ౩౮౭

క. మధు వలసిఁ గైటభుఁడున్,
మధువుఁ గైటభుఁడు బడల, మఱి కైటభుఁడై,
మధువై మఱి యీవిధమునఁ
బ్రధనం బొనరించిరి వారు పర్యాయమునన్. ౩౮౮

తే. ఆ నిరామయమైన యేకార్ణవమున
రోమహర్షణమైన సంగ్రామమునకుఁ
బ్రేక్షకులు నిర్వురే యంతరిక్షమందు
యోగనిద్రయుఁ గ్రీనీళ్ళఁ దోఁగు విధియు. ౩౮౯

క. ఇక్కరణిన్ సంకర్షణుఁ
డొక్కఁడె మొగిన్ విరతి లేక యుగ్రాహవ మా
రక్కసులతోడఁ జేయఁగఁ
జొక్కెన్ హరి; యక్కజముగఁ జొక్కర దైత్యుల్. ౩౯౦

ఉ. పంచసహస్రవర్షము లవారణ యుద్ధ మొనర్చి యంత యో
జించెఁ ద్రివిక్రముం డిది విచిత్రము శ్రాంతుఁడ నైతి, వీర లా
క్కించుక సుక్కినట్లు కనిపింపరు దీనికి హేతు వేమి? నా
యంచితశౌర్యమున్ బలమహత్త్వము నేమయె? నెందుఁ బోయెనో?

క. చింతాపరుఁ డగు హరిఁ గని
గంతులు వేయుచును విజయగర్వితు లగుచున్
సంతోషము పొంగఁగ నసు
రాంతకునకు ననిరి దనుజు లంబుదరవళిన్. ౩౫౨

ఆ. పాప మలసినావు బాహుయుద్ధము చేసి,
బలము లేదు రణము సలుప, ననుచు
కొసిలొగ్గి నొసట దాసోస్మి యనవయా,
తెమ్ము రణ మొనర్ప లేకయున్న. ౩౫౩

ఆ. నాల్గు భుజము లున్న నీల్గింతు మిదె నిన్ను,
బలము తెమ్ము, ముందు నిన్నుఁ జంపి,
ముఖరమైన నాల్గు ముఖములపురుషునిఁ
జంపువార మంతఁ జండభంగి. ౩౫౪

క. ఈ మాటలు వా రాడఁగ
ధీమంతుం డచ్యుతుండు తీయనినుడులన్
సామంబునఁ బ్రత్యుత్తర
మా మధుకైటభుల కొసఁగె నప్పు డిమ్మాడ్కిన్. ౩౫౫

క. పోరుదురే శ్రాంతునితో
వీరనరుల్, భీత పతిత పీతాస్త్రులతోఁ,
గాయనఁ బడి బాలురతో,
వీరోచిత ధర్మవిధివివేకము గనుఁడీ! ౩౫౬

ఉ. పంచసహస్రవర్షములపాటు విరామము లేక పౌరుషో
దంచితవృత్తిఁ బోరితిని దక్షత నొక్కఁడ నేను, మీరు లె
క్కించఁగ నిర్వురైన విరమించితి రెన్నియొ మారు లాజి, నే
కొంచెము విశ్రమించి మఱి కూడెదఁ బోర, నొకింత యాఁగుఁడీ!

శా. ఆ దామోదరుసామవాక్యములు దైత్యద్వంద్వ మాలించి స
మ్మోదం బంది జయంబు నిశ్చయముగా బుద్ధిన్ విచారించి యా

నా దూరంబు తొలంగువార మిదె నీ నర్థించు విశ్రాంతి యీ
లే దంచున్ నెప మేల మా కనుచు దూరీభూతులై నిల్చినన్.

విష్ణు కృత దేవీ స్తుతి

క. అతిదూరము వా రరిగినఁ
జతురస్థుఁ జుఁడు చింతచేసె సంయతమతి యై,
దితిసుతమరణోపాయము
నతనికి నతిదీర్ఘచింత నాశ్చర్యంబై. 36

క. విష్ణు దేహాస్యాత్రి స
మునోత్రిత మమ్యో జ్ఞాన మూహాశిపథమం
దాద్య శ్రీదేవిద
స్ద్యత్ స్వచ్ఛందమరణ యుక్తు లటంచున్. 37

శా. అయ్యో, పంచసహస్రవర్షకృత మీ యాయోధనం బెంతయో
నయ్యెన్ వ్యర్థము, వ్యర్థమయ్యె శ్రమ, మాహా, యెట్లు పోరాడెదన్?
కయ్యంబుం బొనరింపకే జయము శక్యం బౌనె ప్రాపింప నే
నెయ్యోజన్ మధుకైటభప్రమథనం బీవేళ సాధించెదన్! 38

క. దీనుఁడు రోగియు నార్తుం
డేనియు మరణింప దాన యిచ్ఛ్యకోనం, డీ
దానవుల బలమదాంధుల
నే నెటు మరణింప నిచ్ఛగింప నొనర్తున్? 39

తే. అఖిలకామప్రదాత్రి విద్యాస్వరూప
శక్తి యొక్కతె యే నాకు శరణ మిపుడు,
సుప్రసన్నాత్మయై యది చూచు నెడలఁ
గోర్కె సిద్ధించు, నిఁక ది క్కొకొండు లేదు. 40

క. వగ నొందుచు నిటులన్ హరి
గగనంబున యోగనిద్రఁ గనె నిర్నిద్రన్,

కం. ఆ మహాబాహుఁ డిట్లను నగుచు నగుచు
ఒవరముల నిల్చి యాచతుర్బాహుఁ డప్పుడు,
దృఢముగా ముష్టి సంధించి ధిక్కరించి
మీఁద లంఘించి యసురల మించి పొడిచె. 328

తే. అద్భుతం బగు హరిముష్టిహతికి కొంత
చంచలించియు తిట్టి కుపితించి వారు
దృఢముష్టులఁ బొడిచిరి పోవివి హరిని
రణము చూపుట మయ్యెఁ బరస్పరమ్ము. 329

తే. కొంతకాల మిట్లు ఘోరయుద్ధము చేసి
సంధిబంధ మెల్ల సడలిపోవ
బేలచూపుఁ బరపె జాలి గొల్పుచు హరి
యంబరమున నున్న యంబవంక. 330

మ. ఆ నారాయణు నాస్థగా నెఱఁగి మాయాశక్తి తా ప్రసారణం
బా నేత్రద్వయి దానవద్వయము పై సత్యాంతముల్ నిల్పి పై
పై నవ్వెన్ వికటాట్టహాసమున దిగ్భాగంబు లెల్లం బ్రతి
ధ్వానం బీయఁగ దానవేంద్రులు తలల్ పై కెత్తి వీక్షింపఁగన్.

ఉ. అంతట దేవి మోహనముఖాబ్జమునందు వెలార్చెఁ జంద్రికా
కాంతము ఫుల్లకుందసితకాంతిసమంతము దుష్టదైత్య వై
శ్రాంతము రాగదీపకరసార్ద్రము నౌ మృదులస్మితమ్ము దే
హాంతకు లిద్దరున్ మురిసి, నాకము ముంచె దృగంతకాంతులన్.

సీ. వర వికస్వర దివ్య దరవింద సౌరభ
ప్రహరణ ఘ్రాణరంధ్రములు దూరి,
యమునాయుహాశోక హాసప్న హేళలు
మీఁటి కన్నులు మిఱుమిట్లు గొలిపి,
శుక కీర శారికా ప్రేరిత శ్రీరాగ
మాతభల్లంబుల మ్రోఁత చెవులు,

తే. యాచకులు గాఁగ మము నెంతు వా రమేశ!
మేము దాతల మగుదుము, మెచ్చు నచ్చు;
నీ యయుద్ధ మమోఘంబు నిరుపమంబు,
కోరు వర మేదియే నిచ్చువార మేము. ౩౭౮

క. వెంటనె హరి యా యసురల
జంటను బ్రార్థించె నిట్లు సంతుష్టులరై
యుంటిరయే నాచే మృతిఁ
గొంటకులై యిచ్చగింపఁ గోరుదు మిమ్ముల్. ౩౭౯

ఆ. హరివరంబు వించు నసుర లచ్చెరు వంది
మోస పోతి మంచుఁ బొగిలి మిగుల
దీర్ఘచింత చేసి తిలకించి రెల్లెడ
నీరు తప్ప లేని వారిరాశి. ౩౮౦

తే. వార లంత నిట్లు పల్కిరి హరితోడ,
నీవు మా కొసంగినావు వరము,
సత్యసత్యవచన! నిర్వహింపు ప్రతిజ్ఞ,
చంపు జలము లేని సమతలి మము.

ఉ. దానవవైరి యంతట సుదర్శనచక్ర మనంతవక్త్రముల్
ధ్యానము చేసి నెమ్మది సురారుల కిట్లని పల్కె మందహా
సాననభానుమం డయి, తథాస్తు వరంబు నిజంబు సేతు మీ
ప్రాణములన్ హరింతు నిదె వారివిహీన సమస్థలంబునన్. ౩౮౨

తే. దేవదేవేశుఁ డిటు పల్కి దివ్యశక్తి
నూరువు లొనర్చె బహుళవిస్తారములుగ,
జలముపైఁ జూపి నిర్జలసమతలంబు,
పల్కె మధుకైటభుల కిట్లు పరమగురుఁడు. ౩౮౩

ఆ. ఇచట లేదు సలిల మిం దుంచుఁడు శిరంబు,
లేను సత్యవాక్కు నిపుడ యాదు;

తే. మీరు కోరినట్టి సారపుణ్యచరిత్ర
విశదపరచినాఁడ విస్తరముగ;
వేదనిర్ణయంబు వినుఁడు మునివ్రాటికిఁ
నాదిమశక్తి యొకతె పరతరంబు. ౧౦౧

స్రగ్విణి. ఆ మహామాయయే యా మహావిద్యయే
ధీమదారాధ్య యా దేవదైత్యాళికిన్;
కామెయే సృష్టిసాఖ్యాపరాశక్తి యా
నామెయే యా గుణాఖ్యాపరాశక్తియున్. ౧౦౨

పుత్రార్థియై వ్యాసుఁడు తపము సేయుట

వ. అను సూతునిపలుకులు విని ఋషు లిట్లనిరి. ౧౦౩

క. సూతా! రోమాంచంబులు
పూతనువుల నిప్పుడుగూడ మానవు, భవదా
ఖ్యాతం బగు మధుకైటభ
పాతంబు మహాద్భుతంబు బహుపుణ్యంబున్. ౧౦౪

క. పారాశరి పుత్త్రార్థం
బేరీతిఁ దపం బొనర్చె? నెటు సుతుఁ గాంచెన్?
గారాబుకొడుకు కెట్టులు
ప్రారంభించెన్ వచింప భాగవతంబున్? ౧౦౫

వ. నావుడు సూతుం డవ్వారల కిట్లనియె. ౧౦౬

శా. ఏ శైలాగ్రమునన్ మునీశులు తపం బేకాగ్రులై చేతురో,
యే శైలంబు మరుద్గణంబు నసురుద్రేంద్రాదు లెవ్వేళఁ బ్రీ
డాశౌండీరత నాశ్రయింతురు గుహల్ మార్మ్రోగ నీత్రాళికల్,
నా శైలాగ్రము కర్ణికారవనదివ్యం బొప్పు హేమప్రభన్. ౧౦౭

మ. బహురమ్యం బల హేమశృంగమున సంభావించి యేకాక్షర
స్పృహా వాగ్బీజము నారదోక్తము మహావీర్యంబు పుత్రార్థియై

వ. సూతుం డి ట్లనియె.

మ. సుద్యుమ్నుఁ డనెడు నృపుఁ డన
వద్యుఁడు, విధివశముచేత వనితాతనుసం
పద్యత నొంది యిలాఖ్యా
ప్రద్యోతితుఁ డైన, బుధుఁడు వరియించె నిళన్. ౨౨౮

క. ఇళకును బుధసంగతిచేఁ
గలిగెఁ బురూరవుని పేరు గల సుతుఁ డాతం
డిల యేలెఁ బ్రతిష్ఠానపు
ర లలామం బధివసించి రంజకుఁ డగుచున్. ౨౨౯

తే. వాని దేహంబు రూపలావణ్యసీమ,
మతఁడు సద్గుణగణముల కాటపట్టు,
ధర్మవిదుఁడు, ప్రజాకార్యతత్పరుండు,
దక్షుఁ, డతిబుద్ధిమంతుఁడు, ధైర్యశాలి. ౨౩౦

సీ. అతనిమంత్ర మభేద్యమై యుండె నొరులకుఁ,
బరమంత్ర మతనికిఁ గరబదరము,
నుత్సాహశక్తి సర్వోత్తమంబై యుండెఁ,
బ్రభుశక్తి సర్వత్ర వ్యాప్త మయ్యె,
గామదానాదులు స్వవశంబులై యుండె,
వర్ణాశ్రమము ధర్మబద్ధ మయ్యె,
బహుదక్షిణంబుగాఁ బలుయజ్ఞములు చేసెఁ,
బాత్రదానంబు లపారిఁ జలిపె,

నతనిరూపంబునకు సాటి యతనిగుణము,
ద్రవిణబాహుళ్యతుల్య మౌదార్యశక్తి,
విక్రమసమాన మతని శీలక్రమమ్ము,
శక్రసముఁడు పురూరవశ్చక్రవర్తి. ౨౩౧

గీ. బ్రహ్మశాపహతి నరభావ మొంది
యూర్వశి పురూరవు వరించె; నూర్జిత మగు
నతనిగుణరాశిచే విజితాత్మ యయ్యు,
నాతని ముందుగ నిటు సమయంబు చేసె. ౧౩౬

క. రాజా! యీ మేషద్వయ
మేజాతియుఁ బొందనీక యీక్షింపవలెన్,
భోజన మాజ్యమె నాకున్,
నేఁ జూడఁగరాదు నగ్నునిఁగ నురక నిన్నున్. ౧౩౭

క. ఈ సమయంబుల నేదేఁ
జేసిన భంగంబు నిన్ ద్యజించెద నపుడే;
నీసమ్మతి దెలుపు, మనం
జేసె బురూరవుఁడు నామె చెప్పిన ప్రతినన్. ౧౩౮

వ. అంతఁ బురూరవుండును నిరంతర మూర్వశీరూపముగ్ధుండై యంతిపురంబులో నుపవనాంతరభూములఁ గేళిదీర్ఘికా ప్రాంతములందు శైలములఁ బ్రసవనంబు లుపత్యకంబులం దెంతయుఁ దృప్తి లేక రమియింపఁ దొడంగెఁ తదేకచిత్తుండై. ౧౩౯

వ. యజ్ఞంబుల్ తలపెట్టఁ డొక్కపుడుఁ, బ్రదేతాగ్నుల్ భజింపండు, దూతల్ దిక్కుల నింపఁ బంపఁడు, జనాహ్లాదంబు గావింపఁ, డప్రజ్ఞుండై త్యజియించెఁ గర్మములు ధర్మంబుల్ మహాదానకం, బజ్ఞుండట్లు పురూరవుండు సుమబాణావర్తసంవర్తియై. ౧౪౦

క. ఒక్క నిమేషం బేనియు
నక్కమలేక్షణవియోగ మసహము గాఁగాఁ
జొక్కుచు నూర్వశివలపునఁ
దక్కు సమస్తంబు మఱచెఁ దన్మయుఁ డగుచున్. ౧౪౧

క. కొన్నాళ్ళు గడవ నిట్టుల
నన్నపురూరవునిఁ గూడి యూర్వశి భువిలోఁ,

జిన్నంబోయెను దివి; యది
గన్న సురేశుండు వల్కె గంధర్వులతో. ౨౩౮

క. ఊర్వశి లేనిది చక్షుః
పర్వంబుగ లేదు, శోభ వదలె దివము, మీ
రుర్వికిఁ జని వడిఁ గొనుఁడీ
యూర్వశియురణముల రాజనుక్తి చెడంగాన్. ౨౩౯

క. గంధర్వులు నటు పలుకు సు
ధాంధఃపతియానఁ దరలి రప్పుడ యిలకున్.
గంధవహు మించు జవమున,
సంధిల విశ్వావసుండు సర్వాగ్రిముఁడై. ౨౪౦

తే. అది కఠోరతమిస్ర, విహాయసమునఁ
గాలమేఘాదంబినీమాల కాఱుకోనియెఁ;
గటిక చీఁకటి దిక్కులఁ గ్రమ్మె; నప్పుడు
చేరియుండె నూర్వశిని బురూరవుండు. ౨౪౧

తే. ఆ మహాగాఢతర తమిస్రాంతరమున
నూర్వశీమేషయుగము గంధర్వవరులు
వెరవుమై హరియించి; రా యురణములును,
నఱచుచుం బోయె మింట నమ్మా యటంచు. ౨౪౨

శా. అమ్మా యంచు విహాయసాగత తదీయాక్రందనాదమ్ము శ్రో
త్రమ్ముల్ సోఁకినమాత్ర నుల్కిపడి పాదం బాదిగా మస్తకాం
తమ్మున్ దేహము మాతృభావము సముద్భ్రాంతంబుగాఁ గోపరో
షమ్ముల్ క్రమ్మఁగఁ బల్కె నూర్వశి విభున్ శంకానిరాతంకయై.

ఉ. ఓయి పురూరవా! వినవటోయి యదే యురణార్భకమ్ము ల
మ్మా యని సంస్కృతశ్రుతుల మాటికి మాటికి నన్నుఁ బిల్చుచుం
గూయిడునోయి! నాకడుపు కోయుచు మోయుచు నున్నదోయి! దీ
నాయితతద్రవమ్ము; నిను నమ్ముట నెంతటి బేల నైతిరా! ౨౪౪

ఉ. నీ వొక ప్రాణపుంశ్చవని నే భ్రమఁగో, నిది నేను గాను సే
నన్న వసి సమ్మి, మూఢమతి న్యాసము సేసితి మేషయుగ్మముం
నీవశమందుఁ, బుత్రకులుగ నే నివి సాఁకుదుఁ, జేతకాని దీ
నావనదీక్షుఁ బూని యిటు లక్ష్మమె సిద్ధునఁ దాఁగ స్త్రీగతిన్? ౧౧౧

ఉ. కనుఁడు లాలకించి మదనాలసభావము మాని యూర్వశీ
ధ్యానసిమగ్నుఁడై తొలఁగు నంబరమే సరిచేసికొక యా
స్తేనులఁ బట్టి సంభ్రమముగఁ బరతెంచెను మింట మేషశా
బ్దానుగతిన్ నిలుండు నిలుఁ డం చదలించుచు రాజు వారలన్. ౧౧౨

క. విడిచిపుట్టం బెఱుఁగక
కూడం బరతెంచు రాజుకోపమునకు వా
రోడుచు విశ్వావసుముఖు
లాడనిఁబోడిరి వదలి తదురణద్వయమున్. ౧౧౩

ఉ. రోజుచు వెంట నంటెడు పురూరవు నూర్వశి చూచునట్లు వి
భ్రాజితవహ్ని తటిల్లత వెలార్చుచుఁ బాఱెరి దేవయోను లా
రాజును గాంచి నగ్ను సురరామ ప్రతిజ్ఞ విభంగ మయ్యె నన్
వ్యాజముతో యథేచ్ఛ జనె వారసప్రేముడి విస్మరించుచున్. ౧౧౪

క. ఆ రెండు మేకపిల్లలఁ
దీఱని తమకమునఁ జేరఁదీసి మృదువుగా
నీరుచు గోళులఁ బుణికి పు
రూరవుఁ డురమునఁ గదించి లోలత వచ్చెన్. ౧౧౫

క. వచ్చి నిజమందిరమ్మున
నచ్చానం గానలేక యంగజవశుఁడై
తచ్చిత్తత విహ్వలుఁడై
యుచ్చైరావంబుతోడ నూర్వశి యనుచున్. ౧౧౬

క. త్రిమ్మరుచు దేశదేశము
నిమ్మహిఁ సర్వంబు వెదకి యెంతయు వ్యథతో

నమ్మోసినిం గుసుత్షే
ప్రేమ్మునఁ బొడఁగాంచి పలికె దైన్యము దోఁపన్. ౨౫౪

సీ. నిలు నిలు మూర్వశీ! నిలుము, నీకుఁ ద్యజింప నన ర్హ్మయ్యె, స్నేహసం
శిలికెడు పల్కు నా చెవులఁ జిల్కవె, నీవు వశుండ నే, భవ
ల్లలితభుజానుబంధ పరిలాలిత మీ మృదుకాయ మల్ల, క
కులు వృకముల్ చనిం గొనఁగఁ గోరెదొ చూడఁ బరిత్యజించి నన్?

తే. సకలదేశాటనంబున శ్రాంతుఁ డగుచుఁ,
గానమున నార్తుఁ డగుచుఁ దుఃఖమ్ముచేత
వివశుఁడై, బహుకృపణుఁడై, విలపనములఁ
బల్కు ప్రియుఁ గాంచి యూర్వశి బదులు పల్కె. ౨౫౫

శా. రాజా! యెంతటి మూర్ఖచిత్తుఁడవు! శాస్త్రజ్ఞాన మేమాయెఁ? దే
జోరాజం బోయె వివేక మెల్ల? నృపులై యున్నట్టి వా రెందు న
వ్యాజప్రేమ సమాదరింత్రె వశులై వామాక్షులన్ జోరులన్?
స్త్రీ జంబూక వృకంబు లొక్కఁ టని నిశ్చింతించవే యో నృపా!

క. ఇట్లు లూర్వశి వచియించిన
కటువాక్యము లాలకించి గాసి దెలియకే
చటుమట లాడెను స్వైరిణి
పటుపాశనిబద్ధబుద్ధి పార్థివవరుఁడున్. ౨౫౬

తే. వేదవిశ్రుత మీ కథావిస్తరమ్ము
చెప్పితిని దీని మీకు సంక్షేపపరచి;
సాధకుఁడు స్త్రీవశుండు గాఁ జన దటంచుఁ
బల్కు సూతుఁ ని ట్లడిగిరి పరమమునులు. ౨౫౭

## సుద్యుమ్న చరిత్రము

విధివశంబుచేత వీరుండు సుద్యుమ్నుఁ
డనెడు నృపుఁడు నారి యయ్యె నంటె,
యెట్టులాయె నాతఁ డిళగా, బుధుం డామెఁ
బెండ్లి యాడె నెట్లు విస్తరింపు. ౨౫౮

చ. సుఖ మెఱుఁగండు బ్రహ్మ మధుసూదనుఁ డేసి మనోహరేంద్రియా
సక్తిఁ గొన నేర్చియుం బరమ సౌఖ్యము నందఁ డనేకయత్నస
మ్ముఖుఁ డయి యుద్ధముల్ సలుపు మూర్ఖనిశాటులలో, ధనాధిరా
ట్సుఖుఁడు తపం బజస్రమును సల్పుట దుఃఖియె యంచు నెంచెదన్.

ఉ. లోలుపుఁ డైనచో ధనికుఁడున్ సుఖనిద్ర క్షణంబు పొందఁగాఁ
జాలఁ, డిలన్ దరిద్రుఁ డొక సౌఖ్యము నొందుట సాధ్యమౌనె, యిం
కేల మహాత్మ! నీ వెఱిఁగి యెర్గియు సంసృతిదుఃఖజాలస
మ్మేళన సేయ నిట్లు నియమించెదు నన్ను భవత్తనూభవున్? ౫౧౫

క. దుఃఖము జన్మము, జరయుం
దుఃఖము, మరణంబు నొంద దుఃఖము, మఱలన్
దుఃఖము గర్భావాసము,
దుఃఖమయం బీ జగత్తులో సంసృతియే. ౫౧౬

శా. భార్యాపుత్రులు పౌత్రులుం బరిజనుల్ భారంబుగాఁ దన్నునో
ద్ధుర్యత్వంబున లోభతృష్ణల మహాంధుం డౌచు సంపన్నులన్
ఆర్యా! దేహి యటంచు దీనముఖుఁడై యాచించు విద్వాంసుఁ డే
మర్యాదం గను? నిత్యమున్ మరణశుంభద్దుఃఖముం బొందఁడే!

క. ఏకోదరునిం జింతలు
సోఁకవు, వాఁ డెట్లొ కడుపు సుష్టుగ నింపున్,
జేకొని మూలమ్ములనో,
యాకలములనొ ఫలములనొ, యాఁకలి యడఁగన్. ౫౧౭

తే. కర్మకాండంబున మదాత్మ కనదు రక్తి;
పలుకు ప్రారబ్ధ సంచిత వర్తమాన
కర్మ లవి మూఁడు క్షీణించు మర్మ మేదొ,
యోగమో జ్ఞానమో యన్యయోత్సవంబు. ౫౧౮

క. జలగవలెన్ నిరతంబును
లలన తనూరక్త మెల్ల లాలనఁ బీల్చున్;

దెలియక మూర్ఖుఁడు భ్రమపడు
లలితము లగు భావచేష్టలన్ మోహితుఁడై. ౫౨౦

క. దొంగ హరించును విత్తమె,
యంగన భోగముల బలము నైశ్వర్యంబున్
రంగైన సుతుల మనమున్
దొంగిలు సర్వమ్ము; నన్నుఁ ద్రోయకు మందున్. ౫౨౧

ఉ. ఈ విధిఁ బల్కు పుత్రునినిరీహత కెంతయు దుఃఖితాత్ముఁడై
భావన చేసె వ్యాసభగవానుఁడు నేమి యొనర్తు నంచు, నా
పావనమూర్తికన్నుల నవార్యములై ప్రవహించె నశ్రువుల్
మై వడఁకెన్ మనస్సు కడు మ్లానత నొందె నెసంగె గ్లానియున్.

తే. అట్లు శోకపరీత దీనాత్ముఁ డగుచు
వగచు జనకుని ముని భగవానుఁ గాంచి
విస్మయోత్ఫుల్ల నేత్రారవిందుఁ డగుచు
శుకుఁడు తలపోసె నిట్లు వ్యాసుండు వినఁగ. ౫౨౩

క. ఆహా! మాయాబల మిది
మోహంబునఁ బండితులనె ముంచెడి బలిమిన్;
మోహితుఁగా వేదాంత
వ్యాహర్త శ్రుతిప్రమాణు వ్యాసునె చేసెన్. ౫౨౪

శా. ఏ దీ మాయ యి దెంత దుష్కర? విమోహీభూతునిం జేసె నీ
వేదవ్యాసుఁ బురాణకర్త జయసంవిద్వక్తఁ బారాశరిన్
శ్రీదైత్యారికళాంశసంభవు జగత్ క్షేమంకరాకారు, నే
నా దేవిన్ శరణంబు చొచ్చెద నమేయన్ ధ్యేయ మాయామయిన్.

ఉ. ఏమన నౌ నహో! బల, మ దెంతటి వీర్య మహో, ప్రభుండు మే
ధామయుఁ డీశ్వరుం డితఁడు ధైర్యము దక్కి విభగ్నపోతుఁడై
భ్రామిలు ప్రాకృతాపణికభాతిఁ దదీక్షణనిర్మితాత్మమా
యామయ వార్ధి మగ్నుఁ డయి యట్టిటులై యురలించు నశ్రువుల్.

తే. బ్రహ్మ విష్ణు హరాదులే భ్రాంతు లైన
నెవఁడు మాయావశుండు గాఁ డీత్రిలోకి?
నితఁ డెవఁడు? నే నెవండ? ని దెట్టి భ్రమము?
పాంచభౌతిక దేహ సంబంధ మేమి? ౫౨౭

తే. సర్వకారణకారణ, సర్వదేవ
జనని, బ్రహ్మాదులకును నీశ్వరిని, దేవి,
మఱిమఱి శుకుండు మనసా నమస్కరించి,
పలికె నిటు తండ్రి శోకవిహ్వలునిఁ గాంచి. ౫౨౮

క. అందఱకు బోధ చేసెడి
నిం దెలుపం దరమె నాకు? నే నీ జనిలో
నందనుఁడ నైతి నీ, కా
ముం దెవరమొ తెలియ వశమె? మోహ మి దేలా? ౫౨౯

ఆ. అన్నపానములన యాఁకలి దగ తీఱు,
బుత్త్రదర్శనమునఁ బోవునొక్కొ?
శ్రవణగంధములను జెవియు ముక్కు రమించుఁ,
బుత్త్రుఁ గాంచి తనివిఁ బొందఁ బోవు. ౫౩౦

క. పుత్త్రునికంటెన్ ధనమే
పాత్రము సాధింప సుఖము; పశువుగ నుండం
బుత్త్రు నజీగర్తుఁడు మును
ధాత్రీపతి కమ్మలేదె ధనలోభమునన్? ౫౩౧

ఉ. సంసృతివాసనా భయద జాల నిబద్ధము కాదు బుద్ధి, వి
ద్వాంసుఁడ వన్యదుర్లభభవం బిది నాది కృతార్థ మానటుల్
ధ్వంసముగా మదాత్మఁ గల ధ్వాంతము, చీఁకటి పాఱద్రోలు నా
హంసుఁడువోని జ్ఞానకలికార్చిరుచుల్ వెలిఁగింపు నాయెడన్. ౫౩౨

## శ్రీ దేవీ భాగవతావతరణము

తే. బుద్ధిమంతుఁడు వ్యాసునిపుత్రుఁ డిట్లు
శాంతుఁడై తురీయాశ్రమిసదృశబుద్ధి
సమగ శుకుండు, వ్యాసమహర్షి మిగులఁ
బ్రీతుఁడై పల్కె నాదరస్మితుఁ డగుచు. ౪౩౩

చ. చదువు శుభంబు భాగవతసంహిత పుత్రక! బ్రహ్మసమ్మితం
బది, శుక! పంచలక్షణసమన్వితకోశము నాతిదీర్ఘమై
నది, పదిరెండుస్కంధముల నయ్యది వెల్గుఁ, బురాణరాశి క
య్యదియె విభూషణంబు, కలయన్నిట నా కభిమానపాత్రముౕ.

క. అది విన్నంతన నరునకు
సదసద్‌జ్ఞానము వివేకచతురత గలుగుౕ;
మొదలౕ దాని నెఱింగెను
సదమలమతి యచ్యుతుండు; చదువుము నీవుౕ. ౪౩౪

చ. హరి వటపత్రగర్భమున నర్భకుఁడై శయనించియుండి యు
బ్బరపడి చింత సేసె, నెటు పుట్టితి? నాజనయిత్రి యెవ్వ? రే
పరికరజాతజాతుఁడను? బాలుఁడ నౌటకుఁ గారణం బదో?
యెఱుఁగుట యెట్లొ? సర్వము చిదేకరసం బిది యంచు వ్యగ్రుఁడై.

తే. అట్లు చింతించెడి ముకుందుఁ డాలకించె,
నీ సమస్తమహంవాచ్య మేన సుమ్ము;
ఇతరము సనాతన మ్మైన దేమి లేద;
అను నఖిలధాత్రి శ్లోకార్ధ మంబికోక్తి. ౪౩౭

ఉ. ఆ శుభవాణి శౌరి హృదయాబ్జములోఁ బదిలంబు సేసి, యా
పేశలసత్యవాక్యకర్త్రి ప్రేరణ వర్తిలెఁ? బుంనపుంసక
స్త్రీశమొ, యెట్లెఱుంగు టని చింతిలి, భాగవతంబు నెమ్మదిౕ,
శ్రీశుఁడు కాంచి మాటికి జపించి దృఢం బొనరించెఁ దచ్ఛ్రుతిౕ.

ఉ. ఆ యెడ నామహాత్మువిమలాక్షులకుం బొడకట్టె లక్ష్మి శాం
తాయతనేత్రయై వరశుభాంబరభూషణయై చతుర్భుజా
ధ్యాయిత శంఖ చక్రకగదాబ్జ మహాయుధయై మృదుస్మితా
స్యాయసితాస్యయై స్వసదృశాత్మవిభూతిసఖీసమాఖ్యయై. ౨౩౯

క. రతి భూతి బుద్ధి కీర్తియు
స్మృతి మతి స్వధ స్వాహ శ్రద్ధ మేధయు దయయున్
ధృతి జృంభ తంద్ర నిద్రయు
గతి లజ్జయుఁ బుష్టి తుష్టి క్షమయున్ క్షుధయున్. ౨౪౦

క. వరభూషణాంబరాయుధ
ధరలై మందారమాల్యదాపితశిఖలై
యిరువది యొక్కరు శక్తులు
పరివేష్టింపంగఁ జక్రి పరికించె శివన్. ౨౪౧

తే. ఆ నిరాధారమైన యేకార్ణవమున
సఖులఁ గూడి మహాలక్ష్మి శాంతరమ్య
మందహాసంబు పరగింప మాధవుండు
కాంచి విస్మితుఁ డగుచుఁ జింతించె నిట్లు. ౨౪౨

ఉ. మాయగ నున్నదీ యుదధి, మానిను లెట్లుదయించినారు, నే
నీయెడ నుంటి నేల, యెవ రెందుల కిట్లిట నుంచినారు, నా
కీయమ యేమి కావలయు, నెవ్వరొ, యేటికిఁ గాననయ్యె, నే
దే యనవచ్చునో, తగదొ, యే నిట నుందునొ, వెళ్ళిపోదునో?

క. ఏ మొనరించిన నే మగు
నేమో తెలియంగఁ జాల, నేల విచారం
బీ ముగ్ధబాలభావము
తో మానం బూని యుండుదున్ నిశ్చింతన్. ౨౪౪

తే. అట్లు వటపత్ర చిత్ర శయ్యాంతరమున
బాలభావంబు ధరియించి పవ్వళించి

విస్మయోన్ముగ్ధుఁ డగు మహావిష్ణుఁ గాంచి
దేవి సస్మితయై పల్కె నీవిధాన. ౫౪౫

క. ఏలా విస్మయ మందెద
వీలాగున, నన్ను మఱచు టే మబ్బుర మా,
లీలామాయాశబలిత
హేలా బ్రహ్మంబుచేత నీరిత మిదియున్. ౫౪౬

క. నే నీ సాత్త్వికశక్తిని
గానా, నిన్నెపుడు విడువఁ గాదె ముకుందా!
నేనున్ నీతో మఱిమఱి
పూనుదు జన్మంబు సృష్టిపూర్వం బెపుడున్. ౫౪౭

శా. నీనాభిన్ జనియించి బ్రహ్మయుఁ దపోనిష్ఠన్ రజశ్శక్తి సం
ధానాత్ముం డయి రక్తరంజనకళాధారేయుఁడై లోకమున్
దా నిర్మించు, మనస్సునైదయిన భూతశ్రేణిఁ బంచేంద్రియ
శ్రేణిన్ దక్కు పదార్థసంచయముతోఁ జెల్లున్ జగత్స్రష్టయై. ౫౪౮

క. లోకము సృజించు నిటు విధి;
లోకము రక్షింతు వీవు; భ్రూప్రభవుండై
లోకస్రష్టకు, రుద్రుఁడు
లోకము కల్పాంతవేళ లోఁగొను హరుఁడై. ౫౪౯

ఉ. నీహృదయాబ్జపీఠమున నిత్యము నే ననపాయనై దృఢ
స్నేహమునన్ వసించెదను, నీవశవర్తిని నై, సురారిసం
దోహ మదాపహారిత్రి నయి, తోడయి యుండి జయంబు గూర్తు, సం
దేహము మానుమా, కనులఁ దేరి కనుంగొను నన్ను సాత్త్వికిన్.

ఉ. మంగళదేవివాక్యముల మాధవుఁ డెంతయుఁ బ్రీతి నొంది ప
ల్కెం గమలేక్షణా! వినఁబడెన్ మును నాకు స్ఫుటాక్షరంబుగాఁ
గం గమనీయగీతము సగంబు శివంబు పరంబు గోప్యమం
చుం గనుపట్టు నెవ్వరివచోవిధి యయ్యది దెల్పవే సతీ! ౫౫౦

ఆ. వేద కలను గన్న పెన్నిధియుంబోలె,
మరల మరల దాని స్మరణసేతు,
మనన సేతు దాని మఱిమఱి మనసులో,
మరులు గొన్న ప్రణయపరువిధాన. ॥౫౫౨

క. హరిమధురవాక్యముల నా
వరవర్ణిని యాలకించి పరమప్రీతిన్
చిఱునవ్వొలయ ముఖంబునఁ
బరికించి మనోహరముగఁ బల్కెను హరితో. ॥౫౫౩

ఉ. ఓయి చతుర్భుజా! యెఱుఁగుదోయి గుణాన్వితనౌట నన్నుఁ, గా
నీ యెఱుఁగంగ నేర వల నిర్గుణ నా సగుణాలయన్ ముని
ధ్యేయను మూలశక్తి భువనేశ్వరి, నా పరమేశి సుమ్ము నీ
కాయెడ నర్థగీతము దయన్ వినిపించినయట్టి దమ్మెయిన్. ॥౫౫౪

శా. ఆ శ్లోకార్థము విన్న భాగవతగుహ్యార్థప్రకాశంబు నో
సుశ్లోకా! యొనరించె నీపయిఁ గృపన్, శోభాస్పదం బద్ది, శా
స్త్రశ్లాఘ్యం బది, వేదసార మది, విస్మార్యంబు కా దద్ది, పు
ణ్యశ్లోక్యం బది, రక్షణీయ మది, దివ్యంబుం బరం బచ్యుతా! ॥౫౫౫

మ. హరి! నీ వెంత యదృష్టశాలి వవుదన్నా! యీ మహావిద్యయే
కరుణాపూరతరంగితాత్మ యయి వాగ్రత్నంబు విన్పించె నీ
కరవిందాక్ష! త్రిలోకిలోన నల శ్లోకార్థంబుకంటెం బరం
బెఱుఁగ న్నానది లేదు, దేవికిని నీ వెంతేఁ బ్రియుండౌ దోహో!

తే. ఆ మహాలక్ష్మివాక్యంబు లాదరించి,
యది మహామంత్ర మను నిశ్చయమునఁ గుదిరి
హృదయకుహరాంతరమున ధరించి దాని
నెల్లవేళ జపించుఁ బద్మేక్షణుండు. ॥౫౫౬

ఉ. అంతటఁ గొంతకాలమున కాతనినాభి జనించి బ్రహ్మ దే
వాంతకభీతి విష్ణు శరణాగతుఁ డైన, మహారణంబు వి

క్రాంతి నొసర్చి, శౌరి మధుకైటభులఁ మథియించి మించి య
త్యంతరతిఁ జపించె విశదాక్షర మా మనుగీతికార్థముఁ. ౫౫౮

తే. అట్లు జపియించుహరిఁ గాంచి యా విరించి
యపుడు ప్రశ్నించె, నీచేయు జప మ దేమి?
యెవ్వరి స్మరించి యెడఁద రమించుచుందు?
వఖిలజగదీశ! నీకంటె నధికుఁ డెవఁడు? ౫౫౯

వ. నావుడు శ్రీహరి యి ట్లనియె. ౫౬౦

క. ఎందును భగవతి నీ నా
యందుఁ గ్రియాకారణాత్మ యగు శక్తి వెలుం
గొందుఁ, దదాధారంబై
పొందుఁ రూపంబు జగతి పూర్ణాంబుధియుఁ. ౫౬౧

ఉ. ఈ సచరాచరాత్మజగ మెల్ల నదే సృజియించు, నాపరా
ఖ్యా సముదీర్ణ శక్తియె యనాది ప్రసన్నయె యైన మోక్షసు
శ్రీ సమవాప్తిహేతు వయి చెల్లు నదే, మఱియుఁ నరాళికిఁ
శ్రీసకలేశ్వరేశ్వరియె నిచ్చలు సంసృతిబంధహేతువౌ. ౫౬౨

తే. అట్టి చిచ్ఛక్తిసంభవం బం చెఱుఁగుము
నేను నీవు విశ్వ మ్మెల్ల, నిశ్చయ మిది;
భాగవత మది గీతార్థపరము నాకుఁ
బల్కె, నది విస్తృతం బగు ద్వాపరాది. ౫౬౩

క. అని కరుణించిన హరి, దా
నిని గ్రహియించెను విరించి; నీరజజుఁడు, నం
దను నారదు దీక్షించెను;
మునికులమణి యతఁడు నాకు బోధించె దయఁ. ౫౬౪

సీ. దాని నేఁ జింతించి ద్వాదశస్కంధంబు
గా విస్తరించితి దేవిచరిత;

బ్రహ్మసమ్మిత మది పంచలక్షణయుక్త
పుణ్యపురాణమ్ము, పూతచిత్త!
వేదార్థసారంబు వేదాంతసారంబు
ధర్మశాస్త్రసమంబు శర్మదంబు
వృత్రాసురవధాది వివిధకథాఢ్యంబు
భాగవతాఖ్య దీవ్యత్పురాణ;
మది పఠించిన వినినఁ బుత్రార్థదంబు,
పరమశాంతి దీర్ఘాయుష్యకరము శివము,
జ్ఞానరవిబోధ మజ్ఞాననాశకం బ
పార సంసార వారాశి తారణంబు. ౫౬౫

తే. అది పదెన్మిదివేల సంఖ్యం దలిర్చు
శ్లోకములఁ బొల్చు; దాని సుశ్లోక! నీవు
సంగ్రహించి ధరింపు హృత్సారసమున,
వినెదు నీతోడ రోమహర్షణి యితండు. ౫౬౬

వ. సూతుం డిట్లనియె. ౫౬౭

ఆ. వ్యాసుఁ డట్లు పల్కి భాగవతం బెల్ల
శుకునితోడ నాకు శ్రుత మొనర్చె;
నేను దాని రత్ననిధినిఁబోలె గ్రహించి
హృది ధరించినాఁడ దృఢనియుక్తి. ౫౬౮

### వ్యాసుండు శుకుని జనకునిఁ జూడఁ బంపుట

క. శుకుఁడు పురాణము వినియును
వికలుం డేకాంతశూన్యవృత్తియు నగుచున్
వికసన దొఱఁగిన నది గని
యొకనాఁ డిట్లనియె వ్యాసుఁ డొద్దిక శుకుతోన్. ౫౬౯

ఉ. ఏల శుకా! నిరంతరము నిట్లు ఋణార్దితనిర్ధనుండునుం
బోలె నితాంతచింతఁ గను మూసి తపించెదు? నీకుఁ దండ్రినై
బాలక! నేను గల్గఁగ లవంబు కొంత యెసంగఁ జాలునే?
చాలు, లగింపుమీ మొద నచంచలకీలిక జ్ఞానదీపికన్. ౧౨౦

తే. ఏన శాంతింపదేసి మోహము త్వదాత్మఁ,
జనుము మిథిలాధినాథుని జనకు నడుగ;
నాతఁడు విదేహరాజర్షి యఖిలవేత్త
తథ్యవాక్కు జీవన్ముక్తధన్యుఁడు శుచి. ౧౨౧

వ. అనుడు శుకుం డిట్లనియె. ౧౨౨

క. అన్నా! యచ్చెరు వయ్యెడి
నున్నే వంధ్యాసుతుండు నుర్వీస్థలిలోఁ?
దిన్నది తినకున్నదియున్,
జన్నది చనకున్న దగుట సాధ్యమె యెందున్? ౧౨౩

క. ఏవిధి రాజగు నాతఁడు
జీవన్ముక్తుఁడు విదేహచిహ్నుండును నా?
నేవిధిఁ జోరుఁడౌ ముని యసి,
నావాఁడున్ వైరి యనెడి జ్ఞానం బుడుగున్? ౧౨౪

క. శీతోష్ణంబుల సుఖదుః
ఖాతురతం గనక యబ్జపుట్లు జలములం
దేతీరున నంటక గృహి
యాతం డున్నాఁడో చూడ నద్భుత మయ్యెన్. ౧౨౫

క. దండింపక దుష్టాత్ముల
నుండం గలఁ డెట్టు లేలు నుర్వీపతి? య
ట్టిం డెటు ముక్తుం డనఁ బా
త్రుం డగు? నది చూడ నేగుదున్ గురుదేవా! ౧౨౬

తే. అంచు సెల వీయ వేఁడి సాష్టాంగపడిన
శుకుఁ గవుఁగిలించి పల్కె వ్యాసుండు ప్రీతి,
స్వస్తి గావుత నీకు దీర్ఘాయు వస్తు
తిరిగి యాశ్రమమునకు సత్వరమ రమ్ము. ౩౭౭

ఆ. జనకునొద్ద కేఁగి సందేహముల్ వీఁగి,
యెందుఁ బోక మరల యిందె రమ్ము.
నీ ముఖంబు గాంచి నే నాత్మ సుఖయింతుఁ,
నిన్నుఁ జూడకున్న నిలువ లేను. ౩౭౮

తే. తండ్రికి నమస్కరించి ప్రదక్షిణంబు
సలిపి చాపవినిర్ముక్త శరము పోలెఁ
గదలెను శుకుండు మిథిలాభిగమనకాంక్ష,
జనకు దర్శించి యడుగఁగా సందియములు. ౩౭౯

మ. శుకుఁ డాదారి గిరుల్ నదుల్ పురవనస్తోమంబులుఁ దాఁటుచో
నొకచో మానుల యజ్ఞదీక్షితుల యాగోద్యుక్తులఁ గాంచుచో,
నొకటన్ శైవుల శాక్తవైష్ణవుల సూర్యోపాసనాభ్యాసక
ప్రకరంబుఁ బహుధర్మనిష్ఠులఁ గనెన్ స్వాంతంబునన్ నవ్వుచున్.

క. రెండగు నేఁడుల మేరువు,
నొండొకటన హిమనగంబు, నొగి దాఁటుచు నా
తం డాపై మిథిలాపురి
కొండొక కాలమునఁ జేరెఁ గుతుకము మీఱన్. ౩౮౦

క. ఆ మిథిలానగరమ్మున
క్షేమమ్మునఁ బ్రజలు సుఖులు శిష్టాచారుల్
గా మదిఁ గని యలరుచు నభి
రామంబుగ శుకుఁడు చేరె రాచనగరికిన్. ౩౮౧

### శుకుఁడు ప్రతీహారునిచే నివారితుం డగుట

క. ముందుకు నడచెడి వ్యాసుని
నందను వారించి క్షత్తె నయమున ననె, నీ
వెందుల కిటు నడెఁ బోయెద?
విందులఁ బసి యేమి చెప్పు మెవ్వఁడ వనుచున్. ౨౧౩

తే. ఆ ప్రతీహారు ప్రశ్నంబు లాలకించి
మాఱు పలుకక స్థాణువునూడ్కి శుకుఁడు
నగరిద్వారంబు వెలువడి నవ్వుకొనుచు
నిశ్చలత విస్మయంబుతో నిలువఁబడియె. ౨౧౪

వ. ప్రతీహారుఁ డిట్లనెను. ౨౧౫

తే. నడుగ! మూగవాఁడవ యేమి? పలుక వేమి?
రాఁ గతం బేమి? పని లేక రా నెఱుఁగుదు;
నగరు రాజాజ్ఞ లేనిది తగదు చనఁగ;
నందు నజ్ఞాతకులశీలు రరుగరాదు. ౨౧౬

తే. నీవు మిగుల తేజస్వివి, నిశ్చయముగ
బ్రాహ్మణుండవు వేదవిద్వరుఁడ వవుదు;
కులము కార్యంబు నాకు వాక్రుచ్చి, పిదప
యిచ్చ వచ్చినరీతి నీ వేగ నగును. ౨౧౭

వ. అన విని ప్రతీహారికి శుకుం డిట్లనె. ౨౧౮

క. ఏటికి నిట వచ్చితి, నీ
మాటలి నది ప్రాప్త మయ్యె, మాటలిఁ కేలా?
సూటిగ విదేహనగరపుఁ
జోటే చూడంగ మాకుఁ జొప్పడకుంటన్. ౨౧౯

క. నే నీ విదేహనరపతిఁ
గానంగా రెండు గిరులు గడచి యిటు వృథా

యానమునఁ బూనితి బుద్ధిని
హీనత, నాతండ్రి నన్ను నిటు లెఱయించెన్. ౫౯౦

క. పురుషుఁడు ధనాశ భ్రమపడుఁ;
బొరపడితి ధనాశ లేక మోహవశుఁడనై;
మరలింపఁగఁ బ్రారబ్ధము
తరమా, విధివంచితుండఁ దథ్యము నేనున్. ౫౯౧

క. ఎక్కడి మేరునగాగ్రం!
బెక్కడి మిథిలాపురంబు! నే కాల్నడతో
నక్కట తీర్థము వేదము
యిక్కడ రాఁగా, విదేహ మిది చోరరాదున్! ౫౯౨

ఆ. ఇట్లు శుకుఁడు పల్కి యూ కేమి యనఁబోక
నిలిచి యుండఁ జూచి, 'నిశ్చయమ్ము,
ద్విజవరుండు వీఁడు విజ్ఞాని' యని పొల్చి
సామపూర్వకముగ క్షత్త పలికె. ౫౯౩

క. నీ యిచ్చ యెట్లు వచ్చిన
దాయెడఁ జనుమో మహాత్మ! యపరాధమ్మున్
నాయది క్షమింపు, క్షమయే
నీయట్టి విముక్తజనుల నిక్కపు బలమా. ౫౯౪

వ. శుకుం డి ట్లనెను. ౫౯౫

క. త ప్పేమి చేసినాఁడవు!
తప్పదు ప్రభుకార్యవశత దాసున కెపుడున్;
త ప్పెల్ల నాది, యెఱిఁగితి,
నిప్పుడు, పరగృహము చొచ్చి యి ట్లయితిఁ గదా! ౫౯౬

తే. అంత శుకు ద్వారపాలకుఁ డడిగె నిట్టు,
లేమిటి సుఖంబు, దుఃఖ మ దేమిటి ద్విజ!

యేమి సేయఁగవలె శుభ మిచ్ఛయించు
వాఁ డని యడుగ శుకుఁ డిట్లు బదులు పలికె. ౯౭

తే. చిత్తవృత్తులభేదంబుచేత జనులు
రాగులు విరాగు లని యిరువాగువారు;
వీతరాగులు ముత్తెగల్, జ్ఞాతుఁ డంచు,
మఱియు నజ్ఞాతుఁ డంచును, మధ్యముఁ డన. ౯౮

తే. ద్వివిధమై రాగిజనము కీర్తింపఁబడియె,
నందు, మూర్ఖులు చతురు లటంచు; నవలఁ
జతురతయు రెండు విధములు, శాస్త్రజన్య
మొకటియుఁ, మతిజన్య మింకొకటి యగుచు. ౯౯

తే. మఱియు రెండు విధమ్ములై నుతి వహించు.
యుక్త మంచును, మఱియు నయుక్త మంచు;
నీవిధంబునఁ గురిసించి యేకధారఁ,
బలుకుశుకుఁ గాంచి యిట్లని పలికె నృపతి. ౧౦౦

తే. నీవు విద్వాంసుఁడవు భూమిదేవవృషభ !
నేను మూర్ఖుఁడఁ దెలియఁగా నేరకుంటి;
నీవచించు మహార్థ, మో ధీవిశాల !
విస్తర మునన్వయింపుము విపులముగను. ౧౦౧

వ. శుకుం డిట్లనియె. ౧౦౨

సీ. రాగంబు సంసారభోగంబులం దున్న
వాఁడు రాగి యటంచుఁ బలుకఁబడును;
వానిదుఃఖంబులు బహుళంబులై యొప్పు,
వానిసుఖంబులుం బలువిధములు;
వనితా సుతారామ ధనము లొంది సుఖించు
నవివేకి దుఃఖించు ననునిమిషము;
సౌఖ్యం బతం డెప్డు సాధింపఁగా సుఖో
పాయవిచారంబు సేయవలయు;

నతఁ సుఖవిఘ్నకారియే యగు నరాతి,
పరఁగు మిత్రంబునై సుఖోత్పాదకంబ;
యందుఁ జరియుండు మోహంబు నంది చెడుఁడు;
మూర్ఖుఁ డగువాఁడు సర్వత్ర మోహితుఁ డగు. ౬౦౩

సీ. ఆత్మరక్తి విరాగి కగుసుఖ మ్మాత్మాను
చింతన వేదాంతచింతనమ్ము
నేకాంతసేవనం బివి మాత్రమే, తక్క
తుచ్ఛసంస్మృతికథల్ దుఃఖము లగు;
శుభ మిచ్ఛగించెడి శుద్ధవిజ్ఞానికి
బహుశత్రుజాలంబు పరగుచుండుఁ;
గామంబు క్రోధంబు ఘనశత్రుసైన్యంబు,
మఱి ప్రమాదాదుల మాట లేల?

వెదకి చూచిన నిమ్మహావిశ్వమందు
సర్వము విరాగిజనునకు శత్రుబలమె;
యాతనికి బంధువై యుండి యాత్మరక్ష
చేయు, సంతోష మొక్కటే సృష్టి నెందు. ౬౦౪

ఆ. వానిపల్కులు విని ద్వారపాలకుఁడును
ద్విజుఁడు జ్ఞాని యనెడు స్థిరమనీష
నతిమనోజ్ఞమైన యాకక్ష్యను ప్రవేశ
పెట్టె శుకుని మిగులఁ బ్రీతితోడ. ౬౦౫

క. శుకుఁ డట్టులు చని నగరము
సకలంబుం గాంచె విపణి సరణి క్రయకా
రక వివిధద్రవ్యార్థ్యము
వికీర్ణజనసంకులంబు విత్తాశ్రయమున్. ౬౦౬

క. కామము లోభము మోహము
తో మద మాత్సర్య రాగ ధూర్తత్వములన్

ఓమవినాదసనాద
స్తోమము త్రైవిష్టపజనము చొప్పుం గాంచెన్. ౬౦౭

## ద్వితీయకక్ష్యాప్రవేశము

తే. పరమతేజస్వి రెండవ భాస్కరుండు
వలె వెలుంగుచు నటు వోయి వ్యాసుతుండు,
దరియఁగ ద్వితీయమందిరద్వారి మఱియు
వారితుం డయ్యె నొక ప్రతిహారిచేత. ౬౦౮

తే. కట్టెవలె నట్టు నిల్చిన క్షుత్తుఁ గాంచి
మాఱు మాటాడక శుకుండు ద్వారి నిలిచె,
మోక్షమే చింత చేయుచు ముగ్ధుఁడట్లు
ధ్యాని యేకాంతియును సమదర్శి యతఁడు. ౬౦౯

క. ఒక్క ముహూర్తావధి యట
నక్కరణిన్ నిల్చి శుకుఁడు నాతని నాలో
నొక్క స్పృహామాత్యుఁడు కని
ప్రొక్కి నడి ద్వితీయకక్ష్యలోనం జేర్చెన్. ౬౧౦

ఉ. అం దొక రమ్యమహా నుపవనావని యొప్పు మరందబిందుసి
ష్యందము దిగ్దిగంతర విసారి పరాగము విభ్రమన్మదేం
దిందిర శారికా పిక సమీరిత రావము కేళిదీర్ఘికా
నందిత రాజహంసము మనఃప్రభవోజ్జ్వల మందిరంబు నై. ౬౧౧

ఉ. ఆ వనభూమిమధ్యఁ జెలువారు నొకానొక కాంతకాంతి రా
జావసథంబు, వ్యాసుతు నందు వసింపఁగఁ జేసి ప్రాజ్యసే
వావిధు లెల్లఁ దీర్చి యవారణమైఁ బరిచర్య చేయ వే
శ్యావనితాశతంబు శుకుసన్నిధి నుంచె నమాత్యుఁ డర్మిలికిన్. ౬౧౨

ఉ. ఆ పొలఁతుల్ నవోదిత వయస్సుకుమార శరీర, లంగజో
ద్దీపక దీపికా సదృశ దివ్యదృగంతలు, చక్రవృత్త నై

సీ. గంగాతటంబునం గల యాశ్రమంబుల
మహానులసేవ ధర్మములు వినుచుఁ,
దప మొనర్చుచుఁ గథాతత్పరుండై విని
మునిభాషితము సనాతనము నిట్లు:
స్వర్గంబుఁ గనఁ జేర్చు మార్గంబు శూన్యం బ
పుత్రున కటుగానఁ బురుషుఁ డెప్పు
డేయుపాయంబుచే నేనిఁ బుత్రునిఁ గాంచ
దొరకొనవలె స్వర్గ మరయునాతఁ;
డంశజుఁడు, పుత్రికాపుత్రుఁ డనఁగ, క్షేత్ర
జుం డనఁగ, గోళకుం డనఁ, గుండకుఁడు, స
హోఢ కానీన విక్రీతు, లుగ్రవనప
థంబునం బ్రాప్తుఁడు, నశక్తదత్తుఁడు నన. ౧౫౦

తే. పదివిధంబులు పుత్రులు; వార లెల్ల
మనువు గ్రహియింప నర్హు లౌ వార; లైన,
రమణిరో నుత్తరోత్తరక్రమముగాఁగ
నగుదురు నికృష్టు లెన్న ధర్మాచరణకు. ౧౫౧

సీ. ఆవాక్యముల్ విని వేవేగఁ బాండుండు
కుంతితోఁ బల్కె నేకాంతమందు;
నబల! తపోనిష్ఠుఁడౌ మౌని నొక్కనిఁ
బొంది యుత్పాదింపు పుత్రు నొకని;
నాయాజ్ఞచే దోష మేయింత లేదు; మ
హాత్ముండు సౌదాసుఁ డనెడు రాజు
మును వసిష్ఠునికృపఁ గనెఁ బుత్రు నన వింటి;
నని పల్కు పాండున కనియెఁ గుంతి;
దేవ! దుర్వాసుఁ డిష్టసిద్ధిప్రదంబు
మంత్ర మొసఁగెను; దాన నిమంత్రణంబు

నెట్టిదేవునిఁ జేసిన నిట్టె యతఁడు
వచ్చు నాయత్తుఁడై నాదుపజ్జఁ జేర. ౧౫౨

క. అంతట భర్త్రనుమతి నా
కాంత, మదిన్ ధర్మదేవుఁ గామింపంగాఁ,
జెంతకు వచ్చెన్, దద్రతిఁ
గుంతి, యుధిష్ఠిరుని మొదటి కొడుకుఁగఁ గాంచెన్. ౧౫౩

తే. వరుస, నటు వాయుచే వృకోదరుని, మఱియు
జిష్ణుని శతక్రతువరంబుచేతఁ గాంచె;
నీవిధంబునఁ గుంతి మూఁడేండ్లవరుసఁ
బుత్రులం గనె ముప్పుర భూరిబలుల. ౧౫౪

క. సుతులిం జింతాశాంతికిఁ
బతి నర్థింపంగ మాద్రి పాండుఁడు సంతో
షితుఁడై వేఁడినఁ, గుంతీ
సతి తన్మంత్రం బొసంగె సవతికిఁ గృపతో. ౧౫౫

తే. ఏకపుత్రప్రబంధార్థనే యనుజ్ఞఁ
బడసి యది యశ్వినీదేవతల స్మరించి,
నకులు సహదేవుఁ గవల సుందరులఁ గాంచెఁ;
బంచపాండవు లిటు సముద్భవముఁ గనిరి. ౧౫౬

శా. ఏకాంతంబున నుండఁగా విధిబలప్రేరేపితుండై కురు
క్ష్మాకాంతుం డొకనాఁడు మాద్రిఁ గని తత్కాంతాకృతీక్షన్ మనో
జాకృష్టుం డయి తన్నుఁ దా మఱచి డాయన్ దాని భోగింపఁగా,
నాకంజేక్షణ వద్దు వద్దనె నిషేధాలాపముల్ మీఱఁగాన్. ౧౫౭

క. ఐనన్ వినకే పాండు
క్ష్మానాథుఁడు కౌఁగిలించి గాటపుఁదమితో,
దాని దృఢపరీరంభము
లోనే మునిశాపయుక్తి లోకము విడిచెన్. ౧౫౮

ఉ. పాండుఁడు ప్రాణముల్ వదలి వ్రాలిన భూతలమందు మాద్రియున్
ఖండితనాగవల్లి తరుకాండమునుండి తొలంగునట్లు జా
రం డిగి నేలపైఁ బడె నిరంతర రోదనఘోష మెల్లెడన్
నిండ, వశం వదాత్తరవనీతులు గాఁగఁ బృథాదు లెల్లరున్. ౧౯౯

క. మునులు యథావిధిఁ బాండుని
తను వగ్నుల గంగదరిని దహనము సేయన్
దనసుతుల నిచ్చి కుంతికిఁ
జనెఁ దనపతితోడ మాద్రి సహగమనమునన్. ౨౦౦

క. అట నివసించెడి మును లం
తట జలదానాదికమ్ము తగ సలిపిన పి
మ్మటఁ గుంతిని సుతపంచక
మటు గొని తమ వెంటఁ జనిరి హాస్తినపురికిన్. ౨౦౧

క. ఎదురు సను దెంచి భీష్ముఁడు
విదురుఁడు ధృతరాష్ట్రుఁ డచటి విహితజనంబుల్
విదితపతిశాపు లగుటన్
ముదిత! పలుకు, వీర లెవరిపుత్రులొ! యనుచున్. ౨౦౨

క. మఱి మఱి యడుగం గుంతియు
భరమగు దుఃఖమ్ము గదురఁ బల్కెను వీరల్
కురుకులసంజాతులు సుర
వరజనితు లటంచు నెల్లవారును నగఁగాన్. ౨౦౩

క. పిలిచి దుఃఖాన్వితయై యా
కలికి వెసన్ ధర్ముఁ డాదిగాఁ గల సురలన్
బలికెను విశ్వాసార్థము
పలుకుఁడు మీ రెవరి సుతులొ పలుకుఁ డటంచున్. ౨౦౪

తే. అటు సమాహూతమై దైవతాళి వచ్చి
యంతరిక్షమున నిల్చి మాటాడె నప్పుడు,

నా సుతుఁడు వీఁడు, వీఁడును నాసుతుండు,
నాసుతుఁడు వీఁడు, వీరలు మాసుతు లని. ౨౦౫

క. దైవతవాక్యాల భీష్ముఁడు
సేవించి సమాదరించి చేతఃప్రీతిన్
గావించి కుంతిఁ బుత్రుల
రావించి సమర్థరీతి రక్షణ చేసెన్. ౨౦౬

### యుధిష్ఠిరాది వృత్తాంతము

తే. పంచపాండవపత్నియై పరమసాధ్వి
కాంచె ద్రౌపది వరపుత్రపంచకంబు;
కృష్ణుసమ్మతి భగిని వరించి కాంచెఁ
బార్థుఁ డభిమన్యు వీరు సుభద్రవలన. ౨౦౭

క. శూరుం డభిమన్యుఁడు పడఁ
బోరన్, హతు లైన ద్రుపదపుత్రికపుత్రుల్,
వైరాటి వానిపత్ని కు
మారునిఁ బ్రసవించెఁ గులము మఱి తెగువేళన్. ౨౦౮

క. ఐనన్ వాఁడున్ ద్రోణజు
బాణాగ్ని విదగ్ధుఁ డగుచుఁ బ్రాణము లేకే
కానం బడి, కృష్ణునికృప
చే నాతఁడు పునరవాప్తజీవనుఁ డయ్యెన్. ౨౦౯

క. మానుగ వంశములు పరి
క్షీణము లౌనెడ భవంబు చెందినకతనన్
వానికిఁ బరీక్షితుం డని
శ్రీనామం బెల్లయెడలఁ జెందెఁ బ్రసిద్ధిన్. ౨౧౦

క. మృతు లైనన్ సుతు లందఱు
ధృతరాష్ట్రుఁడు భీమవాక్యతీవ్రతరశరా

హీనాత్ముఁడై గాంధారేయుతోఁ
పతిసమీక్షతోఁ బుంచెఁ బాండవావసథమునన్. ౨౧౧

క. వారిద్దరిపరిచర్య ది
వారాత్రము ధర్మసుతుఁడు వారనిభక్తిన్
దీరిచి, యొకింత హృదయవి
చారిక సుతగతవిచార తమ మెడసేయున్. ౨౧౨

క. విదురుం డతిధర్మాత్ముఁడు
వదలక వారలను గూడి ప్రజ్ఞాచక్షుః
ప్రముదుఁడై దరి వసియించెను
ముదమున, ధర్మజుననుజ్ఞ మునుకొని నియతిన్. ౨౧౩

క. వృద్ధుం డగు ధృతరాష్ట్రుఁడు
విద్ధుఁడుగా శ్రవణములను వినుచుండంగాఁ
గ్రుద్ధుండై కటువాగ్బ
ద్ధోక్తిఁ బ్రకటించు భీముఁ డుద్ధతబుద్ధిన్. ౨౧౪

క. ఈచీఁకు దుష్టుఁ డెంతయు
నాచే నీనిసుతు లెల్ల నాశము గని హా!
వాచవిగా దుశ్శాసన
నీచునిరక్తము రణోర్వి నేఁ గ్రోలితి హా! ౨౧౫

క. అంధుఁడు చావక యీ దు
స్సంధుఁడు మాపెట్టు పిండచర్వణమున రా
డ్బంధుం డట్టులు బ్రదుకు ది
వాంధమువలె శునకమట్లు ధ్వాంక్షమురీతిన్. ౨౧౬

క. ఇవ్విధ మనుదిన మూరక
ప్రవ్వఁ దెగడుచుండ వాయుపుత్రుఁ డదయుఁడై
దువ్వాచు మొత్తని పలుకుల
నవ్వృద్ధుఁ జెవ్వుఁ బాండవాగ్రజుఁడు దయన్. ౨౧౭

క. పదునెనిమి దేఁడు లేగతిఁ
బొదలెడు దుఃఖమునఁ బ్రొద్దు పుచ్చుచు నెట్టులో
తుది వనవాసకుతూహల
ముదితముగా నంధభూపుఁ డుంకించి చనన్. ౨౧౭

సీ. శ్రుతిచోదితంబుగా సుతులకు నిర్వాప
విధి యొనర్చెడిచింత వేధసేయఁ,
మున్ను వృకోదరుముఖమున జరిగిన
యూర్ధ్వదైహికకృతు లక్షిల మసఁచు
నకృతంబులుగఁ దోఁచు నవధరించిన బుద్ధిఁ
బూర్వవైరం బెల్లఁ బుణ్యచరిత!
యటుగాన వేఁడెద నవసరంబగు ధనం
బౌర్ధ్వదైహికవిధు లాచరింపఁ

దపము సేయంగ వనులకుఁ దరలువాఁడ
ననుచు ధర్మజు నర్థింప ననిపె విదురు;
నాతఁ డేకాంతమున ధర్మసూతిఁ గాంచి
యీవిధం బెల్లఁ జెప్పి రొప్పింపఁజేసె. ౨౧౮

క. ఏకాంతమున యుధిష్ఠిరుఁ
డీ కందువ తన యనుజుల కెఱిఁగింపం, గో
పాకులమతియై మారుతి
చీకాకొనరించె నన్నఁ జెప్పుచు నిటులన్. ౨౧౯

క. అన్నా! దుర్యోధనసా
ఖ్యోన్నతికై ధన మొసంగ నూఁకొన్నావా?
కన్నెత్తని వృద్ధుఁడు సుఖ
మున్నాఁ డిఁక నింతకన్న నొప్పమి యున్నే? ౨౨౦

క. నీ దుర్మంత్రంబుననే
గాదే ద్రౌపదినిఁ గూడి కాననములలో

ఖేదం బందితి మందఱ
నేది పరాక్రమము విరటు కెఱఁగితిమి తుదిన్. ౨౨౨

సీ. మాగధుఁ జంపిన మగఁడ నే నయ్యును
సూపకారుఁడ నౌచు స్రుక్కవలసె,
గాండీవకిణశోభి కరముల జిష్ణుండు
కంకణమ్ములు దొడిగి గరిడి గఱపె,
లాక్షాగృహంబున నిక్కి ప్రహా నగ్ని
నా పురోచను నేసి యరుగవలసె,
కీచకు లందఱఁ బీచం బడంచితి
నతికష్టమున నెట్లొ యర్ధరాత్రి,
నీ ప్రసాదంబుచేత నిన్నియును గల్గె,
జ్యేష్ఠుఁడవు గాన నీ ద్యూతసిద్ధ మైన
యెన్ని యిక్కట్టులేని మే మీఁగవలసెఁ
గాక యీయన్ని పాటులు దాఁకునె మము! ౨౨౩

క. గంధర్వజాతనిగడన
బంధితుఁ డగు కౌరవేంద్రు వదలించితి, విం
కం ధన మాతనిపరసుఖ
సంధానము కీయఁ జూతు, సరి, తగు నీకే! ౨౨౪

క. నినుఁబోటి మూర్ఖుఁ డున్నే
కనులారఁగఁ బార్థుకండ్లఁ గాటుక గని, ఖం
డన చేయక ధృతరాష్ట్రుని,
ధన మీ నెంచెదవు; నేను దానికి నొప్పన్. ౨౨౫

చ. పరుసముగా వచించి యిటు, వాయుసుతుం డటు పాసిపోవ, ము
గ్ధరుఁ బినతమ్ములం గలిసి కోరనవిత్త మొసంగఁ జీకురున్;
[illegible] భూమిదక్షిణలు విప్రుల కిచ్చి యొనర్చె, శాస్త్రవి
ధ్యవిధి శ్రాద్ధదైహికవిధానము పుత్రుల కెల్ల నాతఁడున్. ౨౨౬

క. ధృతరాష్ట్రుఁడు గాంధారీ
యుతుఁడై వడి వనము చేర నుద్యతుఁడుగఁ ద
న్మతులై విదురుఁడు సంజయుఁ
డతని ననుగమింపఁ, గుంతి యటులనె చేసెన్. ౧౨౭

క. కుంతినిఁ బుత్రకు లందఱు
నెంతగ వద్దనిన నిల్వ కేగిన గంగా
ప్రాంతోర్వ్యవనఱకుఁ దోఁ జని
చింతన్ గరిపురికి వారు చేరిరి మరలన్. ౧౨౮

క. ధృతరాష్ట్రాదులు నటు సని
శతయూపాశ్రమము చేరి జాహ్నవితీర
స్థితులై తప మొనరించిరి
కృతపర్ణకుటీరు లగుచు దృఢయోగమునన్. ౧౨౯

ధృతరాష్ట్రాదుల మరణము

ఉ. వారు తపస్థులై యరిగి వర్షము లా ఱయినన్, యుధిష్ఠిరుం
డోరువ లేక మాతృవిరహోద్యతదుఃఖముఁ దమ్ము లందఱుం
జేరఁగఁ బిల్చి కన్నులను జిందెడి బాష్పకణంబు లొక్కచే
గీరుచు గద్గదస్వర వికీర్ణత నెట్టులొ పల్కె నీగతిన్. ౧౩౦

ఉ. సోదరులార! స్వప్నమునఁ జూచితిఁ గుంతి వనంబులోనఁ జెం
పేది కృశాంగ యాట; నెరయించె మనం బటుగానఁ, జూడఁగాఁ
బోఁ దలఁ పయ్యెఁ దల్లి మఱి పూజ్యుల నా పెదతల్లిదండ్రులన్
శ్రీదుని సంజయున్ విదురుఁ, జెప్పర మీరును రాఁ దలంతురే!

శా. ఆమాటల్ విని తమ్ము లగ్రజవచో వ్యాకృష్ట సంతాప్తులై
తాముం మాతృవిలోకనోత్సవ సముత్సాహంబుతో నేఁగఁగాఁ,
దాముం వచ్చెద మంచు ద్రౌపది సుభద్రాతన్వి వైరాటియున్,
మేముం వే మని పెక్కునాగరికులున్ వెంటం జనం గోరినన్.

ఉ. అంచుటుఁ గూడి తాఁ దదలి యా శతయూపుతపోవనస్థలిం
బొంది యుధిష్ఠిరుం డచటఁ బూజ్యులఁ గుంతిని బెద్దతండ్రిఁ ద
క్కుంగలఁ గాంచియున్. విదురు నక్కడఁ గానక యాంబికేయుఁ డా
నెం దతఁ డా మహాత్ముఁడు, వచింపుఁ డటంచును బృచ్ఛ చేసినన్.

మ. ధృతరాష్ట్రుం డిటు పల్కె, నా విదురుఁ డెంతేనిన్ విరక్తాత్ముఁడై
గతసర్వస్పృహుఁడు నిష్పరిగ్రహుఁడు నై కన్న్యాసి యేకాంతసం
స్థితుఁడై నిశ్చలనిష్ఠ నెల్లపుడు నా చిచ్ఛక్తి సన్మానిభా
వితజ్ఞానాకృతినిన్ సనాతనని హృద్వేశ్మస్థితం గొల్చెడిన్. ౨౩౨

ఉ. ఆవఁడునాఁడు ధర్మజుఁడు నందును నిందు వియన్నదీతట
భ్రామణ చేసి చేసి యొక రమ్య వివిక్త వనస్థలంబునన్
శ్యామశరీరు సంశ్రిత నికామ తపోవ్రతు క్షత్తఁ జూచి, దా
నామము చెప్పి భక్తిని బొనర్చె బ్రణామము, చెంత నిల్చినన్.

మ. అనఘుం డా విదురుండు ధర్మజుని పల్కాలించి మాటాడ కే
యణుమాత్రంబుఁ జలింప కచ్ఛమగు స్థాణ్వాకారముం దాల్చి ద
త్క్షణమే యుజ్జ్వల మద్భుతంబు నగు తేజ మ్మొక్కఁ డాప్రస్యా నా
స్యనికామోద్గతమై యుధిష్ఠిరునియాస్యంబుఁ జొచ్చెం జెచ్చెరన్.

తే. విదురుఁ డిటు సన్న ధర్మజుం డెదను వగచి
దేహదాహంబు సేయ యత్నించుచుండ
"వలదు పొమ్ము, విరక్తుండు, వలదు దహన"
మనెడి యశరీరవాక్కులు వినఁబడియెను. ౨౩౩

తే. సోదరులు విని గంగావిశుద్ధవారి
స్నాతులై చెప్పి రిది సవిస్తరము గాఁగ
నంధరాజుకుఁ; బాండవు లట్టు లచట
నిలిచి రొకకొన్ని నాళ్ళు పౌరులను గూడి. ౨౩౪

క. అచ్చట ధర్మజుఁ జూడఁగ
వచ్చిరి నారదమహర్షి వ్యాసుఁడు నితరుల్

సచ్చరితులు మునిచంద్రులు
నిచ్చ నతనిఁ గూడి మాట లెసకం బెసఁగన్. ౨౩౯

క. అప్పుడు వారాశీస్సునఁ
దప్పక వీక్షించి కుంతి తా ని ట్లనియెన్
జిప్పిలుచుఁ గన్నుదోయినిఁ
గప్పంగా నీరు శోకగద్గద యగుచున్. ౨౪౦

క. స్వామీ! కష్టం బూడఁగ
నామన ముద్విగ్న మయ్యె, నాఁ డెన్నఁడో యీ
భూమిం బడుతఱిఁ గాంచితి,
సామర్థ్యము కలదు, చూపి సవరింపఁగదే! ౨౪౧

క. ఈరీతి నడుగ నది, గాం
ధారియు యాచించె నిట్లు: తమ్ములతోడన్
శూరుని దుర్యోధనుఁ గనఁ
గోరెద; నే వారిఁ జూచుకొనలేదు ప్రభూ! ౨౪౨

క. మఱి యర్థించె సుభద్రయుఁ,
బరమతపోధన! కుమారుఁ బ్రాణప్రియునిన్
వరవీరుని నభిమన్యునిఁ
గరుణింపవె కాంచఁ, గనుల కఱ వది తీఱన్. ౨౪౩

తే. ఈ విధంబునఁ బలువురు నితఁ డితఁ డని
స్వర్గత కురుప్రవీర సంచయముఁ జూడఁ
బూన, వ్యాసుండు సంయతప్రాణుఁ డగుచు
దేవిని సనాతనిన్ నిల్పె భావవీథి. ౨౪౪

క. ఆ పయి సంధ్యాసమయము
ప్రాపింప యుధిష్ఠిరాదిపరివారితుఁడై
ద్వైపాయనుండు గంగా
ద్వీపవతీ పుణ్య వారివీచుల మునిఁగెన్. ౨౪౫

స్వర్గగతులైన యాతీయజనులఁ దిరిగి
రాఁ గనులఁ గాంచి తుష్టాంతరంగు లైరి. ౨౫౨

క. వ్యాసుం డంతట స్మృతికో
న్యాసం బొనరించి యామహామాయా దే
వీ సామ్రాజ్యము, మరలఁగ
భాసించెను వారి నింద్రజాలములీలన్. ౨౫౩

క. మును లందఱుఁ జేఁ బాండవు
లనుమతిఁ గొని యరిగి, రరిగి రాత్మేచ్ఛ మునుల్,
మనమున వ్యాసప్రతిభా
గణసమ్మున్న ధర్మరాజు కరిపురి కరిగెన్. ౨౫౪

క. అంతట మూఁడవనాఁడు వ
నాంతరమున దావదగ్ధుఁడై గాంధారీ
కాంతుఁడు తనసతితోడం
గుంతీయుతుఁ డగుచు మృత్యుగోచరుఁ డయ్యెన్. ౨౫౫

క. సంజయుఁ డొక్కరుం డంతకు
ముం జనె ధృతరాష్ట్రు వీడి పుణ్యస్థలయా
త్రం జవి, నిది నారదువ
ల్లం జెవిఁ బడి, ధర్మజుఁడు కరము దుఃఖించెన్. ౨౫౬

సీ. కౌరవక్షయ మయి యాఱు ముప్పది యేండ్లు
సన, యాదవులు ప్రభాసంబునందు
విప్రశాపంబున విగతమహాత్ములై,
రామకృష్ణులు కన్నులం గనంగ
మదిరాసమాస్వాద మత్తులై యెల్లరు
మడిసి రన్యోన్యప్రమర్దనమున,
బలరాముఁడును దేహభారంబు వదలెను
హరి భగవానుఁడు నచ్యుతుండు

కృష్ణుఁడు భృగుశాపంబు పాలించు నిచ్చ
వ్యాధభాణాభిహతిని జీవములు దొఱఁగె;
యాదవలయంబు కృష్ణనిర్యాణవార్త
రెంట విని వసుదేవుండు తొట్రుపడుచు, ౨౫౭

క. హత్తింపఁ జేసి దృఢముగఁ
జిత్తంబున భువనరాజ్ఞి శ్రీరూపపరా
యత్తతఁ బ్రాణములు పరా
యత్తంబులుగా శరీర మాతఁడు విడిచెన్. ౨౫౮

సీ. అతిముక్తుఁడయి యర్జునుండు ప్రభాస
తీర్థంబు చేరి తత్తీరమందు,
వారివారికిఁ దగుతీరుగా సంస్కార
ములఁ దీర్చె నెల్లవారలకు శ్రద్ధ,
హరిదేహముం గాంచి యష్టపత్నులతోడ
దహనంబు కాష్ఠసంతతులఁ జేసి,
రాముని రేవతీరామతో దహియించి,
యంత ద్వారకఁ జేరి యందుఁ గలుగు

నెల్ల జనముల నాబాల వృద్ధముగను
పురి వెడలఁ జేసి వారితో నరిగెఁ దాను;
నంతలో వాసుదేవు మహాపురంబు,
కడలి పొంగినఁ గలిసెఁ దద్గర్భమందు. ౨౫౯

క. ద్వారకఁ గల జనులం గొని
తేరంగాఁ గృష్ణప్రియలు దివ్యధనముతోఁ
జోరాభీర విలుంఠిత
లై, రది వాపింపఁ బార్థుఁ డసమర్థుఁడు గాన్. ౨౬౦

తే. నరుఁడు నంత నింద్రప్రస్థపురముఁ జేరి
యందు ననిరుద్ధసుతు యాదవాధిపునిగ

వ్రజు నభిషిక్తుఁ జేసి, తా వ్యాసుఁ గాంచి
కథన మొనరించెఁ దనదైన్యకథ యు దెల్ల. ౧౬౧

క. వ్యాసుఁడు విని యతని సమా
శ్వాస మొనర్చి నిటుల మఱి, పార్థా! హరితో
నేసమయమ్మునఁ బుట్టెద
వాసమయం బుగ్రతేజ మది పూను నినున్. ౧౬౨

క. విని పార్థుఁడు గజపురికిం
జని ప్రీడావనతుఁ డగుచు జరిగిన దెల్లన్
వినిపింప నన్న, కాతఁడు
విని హరినిర్యాణవార్త విహ్వాలమతియై. ౧౬౩

క. సానుజుఁడుగా మహాప్ర
స్థానోద్యోగంబుతోడఁ జలిమలదిక్కై
పూని ప్రయాణము, రాజ్యం
బూనిచె నభిషేకవిధుల నుత్తరకొడుకున్, ౧౬౪

తే. ముప్పదారేండ్ల వయసున నొప్పు వాని
హాస్తిపురికిఁ బరీక్షిత్తు నధిపుఁ జేసి
ముప్పదారేండ్లు సామ్రాజ్యమును వహించి
ధర్మజుఁడు వోయెఁ బ్రస్థానతత్పరమతి. ౧౬౫

క. అనుజులతో ద్రోవదితోఁ
జనెను యుధిష్ఠిరుఁడు తుహినశైలముపైపై
చని చని యట వారార్వురు
తనువులు పడఁ జనిరి దివ్యతనువులతోడన్. ౧౬౬

## పరీక్షిచ్ఛాప వృత్తాంతము

తే. అటు పరీక్షిత్తు రాజయి యఖిలపృథ్విఁ
బరమధార్మికుఁడై చేసెఁ బాలనంబు,

నితఁడు రాజర్షి యని మెచ్చ నెల్లప్రజయు;
నన్నృపు గడచెనె సమువది హాయనములు. ౨౬౭

మ. ఒకనాఁ డాతఁడు వేఁట కోయి విపులాత్యుగ్రాటవిం జొచ్చి పూ
నికతోఁ గ్రూరమృగంబులం జంపుచుఁ గ్రీడించుచుం బోవుచు
నొక యొక్కండు శరాహతం బయినఁ గన్పింపంగ రాకున్న, దా
నికినై కానన మెల్లెడన్ వెదకి యెంతే శ్రాంతుఁ డయ్యెం దుదిన్.

ఉ. ఆతఁడు శ్రాంతుఁడై చనెమున త్తఱి వేసవివేళ ప్రొద్దు తీ
క్ష్ణాతపతాపముం బఱపు చల్లన నెత్తికి నెక్కనం బిపా
సాతురుఁడున్ క్షుధార్తుఁడును నై కనె నంతికభూమి ధ్యానస
న్నీతమనస్కు నొక్కముని నిశ్చలయోగసమాధినిష్ఠునిన్. ౨౬౯

క. దాహాతురుఁడై భూమీ
రాహుత్తుఁడు మౌనిచంద్రుఁ బ్రార్థింపంగా
హాహా యిమ్మ మ్మని, యా ముని
దేహం బెఱుఁగమిని వినఁడు తిరుగఁ బలుకఁడున్. ౨౭౦

క. కడు బడలి యెంతఁ బడి దగ
యుడురంగా క్షుధయుఁ గదుర నాత్మను మఱి సం
దడి సేయఁగఁ గలిపురుషుం,
డోడ లెఱుఁగని కోప మతని కుద్రేకించెన్. ౨౭౧

క. మృతసర్పం బొకఁ డా భూ
పతియు ధనుష్కోటి నెత్తి పడవేయు మెడన్,
ధృతయోగుఁ డదియు నెఱుఁగక
యతంద్రుఁడై యుండె, రాజు నరిగె నగరికిన్. ౨౭౨

క. వనమునఁ గ్రీడించెడు త
న్మునివరు గవిజాతుఁ డను పుత్రుఁ డనఘుఁడున్
విని మిత్రులవలన నెవఁడో
తన జనకుని మెడను బాముఁ దగిలిచె ననఁగాన్. ౨౭౩

తే. అ మహాశక్తిసంపన్నుఁ డాగ్రహమునఁ
గరమున జలంబు గొని, పితృకంఠమందుఁ
గాఁపతేన నిడ్డ పాపిష్ఠుఁ బాపజేఁడు
కఱచు నేఁడవ నాఁ డని పోరి శపించె. ౧౭౪

ఆ. మునికుమారుఁ డిట్లు తన కిడ్డ శాపంబు
మహానిశిష్యువలనఁ దా నెఱింగి,
వృద్ధమంత్రివరులఁ బిలిచి పరీక్షిత్తు
పలికె నిట్లు శాపపటుత యెఱిఁగి. ౧౭౫

సీ. నాపాపమే మునిశాపరూపం బూని
యనివార్యమై వచ్చె నని తలంతు;
వేదవాదులు మృత్యు వేదంగ రా దందు
రైన, శాస్త్రము చెప్పు యత్నవిధియు;
మణి మంత్ర కౌషధి మహిమం బపారంబు;
నేను వింటిని పురాఖ్యాన మొకటి,
సర్పదష్టను బ్రియ సంజీవితం జేసెఁ
దన యాయురర్ధంబు దాని కిచ్చి
ముని యనుచు; నెప్డు భవితవ్యమునను బుధుఁడు
నిశ్చయముగో సయత్నుఁడై నిలువరాదు;
దైవమతియై నిరుద్యముం డౌ విరక్త
జనుఁడు భిక్షార్థి యతి యయి చనును మవ్వో! ౧౭౬

తే. ఎటులొ యోగించి నోటిలో నెవరొ యిడిన
నన్న మెటు చేరు నుదర ముద్యమము లేక?
మఱియును గృహస్థున కనుద్యమంబు నింద్య,
మన విని, పరీక్షితుని మంత్రు లడిగి రిట్లు. ౧౭౭

## రురూపాఖ్యానము

క. దేవా! యెవ రా మునివరుఁ?
డేవిధమున నాయురర్ధ మిచ్చి ప్రియను సం
జీవింపఁజేసె? విస్తర
భావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిటు పలికెన్. ౨౭౮

తే. భృగునకుఁ బులోమయందు జనించెఁ జ్యవనుఁ,
డతనికిం బ్రమతి సుకన్యయందుఁ బుట్టెఁ;
బ్రమతికిఁ బ్రతాపి యన్ సాధ్వి భార్య యయ్యె;
వారికి రురుండు పరమతపస్వి పుట్టె. ౨౭౯

తే. కలఁ డొకఁడు స్థూలకేశవిఖ్యాతమౌని;
యాతఁ డాశ్రమమునఁ దిరుగాడువాఁడు
గాంచె మేనక గంధర్వకాంతువలనఁ
గని వదలి పోయిన యనాథకన్య నొకట. ౨౮౦

క. ముని దానిఁ గొని ప్రమద్వర
యను నామం బుంచి పెంప, నదియుఁ ద్రిలోకీ
జనముల నిదియె ప్రమద్వర
తను వనఁగా నొప్పి పెరిగెఁ దరుణోజ్జ్వలయై. ౨౮౧

క. దానిం గని రురుఁ డంగజ
బాణార్దితుఁ డగుచు నింటిపజ్జ విమనుఁడై
దీనుండై యుండినఁ గని
దానికిఁ గారణము తెల్పఁ దండ్రి యడిగినన్. ౨౮౨

ఆ. రురుఁడు నిజముఁ దెలుపఁ ద్వరితగతిఁ బ్రమతి
స్థూలకేశుఁ జూచి సుముఖుఁ జేసి,
కొడుకుభార్య గాఁగఁ గూఁతుఁ బ్రమద్వర
నీయ వేఁడ, వాఁడు నీయకొనియె. ౨౮౩

క. శుభలగ్నము నిశ్చితమై
యుభయులును వివాహపరికరోద్యతు లయినన్
సుభగ ప్రమద్వర త్రొక్కె నొ
క భుజగమును, నాడుచు; నది కఱచెన్ దానిన్. ౨౫౦

క. క్ష్వేలాకీలామాలా
కీలితయై యసువు దొఱఁగి క్రిందం బడఁగాఁ,
గోలాహల ముదయించెను
వ్యాలోకాలోల మౌని వారములోనన్. ౨౫౧

తే. స్థూలకేశనాముఁ డొట్టి మౌనీంద్రుల
రోదనంబు వినుచు రురుఁడు వచ్చి
కాంచె నచటఁ బడిన కాంతఁ బ్రమద్వర
మేను దొఱఁగియు జిగి మెఱయుదాని. ౨౫౨

క. రురుఁ డచ్చోటు వాసి యొంటిగ
విరహాతురుఁ డగుచు శోకవిహ్వలమతియై
కరుణంబుగ రోదించెను
పరిపరివిధములను దానిబాస దడవుచున్. ౨౫౩

ఉ. దైవహతుండనైతిఁ బ్రమదావిరహార్తుఁడనైన నాకు నీ
జీవిత మేల? నాదయితచేయి గ్రహింపను, లాజహోమదీ
క్షావిధి నిర్వహింపను, విషంబు గ్రహింతునొ, నీటఁ జొత్తునో,
పావకునందు దూఁకెదనొ, పాశము కంఠమునందుఁ గొందునో!

మ. మరణోపాయవిమార్గమాణుఁడు నదీమార్గంబునం బోవుచున్
మఱియుం జేసె విచార మిట్లు, మరణింపన్ లాభమా! దానిచేఁ
బరలోకంబునఁ గూర్తునే ప్రియకు భవ్యం బింతయే? నాకుఁ ద
ద్విరహావ్యాధికృతాత్మఘాతి కెటు ప్రాపించున్ ప్రియాసంగతుల్?

క. జననీజనకుల ననఘుల
ఘనచింతావనధి ముంచి, కడుఁ బాపంబుం

గాదా నేల, యనుచు స్నానం
బొనరించి ప్రీతాచమించి యొయ్యన శుచియై. ౨౯౦

వ. జలములఁ గొంచుఁ బల్కె నిటు సత్ప్రీతిః నేని యొకింత దైవతా
పరివదివస్య, సద్గురుల భక్తి నుపాసనచేసి యుంటినేని
జ్వలనుఁడు హోమతుష్టుఁ డయి వర్తిలునేని; దపోజపంబులన్
సలిపితినేని, నాదయిత చయ్యన జీవము లానుఁ గావుతన్. ౨౯౧

ఉ. వేదము తెల్ల సాంగముగ వెల్గి యధీతము లయ్యెనేని, నా
సాదితసంస్కృతిన్ హృదయసంస్థితయే నల వేదమాత, స
మ్మోదితుఁ డయ్యెనేని రవి, పూర్వభవంబులఁ బుణ్య మింతె సం
పాదితమేని, నాప్రియ ప్రమద్వర జీవము లానుఁగావుతన్. ౨౯౨

క. రురుఁ డీవిధమునఁ బలుకుచుఁ
బరభక్తిన్ దైవతాళి భజియించి యెదన్
గరధృత తజ్జలములు భువిఁ
బరివర్జన చేయ, నపుడ ప్రత్యక్షంబై. ౨౯౩

తే. పలికె దేవదూతః బ్రహ్మిష్ఠ! సాహసం
బేలనయ్య! చావఁ బోలునయ్య!
కాలమైనఁ బ్రెళ్ళె గంధర్వకన్యక,
పరిణయమ్ము కమ్ము మఱొకకన్నె. ౨౯౪

ఆ. రురుఁడు పల్కె నిట్లుః వరియింపను మఱొక్క
వనితఁ, జత్తు నదియ బ్రదుకకున్న;
నట్లు పల్కు రురుని హఠవాక్కు లాలించి
దేవదూత పల్కెఁ దీఁపినుడుల. ౨౯౫

క. ఒక్క యుపాయము సెప్పెద,
నక్కన్యకు నీదు నాయురర్ధం బిమ్మా,
యిక్కరణిఁ జేయ దానిని
నిక్కము బ్రదికింపవచ్చు, నీ వొప్పెదవే ౨౯౬

క. రురుఁ డదివిని, యిప్పుడ ప్రమ
ద్వర కిచ్చితి నాయురర్ధభాగం, బదియే
మరలక సంజీవిత యై
కర మానందంబుఁ గూర్చుఁ గావుత మనియెన్. ౨౯౬

సీ. ఆప్రమద్వరతండ్రి యయిన విశ్వావసు
నాముండు ప్రథితగంధర్వవిభుఁడు
తెలిసి వృత్తాంతంబు దేవదూతను గూడి
చనె ధర్మరాజుపార్శ్వంబు చేర
దేవదూత పలికె దేవ! విశ్వావసు
పుత్రి ప్రమద్వర భోగిదష్ట
యై మృతిఁ గనె, రురుఁ డామె నుజ్జీవింప
నాయురర్ధం బీయ నియ్యకొనియె,

మఱియు నాతనివ్రతచర్యామహిమవలన
బ్రదుకఁగ నను జ్ఞయి మ్మని పలికి, ధర్ముఁ
డనుమతింపంగఁ, జేకొని, యామెఁ డామె
రురున కిచ్చెఁ, బెండిలి యయ్యె నిరువురకును. ౨౯౮

క. ఈవిధి నుపాయబలమున
జీవింపఁగఁ జేసెఁ ద్యక్తజీవను రురుఁడుం,
గావున మణిమంత్రౌషధ
సేవల నాత్మాభిరక్ష సేయఁగ వలయున్. ౨౯౯

క. సచివులతో నిటు లని మఱి
రచియింపఁగఁ బంచి యొక్క ప్రాసాదంబున్
రుచిరంబు సప్తభూమిక
నచిర మది ససచివుఁ డగుచు నధిరోహించెన్. ౩౦౦

తే. సేవకునితప్పు మన్నన సేయవలయు
మఱవవలె నని మానిని మరల మరల

వేడఁగా గౌరముఖుసిఁ బంపించి మఱియు
నాత్మరక్షణవ్యగ్రుఁడై యాతఁ డుండె. 301

క. మణిమంత్రౌషధుల విప్రులఁ
దనమందిరమందు నునిచి తగుచోటుల ర
క్షణకై చుట్టును శూరుల
ఘనగజముల మంత్రిసుతుని గాపుగ నుంచెన్. 302

క. గాలియు నటు చొర నేరని
లీలన్ శాసించి యెల్లక్రియ లాసౌధా
ట్టాలికమున నే జరుపుచు
నోలిన్ లెక్కించుచుండె నొక్కొక దినమే. 303

తే. దాని విని కశ్యపుం డను ధరణిసురుఁడు
మంత్రవిదుఁడు ధనార్జనాయంత్రితుఁ డయి
యా పరీక్షితు దర్శించి యతని వేడి
ధనముఁ గొనునిచ్ఛ నిలు వీడి తరలె నటకు. 304

క. నృపుశాపము విని తక్షకుఁ
డపుడ వెడలి వృద్ధవిప్రునాకారముతో
న్పథంబున నటు సను క
శ్యపుఁ గని ప్రశ్నించె వానిచనుకర్జంబున్. 305

వ. కశ్యపుం డి ట్లనియె. 306

తే. నేను కశ్యపుండ నిర్విషీకరణైక
సిద్ధమంత్రవిదుఁడ, నిద్ధతేజుఁ
గురునృపాలుఁ దక్షకుం డంటి కఱచిన
స్వస్థుఁ జేసి యశము వసువుఁ గొందు. 307

వ. తక్షకుం డి ట్లనియె. 308

క. నేన కురురాజుఁ గఱవఁగఁ
బూనిని తక్షకుఁడ, నేను ముట్టినవారిన్

నీ నేర్పున బ్రదికింపం
గా నోపవు, పొమ్ము తిరిగి కశ్యపదేవా! ౩౦౯

వ. నావుడుఁ గశ్యపుం డి ట్లనియె, ౩౧౦

ఆ. విప్రశాపయుక్తుఁ బృథివీశుఁ దక్షకా!
నీవ కఱచు నెడల నిక్కువముగ
సిద్ధమంత్రలీల జీవింపఁజేసెద,
నిందు సుంత లేదు సందియమ్ము. ౩౧౧

క. అది నమ్మక తక్షకుఁ డతి
మదమున న్యగ్రోధ మొండు మాద్యద్దంష్ట్రా
విదళన మొనరిచి, కశ్యప!
బ్రదికింపుము దీని నంచు భస్మము చేసెన్. ౩౧౨

ఆ. కశ్యపుండు నిదిగో కను మంత్రబల మని
బూది యెల్ల నొక్క ప్రోవు చేసి
మంత్రజలము చల్లి మఱ్ఱి నెప్పటియట్ల
బ్రదుకఁజేసె వాఁడు బ్రమసి చూడ. ౩౧౩

క. భ్రాంతుం డై తక్షకుఁ డనె,
నెంతటి ధన మీవు రాజునెడఁ గోరెదవో,
యంతటి ధన మిచ్చెదఁ జను
మింతట, నాపూన్కి దీరు నిదిగో మహాత్మా! ౩౧౪

చ. అది విని కశ్యపుండు మనమందు విచారము చేసె నిట్లు, లే
నిది గొని సన్న నాకు యశ మేగతి నబ్బుఁ, బ్రజాప్రియుం బరీ
క్షిదవనిపాలు లెస్స బ్రదికించిన పుణ్య మ దెట్లు వచ్చు, నా
కదియును గాక లోభమున వ్యాప్తములౌ నయశస్సమిశ్రముల్.

మ. ధనభారంబు యశోవిమిశ్ర మయి శ్రీధామంబుగా నొప్పు నా
ధనమే కీర్తివిహీన మైననెడ నసాధ్యం బైన భారం బగున్,

దనసర్వస్వము సల్పఁడా రఘుఁడు మున్ దానంబు సత్కీర్తికాం
క్షను, నెన్నాళ్ళకి యేమి యీయఁడుగ హరిశ్చంద్రుండునుం గర్ణుఁడున్ ?

తే. అట్లు చింతించి కశ్యపుం డెడఁద, నంత
ధ్యాన మొనరించి, కాంచి గతాయువునిఁగ
ధరణినాథునిఁ, దక్షకదత్తమైన
వసువుఁ గొని యేగె నిచ్చ నివర్తితుఁ డయి. ౩౧౭

తే. కశ్యపు నివృత్తుఁ జేసి తక్షకుఁడు వేగ
హాస్తినాపురిఁ జేరి యేడైనాఁడు
పురమువెలుపల నొక్క యుప్పరిగపై సు
రక్షితుం డని వినెను బరీక్షితు నృపు. ౩౧౮

క. తక్షకుఁ డట వీక్షించెఁ బ
రీక్షిత్క్షోణీంద్రు, మంత్రయుక్తుల మణులన్
దక్షు లగు విప్రవర్యు ల
నుక్షణమును రక్ష సేయ నాల్కొనువానిన్. ౩౧౯

క. అందుఁ గల విప్రశాపభ
యాందోళన జిహ్మగేశుఁ డాలోచించెన్
మందిర మిట్టిది యెట్లు చొ
రం దగు నీశాపదగ్ధు రాజుం గలవన్? ౩౨౦

క. తాపసపీడాకరుఁ డీ
పాపిష్ఠ నృపుండు మృత్యువంచనకొఱకై
యీపగిది రక్షకయి సౌ
ధోపరి నున్నాఁ డెఱింగియుం గాలగతిన్ ! ౩౨౧

క. ఎందుఁ జని యెందు డాఁగిన
నెందఱు రక్షింపఁ బూని యెదిఁ బొనరుపఁగా,
నందక మృత్యువుకోఱల
కుం, దప్పఁగఁ దరమె యెట్టి కోవిదునకు నేన్ ! ౩౨౨

క. దానస్నానాదికక
ర్మాణంబుల వ్యాధి తఱుఁగు, నాయువు హెచ్చున్,
దానివలన మృతి తొలఁగక
పూనిన సాధింపవచ్చుఁ బుణ్యాగతులన్ ! 3_౬౩

క. పాండవదాయాదుఁడు వీఁ
డుండెడి నలు పుణ్యాకార్యయుక్తుఁడు గాకే,
దండన కల మృత్యువుఁ గా
నం డహహా మేడ యెక్కి నందితుఁ డగుచున్! 3_౬౪

### పరీక్షిన్మరణము

తే. ఇట్లు చింతించి తను గొల్చి యెదుట నున్న
యురగపతులఁ దాపసవేషధరులఁ జేసి
యధిపు దర్శింప ఫలమూలహస్తులనుగ
నంపి, ఫలగతకీటమై యనుసరించె. 3_౬౫

ఉ. వారలు శీఘ్రయానమున ద్వారముఁ జేరి నివారితార్థులై
ద్వారము గాచువారిఁ గని పల్కిరి తాపసవేషధారులున్,
భూరితరాజదర్శన కవారితులై చనుచుంద్రు తాపసుల్,
మీరు ఘోనరించువారణ యమేయము నశ్రుతపూర్వముం జూడీ!

క. ఆరోహింతుము సౌధము
మా రాజుకుఁ గానుక లిచ్చి మాకొలఁదిగ నా
శీరుక్తుల యుక్తునిఁగాఁ
జేరింతుము, మాకుఁ బోవఁ దెరు విం డనినన్. 3_౬౬

క. వినయంబున రక్షకు లి
ట్లనిరి నిషేధించె నిప్పు డఖిలజనులకున్
జనపతి యిందుం జొచ్చుట,
కనఁ దగు రేపాడి మీరు కాంక్షింతురయేన్. 3_౬౭

తే. అట్లు వల్కల భోగు లసిరి, పోనిండు లే,
తెచ్చినాము రాజు కిచ్చు కొఱకు
జలము పండ్లు మూలములును, నాశీస్సులఁ
గొండు మీని నిచ్చిరండు పతికి. ౩౨౯

క. వా రది నృపతికిఁ జెప్పినఁ
దేరంగ ఫలాదు లనుమతించి బహునమ
స్కారములం దెలుపుఁడు, రే
పే రం డని వేఁడుఁ డని నరేంద్రుఁడు పంచెన్. ౩౩౦

తే. అది నివేదింప రక్షకు లవనిదేవ
వేషభోగులు నట్లు కావించి చనిన;
వార లిచ్చిన ధన మూల ఫలము లపుడు
విభుసముంగల నుంచిరి వినతు లగుచు. ౩౩౧

క. ఫలములఁ గొని భూపాలుఁడు
పలికెను సచివులకుఁ మీరు భక్షింపుం డీ
ఫలముల నని, వారల కా
ఫలముల నన్నియును బంచి, స్వయముగ నందున్— ౩౩౨

క. ఫల మిది పరిపక్వము ద్విజ
కులదత్త మటంచు విచ్చి గొబ్బున నందున్
నలు పగు నయనంబులతో
నలఁతి పురువుఁ దామ్రతనువు నాలోకించెన్. ౩౩౩

చ. అది గని విస్మితాత్మ సచివావళి కిట్లనె నుత్తరాసుతుం,
డదె రవి యస్తమించెడిఁ, విషాప్తి విషాదము నస్తమించుచు
న్నది, మునిశాప మానకకారణార్థము కా దన కొప్పుకొందుఁ, బు
ర్విది, ననుఁ గాటు వేయుత యతెచ్చెనటంచు ధరించెఁ గుత్తుకన్.

మ. దినవాథుం డపరాద్రిఁ గ్రుంకుతటి ధాత్రీపాలకుం డాక్రమిన్
దనకంఠంబునఁ జాల్పఁ దక్షకుఁడు విస్తారోగ్రరూపంబు పె

ల్చినఁ బెం పొంది భయానకప్రకృతిఁ గాలప్రఖ్యుఁడై తాల్చి భూ
పుని భోగంబులఁ జుట్టి, ముట్టి కఱచెన్ ఘూత్కారఘోరంబుగా.

క. స్నేహాతు లేడ్చిరి, సచివులు
మోహితులై చెదల, వగలఁ బొగిలిరి వృద్ధుల్,
హాహాకారం బెల్లెడ
వ్యాహృతమై పెంపు గాంచెఁ బరిజనములలో. 33౬

క. వేష్టితుఁడై తక్షకుచే
నష్టాఖిలపౌరుషుఁడుఁ బ్రణష్టచలనుఁ డ
స్పష్టధృతి పరీక్షిన్నృపుఁ
డిష్టులకున్ దుర్నిరీక్ష్యహీనత బ్రుంగెన్. 33౭

క. ఘోరములై యహిముఖని
స్సారిత గరళాగ్నిశిఖలు క్షణమాత్రములో
మారణదహనము సేయఁగ
నే, రాజుం గూలె దగ్ధవృక్షోపముఁడై. 33౮

క. రక్షకు లందఱుఁ గనఁ జనెఁ
దక్షకుఁ డపు డంతరిక్షధామముదారిన్
మాక్షేత్రాక్షేప జగ
ద్భక్షణకరణోత్థ సర్వభక్షునిరూపై. 33౯

సీ. విగతజీవుని భూపు వీక్షించి జను లెల్ల
విలపించి రెంతయుఁ గలఁత నంతఁ
బుత్రుని బాలుని మునుకొని మంత్రులు
పరలోకసత్క్రియల్ జరుపఁ దొడఁగి
విషదగ్ధమై భస్మవిధి నున్న తత్తను
వగురుకాష్ఠముల జాహ్నవితటమున
దుర్మరణాగత దోష ప్రాయశ్చిత్త
విధిపూర్వముగ దాహవిధులు దీర్చి

యథార్థ్వదైహికక్రియలు శాస్త్రానుగదిత
రీతిఁ జేసిరి, చేసి సర్వసురులకు
బహువిధంబుల దానముల్ పాడియావు
లన్న వస్త్ర ధరా సువర్ణాదికములు. ౩౮౦

చ. అంతటఁ బౌరజానపదు లందఱుఁ బిల్చి తదీయవాంఛ న
త్యంత మెఱింగి మంత్రు లఖిలావనిపాలనలక్షణాళి భా
స్వంతుఁ బరీక్షిదాత్మజుని బాలకునిన్ జనమేజయాఖ్యు నా
శాంతమహీశుఁ జేసిరి శుభాహమునం దిడి సింహపీఠిపై. ౩౮౧

క. ధాత్రేయీరక్షితుఁడై
ధాత్రీశుఁడు రాజచిహ్నధరుఁడై విలస
ద్గాత్రుండై సర్వాదర
పాత్రుండై దినదినప్రవర్ధితుఁ డయ్యెన్. ౩౮౨

తే. పదునొకండవయేఁడు సంప్రాప్తమైనఁ
గులపురోహితుఁ డతనికిఁ గులనియుక్త
విద్య నొసఁగిన, నతఁడు నా విద్యఁ గొనియె
నిజకులక్రమాగతమైన నీతి మెఱయ. ౩౮౩

క. నృపుఁడు ధనుర్వేదంబున
నిపుణతఁ బరిపూర్ణదీక్ష నిష్ఠితుఁ జేయన్
సుపరిష్కృతుఁడై వడసెను
నృపతియుఁ గుంభజునికడఁ గిరీటియుఁ బోలెన్. ౩౮౪

క. వేదంబున మఱియు ధను
ర్వేదంబున ధర్మశాస్త్రవిస్తర నృపనీ
త్యాదిక సమస్త విద్యల
వైదుష్యము కలిగి వెలిగెఁ బారీక్షితుఁడున్. ౩౮౫

క. బలవంతుఁడు శుభదర్శనుఁ
డలఘుపరాక్రమఁ డనిందుఁడు డనల్పవిక్రముఁడున్

లలితుఁడు జితేంద్రియుఁడునై
యిల ధర్మజురీతి ధర్మ మెడయక యేలెన్. ౩౮౬

తే. వానికల్యాణసుగుణసంపత్తి గాంచి
యతనికి సువర్ణవర్మాఖ్యుఁ డనఁగ వెలయు
కాశికాపతి శుభగుణరాశియైన
కన్యక వపుష్టమ నొసంగెఁ గాంతగాఁగ. ౩౮౭

ఉ. దానిని నల్లగల్వలవితం బగు గన్నులదానిఁ, దేంట్లచం
దాన నెసంగు దీర్ఘలలితంబు కచం బగుదానిఁ, గుండలం
బౌనకుచద్వయ నిధాన మగు తప్పగు చన్నులదాని, గంగతీ
రాన వెలుంగు సైకతవిరాజి నితంబముదాని నా సతిన్. ౩౮౮

వ. కూడి జనమేజయుండు వనంబుల నుపవనంబుల వివిధ విహార విలాస
కేళీవినోదంబులఁ దవిలి, కాశీరాజసుత యగు నంబికం గూడి విచిత్ర
వీర్యుండును, సుభద్రం గూడి యర్జునుండునుంబోలె, నిరంతరతదా
యత్తంబగు చిత్తంబున నితరం బెఱుంగక యుండె. ౩౮౯

జనమేజయుండు సర్పయాగం బొనరించుట

తే. అట్టియెడఁ దీక్షుఁ డుత్తంకుఁ డనెడు వాని
తక్షకుని కీడుసేఁత సంతప్తుఁ డగుచుఁ
దదపచితికి సమర్థుని వెదకి తుదకు
నెంచి పారీక్షితునిఁ జేరె నిభపురంబు. ౩౯౦

క. జనమేజయు నుత్తంకుఁడు
గని యిట్లనెః నకట! నీవు కార్యాకార్యం
బను వెఱుఁగ, వకర్తవ్యం
బొనరుతు, కర్తవ్యకలన నూనవు బుద్ధిన్. ౩౯౧

క. ఏ మనఁ గల నిన్నయ్యో క
ర్మామర్షుని విస్మృతారి నకృతోద్యమునిన్

క్షమియింపు బాలచేష్టా
గామున నతండ్రిజ్ఞు నేమి ప్రార్థింతుఁ బ్రభూ! ౩౫౨

ఉ. ఐదులు పలికె నిట్లు పార్థమున్మనుమండు
నెఱుఁగకున్న వైర మేమి నాకు
నేను ప్రతికృతంబు దేనికిఁ జేయ ని
ప్డే మొనర్పవలయు నో మహాత్మ! ౩౫౩

క. వానికి నుత్తంకుం డనె
నో నృప! నీతండ్రిఁ జంపె నొక జిహ్మగ దు
ర్మానుఁడు తక్షకుఁ, డనుగు మి
దే నీమంత్రులను దండ్రి యీల్గినవిధముల్. ౩౫౪

సీ. రాజు విని యవి మంత్రులఁ బ్రశ్న సేయ
వారు పల్కిరి ద్విజశాపవాక్యవలనఁ
బాము గఱచిన నీతండ్రి పడె నటంచు
నది వినుచు విస్మితుం డయి యడిగె రాజు. ౩౫౫

తే. మహాసశాప మంత్రము దాని కారణ మిందుఁ,
దక్షకుం డదేమి తప్పు చేసెఁ?
దెలుపు మన్న, మానికి తెలిపెఁ, గశ్యపునకు
నను వాసంగి తిరిగి పంపిన కథ. ౩౫౬

క. మఱియుం జెప్పం దొడఁగెను,
రురుఁ డనియెడు విప్రుఁ డొక్కరుఁడు ప్రియఁ గాకో
దర మది కఱచుట మడిసినఁ
దిరుగం బ్రదికించి పూనెఁ దీవ్రశపథముల్. ౩౫౭

క. ఇది మొదలుగ నేఁ జంపెద
వెదకి వెదకి యెల్లఫణుల పృథ్వీస్థలి నం,
చది మొద లటులే సేయుచు
ముదుసలి డుండుభముఁ జూచి క్రోధమ్మున భార్గవుఁడు. ౩౫౮

వ. అది గని యా డుండుభంబును, నో బాడబశ్రేష్ఠా! నీ కెగ్గొన
ర్చితి? నన్నెందుల కూరక చిదుమ నేయం బూనెద? వుడుగు; మన.
వాఁడు, నేను రురుండను; మీజాతి ద్విజిహ్వాం బొకండు నిరపరాధ
యగు నాప్రియురాలిం గఱచి పొట్టం బెట్టుకొనియె; నది మొదలు
తత్ప్రతీకారంబుగ నఖిలవ్యాళ మథనంబునఁ గృతప్రతిజ్ఞుఁడ నైతి;
నన డుండుభ మి ట్లనియె. ౩౫౯

క. నే నట్లు కఱచుపామును
గానయ్య! సమానరూపకలితుఁడ నింతే,
ప్రాణకు చంపఁగ నను, నను
మానుషసుమనోజ్ఞవాణి మానుగ వించుక. ౩౬౦

క. నీ వెవ్వఁడవు డుండుభతను
వేవిధమునఁ గలిగెఁ బలుకుమీ నాఁవుడు వాఁ
డావిధ మంతయు రురునకుఁ
దా విస్తరముగను దెల్పెఁ దత్క్షణ మిటులన్. ౩౬౧

ఆ. మున్ను నే బ్రాహ్మణుండనై, మూర్ఖవిధిని,
సఖుఁడు ఖగమాభిధుం డగ్నిశాల నుండ,
వాని బెదరింపఁ దృణకృతఫణిని వేయఁ,
గనలి శపియించె, డుండుభతనువుఁ బూన. ౩౬౨

తే. శాపమోచన మర్థింప శాంతుఁ డగుచుఁ
బల్కె సఖుఁ డిట్లు, లెప్పుడు ప్రమతిసుతుఁడు
రురుఁడు నినుఁ గాంచు, నప్పుడు మరలఁ బ్రకృతి
నందెద వటంచు; నా రురుం డవుదు వనఘ! ౩౬౩

ఆ. మఱియు. బల్కెదఁ బరమధర్మంబు వినుము,
విప్రుల కహింస విహితమై వెలయు నెందు,
యజ్ఞవిహితం బహింస, దయారసంబు
నెఱుక గల విప్రుఁ డెల్లెడఁ బఱపవలయు. ౩౬౪

క. పాపమెయిం బాసి చనెం
బాపఁడు రురుఁ డంత నదలెఁ బన్నగహింసన్;
గోపించి పారుఁ డహివధ
దీక్షించెను, నీవు మఱచి తెలియవు రాజా! 315

ఉ. కూడని చావు వచ్చినదికూడను జూడుము తండ్రికిం ద్రిథా
పాడుది పాపకాటు మృతి, పా డగు చా వది స్నానదానముల్
వీడిన, నంతరిక్షమున వేఁచిన చా వది, కూడ దన్నిటం
గీ డొనరించి దుర్గతి లగింపఁగఁ జేసెను దక్షకుం డిటుల్. 316

క. జనకుని సముద్ధరించెదు
మన సున్నెడ, నంబవేరి మఖమిషమున నీ
క్షణమునసె సర్పసత్రం
బొనరింపఁగ దీక్ష వూను మో రాజన్యా! 317

క. ఆమాటలు జనమేజయ
భూమీశుఁడు వినినమాత్ర పొంగఁగఁ గనులన్
ధూమముగ బాష్పధారలు
తా మాటాడంగ రాక తడఁబడుచు ననెన్. 318

క. ఛీ! యేటికి నాజన్మము?
మాయ య్యటు ఘోరసర్పమరణముఁ గొనఁగా,
నే యపచితి చేయనఁ నే,
జే యజ్ఞాగ్నిని ఫణుల దహింపఁ దివురుదున్. 319

తే. తత్క్షణంబున మంత్రు లందఱను బిలిచి
తక్షకుఁడు యజ్ఞపశువు నుత్తంకమౌని
హోతగాఁ, జేయు మఖమున కుచితవస్తు
వులను గూర్ప నియోగించి పలికె నిట్లు. 320

క. పిలిపింపుఁడు సద్ద్విజులను
గొలిపింపుఁడు నేల గంగకూలమునందున్,

నిలిపింపుఁడు శతశాలను,
మలిపింపుఁడు యజ్ఞవేది మహనీయముగాన్. 321

తే. మఱియు లాలించి సర్వసంపన్నముగను
యజ్ఞసంభారములు కూర్చి, యతివిశాల
వేది యమరించి, పిలిపింప వేదవిదుల,
సర్పసత్రము చేయంగ సాగె రాజు. 322

క. ఫణిహవనము సాగెడు నెడ
వణఁకుచుఁ దక్షకుఁడు వోయి వాసవు సంర
క్షణ మడుగ, నతఁడు కరుణే
క్షణ నభయ మొసంగి నిలిపె స్వాసనమందున్. 323

తే. తక్షకుం డింద్రశరణుఁడై త్యక్తభీతి
నుండు టెఱిఁగి యుత్తంకుఁ డుగ్రోద్యమమునఁ
దక్షకుని సేంద్రుఁగా నిమంత్రణము సేసి
రమ్మనుచుఁ బల్కె బ్రాహ్మనిర్ఘాతవాణి. 324

క. ఆయెడఁ దక్షకుఁ డడలుచు
యాయావరకులజుఁ దలఁప నాస్తీకు మదిన్,
బోయి యతఁడు జనమేజయు
నాయాగము ఋత్త్విజులను నభినుతి చేసెన్. 325

క. పండితుఁ డగు నాయర్భకు
మెండగు తేజస్సు చూచి మెచ్చి, నృపుఁడు, కో
ర్కొండు వరం బేదేనియు
నొం డనక మహాత్మ! దాని నొసఁగెద ననినన్. 326

ఆ. యజ్ఞవిరమణంబ యాతండు కోరిన
నఖిలమునులు నప్పు డదియ వేడ
సత్యబద్ధుఁ డగుచు జనమేజయనృపుండు
సర్పసత్రహోమ శాంతి చేసె. 327

## వ్యాస జనమేజయ సంవాదము

క. జనమేజయుఁ డంతట జయు
మును వైశంపాయనుండు మునిచంద్రుఁడు చె
ప్పిన విని యును శాంతింపని
మనమున నొకనాఁడు వ్యాసమౌని కిటు లనెన్. ౩౭౮

తే. దేవ! యేరీతి నాకు శాంతించు మనసు?
పార్థమనుమండు నాతండ్రి పాఁపచావు
నంతరిక్షంబునం గాంచె నవశుఁ డగుచు
నెట్లు నాతండ్రి గాంచు నిష్కృతి? వచింపు. ౩౭౯

తే. భూభుజుల కుత్తమము రణభూమిఁ దెగుట,
మధ్యమము విధిపూర్వకమరణ మింట,
దుర్మరణ మొంది చనెఁ దండ్రి దుర్గతి మెయి,
స్వర్గముం గూర్పఁ గల శాంత్యుపాయ మేది? ౩౮౦

క. ఆసరణిన్ జనమేజయు
చేసిన ప్రశ్నంబు వించుఁ జెలఁగుముదముతో
నా సభ నాలోకించుచు
వ్యాసుం డిటు లానతిచ్చె వసుధేశునకున్. ౩౮౧

క. వినవయ్యా జనమేజయ!
వినిపింతుఁ బురాణవరము వివిధకథాశో
భన మతిగుహ్యము నద్భుత
మును రమ్యము శివము శుభము పుణ్యము వరమున్. ౩౮౨

క. భాగవతాఖ్యానం బది
యాగమ సర్వార్థ సార మది విన్నంతన్
భోగించుఁ జతుర్వర్గము,
వైరాగ్యము దీని శుకున కిచ్చితి మొదలన్. ౩౮౩

వ. జనమేజయుం డి ట్లనియె. ౩౮౪

ఆ. దేవి! యేమి చేసి తివిరి యాస్తీకుఁ డా
యాగమునకు విఘ్నమాచరించె?
నెవరు వానితండ్రి? యేటికి సమకట్టె
ఫణులఁ గావ? విశదపరపుమయ్య! ౩౮౫

వ. వ్యాసుం డి ట్లనియె. ౩౮౬

సీ. మును జరత్కారుఁ డను ముని శాంతుఁడు విరక్తుఁ
డయి గృహం బొల్లక యరుగ నొకటఁ
గనఁబడె నతనికి వనమున నొక గర్త
మున వ్రేలు తత్పితృగణము పిలిచి
పలికె ని ట్లని! పుత్ర! సలుపు గార్హస్థ్యంబు.
దాన సంతృప్తి నెంతయును బొంది,
నిశ్చింతమై స్వర్గనిలయుల మగుదు మ
టన్న వారల కిట్టు లనియె వాఁడు,

నా కయాచితమై మఱి నాదుపేరు
కలిగి, నా మేరలకె నిల్చు కన్య ప్రాప్త
మయిన సతిగా గ్రహింతు సత్యంబు నమ్ముఁ
డంచుఁ దనయిచ్చ నేగెఁ దీర్థాభికాంక్ష. ౩౮౭

తే. అప్పుడే పన్నగుల నెల్ల నగ్నిఁ బడఁగఁ
గద్రువ శపించెఁ దల్లి; యాకథను వినుము:
కశ్యపునిపత్ను లిద్దరు కద్రువ యన
వినత యన నారు విహరించు వేళ నొకట. ౩౮౮

క. దినమణిరథరథ్యంబును
గను మల్లదె యంచుఁ జూపి కద్రువ యడిగెన్,
వినతా! యాహయవర్ణం
బును దెల్పం గలవెఁ నీవు ముం దన నదియున్— ౩౮౯

తే. అరసి చూడఁ దెలసి దా యశ్వరాజంబు,
నేమి గాఁగ దాని నెంచె దీవు?
పలుకు మీవు నంతఁ బందెంబు సఱితనే
యనుడు వినత కప్పు డనయె సవతి. ౩౯౦

క. ఓ వెఱ్ఱిదాన! చూడవె
యావార్వము కృష్ణవర్ణమై యొప్పెడి, నిం
దీ వోడిన నాదాసివి
కావుట పందెంబు, నేను గావుట నీకున్. ౩౯౧

క. మఱునాఁడు వారివాదం
బిరువురుఁ గని నిశ్చయించు నిచ్చ నరిగె ర
ట్లరిగి పృదాకుప్రసు వది
యురగుల నెల్లరను బిలిచి యొయ్యనఁ బలికెన్. ౩౯౨

క. పందెము గలిగెం జని మీ
రందఱు రవిహయ తనూరుహంబుల మఱుఁగా
పొందిక వ్రేలుఁడు నలు పగు
చందంబునఁ గానిపింప జయ మగు నాకున్. ౩౯౩

క. కొందఱు కా దన వారల
నందఱ శపియించె నగ్నియందుఁ బడంగాఁ,
గొందఱు మాతృకృతాజ్ఞా
చ్ఛందంబున వ్రేలి నలనిచాయగ హయమున్. ౩౯౪

ఆ. కానిపించునట్లుగాఁ జేయ, సవతులు
చూడఁ బోయినంత నోడె వినత;
దాసి యగుచు వినత దైన్యంబునం గొల్చె
సవతి, నట్లు పెద్ద సమయ మరిగె. ౩౯౫

క. గరుడుఁడు సువర్ణపక్షుం
[illegible]

స్ఫురణముఁ దుదిలోఁ డయి వినతకుఁ
గరములు జోడించి పలికెఁ గడు వినతుండై. ౧౯౬

క. తల్లీ! యేటికి నిటు దుర
పిల్లెదు, నేఁ గలుగ దుఃఖభీతి యు దేలా?
తల్లులశోకము దీర్పని
పిల్లలు వా రేల? వంత పేర్కొను, తీర్తున్. ౧౯౭

ఆ. కనుల జాఱు బాష్పకణధార మది పెల్లఁ,
దండ్రి! నేను సవతిదాసి నైతిఁ,
దన్ను మోయు మంచు న న్నానిచ్చి తన్నెడి
దాని మోయలేక దీన నైతి. ౧౯౮

క. గరుడుఁడు తల్లికి మాఱుగఁ
బరివహన మొనర్ప నాజ్ఞ బడసి కుటిలు లౌ
నురగులఁ గద్రువతోడన్
సరిగా మోయుచును జేర్చె సాగరతటమున్. ౧౯౯

తే. దీక్షతో మాతృదాస్యవిమోక్షకాంక్షఁ
గద్రువకు మ్రొక్కి యడిగెను గరుడుఁ డపుడు,
తల్లి! సెల విమ్ము, మాతల్లి దాస్య మెట్లు
వీఁగు? నన నది యమృతంబు వేడెఁ దేర. ౨౦౦

మ. జననీదాస్యవిమోచనార్థము సుధాసంపాదనోద్యోగియై
వినతాపుత్రుఁడు విచ్చి పక్షములు తద్విక్షేపముం జేయఁగా
వినువీథిన్ రవ మొంద నపూర్వముగ నావిర్భావ మందెన్ జయం
బని వాఁడున్, ద్రిదశుల్ నయంబని, భయం బంచున్ భుజంగుల్ వినన్

చ. పటుతరశీఘ్రయానమునఁ బాఱి యతండును మింటఁ దేజ ము
త్కటముగ, రెండవున్ రవి యితం డన నొప్పి, సువర్గమున్ ఖిలం
కటగతిఁ జేరి రక్షకులఁ గాళుల ముక్కున నొంచి, తత్సుధా
ఘటము గ్రహించి, లీలఁ దిరుగం బఱతెంచెను సిద్ధయత్నుఁడై.

తే. తెచ్చి దర్భలపై నుంచి దివ్యఘటము
కద్రువకు నప్పఁ జెప్పి నిష్కర్షఁ జేసి,
వినత దాస్యంబువలన నివృత్త యగుట
జననిఁ గొని వైనతేయుండు చనె యథేచ్ఛ. ౪౦౩

క. అమృతప్రాశన చేసెడి
తమకంబున భోగు లెల్లఁ దానములకుఁ బో,
సుమనఃపతి పదిలంబుగ
నమరావతిఁ జేర్చెఁ గొంచు నమృతఘటంబున్. ౪౦౪

క. స్నానాంతర మటు లటఁ
గానక కుంభంబు పాదుగా నుంచిన ద
ర్భానీకము దమ నాల్కల
చే నాక ద్విజిహ్వు లైరి జిహ్వలు వ్రీలన్. ౪౦౫

తే. మాతృశాప భయార్దిత మానసు లయి
వాసుకిప్రముఖు లగు సర్పప్రభువులు
బ్రహ్మకడ కేగి జననిశాపంబు తెలిపి
శరణు వేఁడిన నతఁడు సకరుణుఁ డగుచు. ౪౦౬

తే. వడి జరత్కారుఁ డనియెడి పరమమునికి
వానికి సనామ వాసుకిభగిని నిండు;
వారి కాస్తీకుఁ డనెడి కుమారుఁ డుదయ
మై మిమున్ రక్షసేయు సత్రాగ్నివలన. ౪౦౭

ఆ. అనుచుఁ జెప్ప వార లపుడ జరత్కారు
మునివనంబు చేరి ప్రణతు లగుచుఁ,
బాణిఁ బట్టి వేఁడ వాసుకి చెలియలి
నియ్యకొనియె నియమ మిట్లొనర్చి. ౪౦౮

ఆ. అప్రియంబు నాకు నాడరా దెప్పుడు
నెప్పు డాడె నప్పుడ యేఁ ద్యజింతు,

ననిన వార లొప్ప నామెను బరిణయు
మై నిజాశ్రమమున కరిగె నతఁడు. ౪౦౯

క. అశనానంతర మొకనాఁ
డు శయించి యతండు నిద్రడోలన చేయన్,
'విశదానన! నను నిద్రా
వశు లేపకు' మంచుఁ గూర్కఁ బ్రారంభించెన్. ౪౧౦

తే. ఆదమఱచుచు సుప్తుఁడై నంతలోనఁ
గర్మసాక్షి యస్తాద్రిఁ గ్రుంకంగ నుండె,
సాంధ్యకృత్యంబులం దీర్చుసమయ మైన
ధర్మమున కోడి యాసతి తలఁచె నిట్లు. ౪౧౧

క. కోపనుఁడు విభుఁడు నిద్రన్
లేపినఁ గోపించి చనును, లేపక యున్నన్
లోపించును సంధ్యాకా
లావృతధర్మంబు; ధర్మహానియె బలమా. ౪౧౨

క. నరులకు ధ్రువమ్ము మరణము,
నరకం బగు ధర్మహీననరులకుఁ; గానన్,
వర మగు నధర్మమునఁ బతి
బొరయించుటకంటె నల్క ముంచుట యంచున్. ౪౧౩

క. లేవయ్య సంధ్య వార్వఁగ
దేవా! యిదె సూర్యుఁ డపరదిక్కున జాఱెన్,
లేవయ్యా సువ్రత! సం
ధ్యావేళ యతిక్రమించు నవసర మయ్యెన్. ౪౧౪

తే. అట్లు లాబాల బోధింప నతఁడు లేచి
కుపితుఁడై నిద్ర చెఱచిన కుమతి నిన్ను
విడుచుచున్నాఁడ నీయున్నకడకుఁ బొమ్ము
టంచుఁ బల్కిన నది వేపితాంగి యగుచు. ౪౧౫

క. పలుకుచు, వాసుకి నను నెం
దలకై నీ కొసఁగె, దానితుద గానక యి
ట్లెట్లు అనుచు టుచితమె ప్రభు! యనఁ
బలుకుచు నతఁ 'డస్తి' యంచు వదలెన్ దానిన్. ౧౮౬

తే. అదియు నంతట వాసుకిసదనమునకుఁ
జని నివేదింప జరిగిన సర్వకథయు
సత్యవాక్కుని యెఱిఁగి విశ్వస్తుఁ డగుచుఁ
జెల్లెలిని వాసుకియు రక్ష సేయుచుండె. ౧౮౭

తే. ఆమెకు జనింప బాలకుఁ, 'డస్తి' యనుచుఁ
జనుటచేఁ దండ్రి, 'యాస్తీకుఁ' డన నెసంగె;
నాతఁడే మాతృపక్షరక్షార్థి యగుచు
నిన్ను వేఁడి నీసత్రంబు నిలుపఁ జంచె. ౧౮౮

తే. ఆ మహాత్ముని యాయావరాత్మజాతుఁ
బూజ జేసి యెంతయు నైతి పుణ్యమతివి,
భారతము వింటి, విచ్చితి బహుధనమ్ము,
లర్చ జేసితి మునుల, నీ కౌను స్వస్తి. ౧౮౯

క. వినను విను జనమేజయ!
యీ నీ వొనరించి నట్టి యిన్ని సుకృతులన్,
గానఁడ మీపిత స్వర్గతి,
మానద మీకులము పుణ్య ముసుమహిమమునన్. ౧౯౦

ఉ. ఓ జనమేజయా! యిపుడ యొక్క మహాయతనంబు శ్రద్ధతో
యోజితమైన భక్తి మెయి నూన్పఁగఁ బంచుము, దేవి కయ్యెడం
బూజ లొనర్పు, భాగవతపుణ్యపురాణము విన్ము, చేయుమా
భ్రాజితలీల శ్రీపదపురస్సర యాగము దక్షిణార్చలన్. ౧౯౧

క. పరదేవ్యంబా శుభముఖ
[illegible] గులము పెరుగు, విద్యాటి తెలుంగున్,

చిర మగు రాజ్యము సిరియును,
కర మనుదగు కోర్కె లెల్లఁ గరగతము లగున్. ౨౨

క. ఏవారలచిత్తంబుల
దేవీరూపంబు నిలిచి దీవ్యత్ప్రదను
శ్రీ విన్యాసము చేయునొ,
వారాలకె ఘనకృతములు నక్షరమహిమల్. ౨౩

క. ఎవ్వరు మాయాశక్తిని
నివ్వటిలన్ హృదయగతుల నిలిపి కొలువరో,
యవ్వారలె కన నయ్యెద
రివ్వసుమతి దుఃఖగతుల నెల్లవిధములన్. ౨౪

శా. సంసారార్ణవతారకం బయి సుధాసారప్రసార స్ఫుర
చ్ఛంసానంత రసాలవాల మయి విస్తార ప్రజా పాప వి
ధ్వంసంబై కడుఁ బావనంబు నయి వేదంబై పురాణావళీ
హంసంబై పొలు పొందు భాగవతమున్ సద్భక్తి నాలింపుమా.

క. నే నెఱుఁగను జ్ఞాతవ్యము,
దీనిని మించెడి పురాణ తిలకము నెందున్.
నే నెఱుఁగ శిరోధార్యము
శ్రీనామక మాతృ పాద రేణువు కంటెన్. ౨౬

క. ఏదీప్తిని బ్రహ్మాదులు
శ్రీదం బని కొల్తు రెదల సేవ్యం బదియే
శ్రీదయితున కెఱిఁగించెనొ
శ్రీ దేవీ భాగవతము చెప్పెద వినుమా. ౨౭

క. ఇది యెవ్వ రనుదినమును విని
యెదరో, వారలకుఁ గల్గు నెల్ల ఫలంబుల్;
ఇది విన్న శాంతి నీ కెద
నొదవును, మీతండ్రి పడయు నుత్తమపదమున్. ౨౮

విద్యున్మాలా— శ్రీదేవీ ధీ చిత్తశ్లోకా!
పాదధ్యాతృ ప్రాప్తశ్రీకా!
వేదాంతోద్య ద్విద్యున్మాలా
ప్రాదుర్భూత భ్రాంత్యున్మూలా! ౪౨౯

గద్యము— ఇది జగద్గురు శ్రీ కల్యాణానందభారతీ స్వామి కరకమల ప్రసాదాసాదిత శ్రీ కవిసమ్రాట్పట్టాభిషేకశ్రీక, హారితసగోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, శ్రీమహాలక్ష్మ్యంబా హనుమచ్ఛాస్త్రి పుత్త్ర, వేంకట లక్ష్మీనరసింహశాస్త్రి విజ్ఞానయోగ దర్పణ ప్రతిబింబిత శ్రీదేవీభాగవతంబునందు ద్వితీయస్కంధము. ౪౩౦

శ్రీః

# శ్రీ దేవీ భాగవతము

## తృతీయ స్కంధము

శ్రీదేవీ పూజా సం
పాదిత విజ్ఞాన సాధ్య వాగ్దేవీ ప్రో
క్తాదిశ్రుతి గోప్య వివర
ణోదిత కల్యాణ సార్థ కోత్తమనామా! ౧

వ. అవధరింపుము, జనమేజయమహీజాని, కృష్ణద్వైపాయనమునిం గసి
యి ట్లనియె. ౨

### శ్రీ దేవీ స్వరూపాది ప్రశ్నము

క. స్వామీ! యంబామఖ మది
యేమార్గము చేయు, దాని దేరూపంబో,
శ్రీమాత యెట్టి, దెటు లెట
నేమిటి కుదయించె దెల్పు మిది సర్వజ్ఞా! 3

క. తెలుపుము బ్రహ్మాండం బెటు
కలిగెఁ, విధి హరియు హరుఁడు కారణు లనుచుఁ
బలికెదరు సృష్టికి స్థితికి
విలయమునకు నది నిజంబొ, వే ఱొక తెఱఁగో! ౪

క. వారలు స్వతంత్రు లగుదురొ
కారో, వివరింపుమయ్య! కాలవశగులై
వార లడఁగుదురొ, శోకా
పూరితులో, చిత్స్వరూప పూర్ణులొ తలఁపఁ! ౫

క. అధిభూతం బధ్యాత్మం
బధిదైవం బనఁగఁ ద్రివిధ మగు దుఃఖములన్
వ్యథ నొందెదరో, యిఁక ని
ర్వ్యథులును నానంద సచ్చిదాత్మ్యాగా వారల్ ?

క. కలుగును హర్షము శోకం,
బలసత నిద్రయును వారి నలఁచునె, దేహం
బులు సప్తధాతునిర్మిత
ములో, కావో. వారికేవి, బోధింపఁగదే !

ఆ. ఏమి ద్రవ్యములను నేయే గుణంబుల
నెట్టి యింద్రియములఁ బుట్టినారు ?
భోగ మెట్టి, దేది విభూతి, యాయువ దెంతో,
వాసపదము నేది ? పలుకు దేవ !

వ. వ్యాసుం డిట్లనియె.

తే. నీవు చేసిన ప్రశ్నముల్ నిస్తులములు,
లిట్టివే పూర్వ మొకతఱి నేనుఁగూడ
విధి హరాదుల యుత్పత్తి వేఁడి యెఱుఁగ
నారదమునీంద్రు సర్వజ్ఞుఁ జేరఁ బోతి. ౧౦

మ. విమలంబౌ సురవాహినీతటిని నా విప్రోత్తముల్ వేదవి
త్తము నేకాంతమనోజ్ఞసైకతమునన్ దర్శించి పాదప్రణా
మము సాష్టాంగముగా నొనర్చి నిలువం బార్శ్వంబునం బ్రీతి నన్
సముపాసీను నొనర్చి క్షేమ మడుగన్, బ్రశ్నంబు గావించితిన్.

శా. స్వామీ! సంశయ మయ్యెఁ జెప్పఁగదె యీ బ్రహ్మాండ ముత్పన్న మెం
ట్లో? మూలం బెది? యేకకర్తృకమొ, లేదా యెందఱేఁ జేసిరో,
యేమూలంబును గాదొ, నిత్య మగునో, యేమాత్రముం గాదొకో,
యేమార్గంబున గార్యసంభవము నయ్యెన్ హేతుకాన్వయంబుగా?

ఉ. కారణకారణుండు భవకాలవివర్జితుఁ డాశ్రితాళిసం
తారకుఁ డో సురేశుఁడు సదాశివుఁడే యని కొంద ఱంద్రు, వి
స్తారమహత్త్వుఁ డచ్యుతుఁడ సర్వవిభుం డని కొందఱుం, జగ
త్కారణుఁ డాత్మసంభవుఁడు గాఁగఁ జతుర్ముఖుఁ గొంద ఱంద్రుగా.

శా. సాయంప్రాతము వేదవాదులు సదా సర్వాత్ముఁగా నీశుఁగా
ధ్యేయుంగా స్తవనీయుఁగా సవితృబుద్ధిన్ సల్పి కీర్తింతు, ర
న్యే యజ్ఞేశుని యజ్ఞభోక్తను సురాధీశుం ద్రిలోకాధిప
త్యాయత్తున్ మఘవున్ శతక్రతువు నిత్యం బింద్రునిం గొల్తురన్.

ఉ. కొందఱు గొల్తు రా వరుణుఁ, గొందఱు సోమునిఁ, గొంద ఱగ్నినిం,
గొందఱు వాయుదేవు, మఱికొందఱు ధర్ముఁ, గుబేరుఁ గొందఱుం,
గొందరు సర్వకార్యములఁ గూర్చు గణేశుని నేకదంతు న
స్పందు గజాస్యు సంస్మరణభావవశంవదు నెంతు రీశుఁగాన్. ౧౫

సీ. ప్రకృతినిఁ బురుషానువర్తి మహాశక్తి
నాదిమాయ భవాని నఖిలధాత్రి
నాద్యంతరహిత బ్రహ్మైకతా సంపన్న
సృష్టి సంస్థితి లయ హేతుభూత
సర్వదైవతభూత జనని సర్వేశ్వరి
సర్వజంతువ్యాప్త సర్వపూర్ణ
భవతరుసంభూత ఫలరూప విద్యైక
వేదమాత రుజాపనోదనఘన

మోక్షదాత్రి నిర్గుణయై ముముక్షువులకు,
సగుణయై కామదాత్రి సంసారులకును,
గుణజననియై గుణాతీత, గురుజనములు
కొంద ఱా పరాపరరూపఁ గొల్చుచుంద్రు. ౧౬

క. దానినె వైష్ణవి శాంకరి
దానినె వారాహి బ్రాహ్మి దానినె యైంద్రిన్

జానినె వారుణీ లక్ష్మియని
దానినె శ్రీ నారసింహిఁ దలఁతురు మదిలో. ౧౭

ఆ. రూప గుణ లేప రహితంబు వ్యాపకంబు
బ్రహ్మము నిరంజనం బని పలుకుచుండు,
రదియు కొందఱు మునులు, వేదాంతములను
వినఁబడు నదె తేజోమయం బనియుఁ గూడ. ౧౮

క. వేయి శిరంబులఁ గనులను
వేయి కరంబులను జెవుల వేయి పదములన్
వేయి ముఖంబులఁ బూర్ణం
బై యంతటనుండు పురుషుఁ డందు రపరులున్. ౧౯

తే. విష్ణు పదమె యాకాశమై వెలయుఁగాన
నది విరాజంబు విరజంబు నతిపరంబు
శాంత మందురు కొందఱు, కొంతమంది
పరుఁడు పురుషోత్తముం డని పలుకుచుంద్రు. ౨౦

తే. ప్రభు వొకఁడు గాఁడు పలువురు ప్రభువు లంచు
జగ మనీశంబును స్వభావజన్య మంద్రు
పలువిధంబుల నొరులు; కాపిలులు ప్రకృతి
జడము, బ్రహ్మాండ మెల్లఁ దజ్జన్య మంద్రు. ౨౧

క. ఈవిధముగ సందియములు
వేవిధముల మనము వేచు, విస్పష్టంబుం
గావింపవె, ధర్మం బది
యేవిధమో, మఱి యధర్మ మేవిధ మగునో! ౨౨

సీ. సురలు ధర్మాత్ములున్ సత్త్వశుద్ధు లయ్యుఁ
బాపు లగు రాక్షసులబాధ పడఁగ నేల?
పాండవులు ధార్మికులు సత్యపథులు నయ్యు
బహువిధంబుల దుఃఖముల్ పడి రదేల? ౨౩

ఉ. ఓ సకలార్థవేత్త, విమలోన్నతచిత్త! మదీయచిత్త మా
యాసము నొందె డోలనరియార్భటి నస్థిర మయ్యె ధర్మసం
త్రాసము వీఁగ సంసరణదారుణవార్ధి మునింగి తేలు నన్
జేసినకూర్మి నీవు దరిఁ జేర్పవె పోతుమనై యజాత్మజా! ౬౮

### శ్రీ దే వీ భా గ వ తా వ త ర ణ ము

క. ఈవిధమున నారదు న
న్నే విపు డడిగిన విధంబ యే నడిగితి నా
దేవర్షి ప్రీతిఁ గరుణా
పావన దృక్కులను జూచి పల్కెను నాతోఁ. ౬౯

తే. వత్స! యీసంశయమ్మ్లే బాధ పెట్టి
ము న్నొకానొక శుభవేళ నన్నుఁ గూడ,
నంత మాతండ్రికడ కేఁగి యామహాత్ము
బ్రహ్మ నడిగితి నీమహాప్రశ్నములనె. ౭౦

క. పలుకవె యీబ్రహ్మాండము
కలిగిన దెటు, తండ్రి! దానికర్తవు నీవో,
యల హరియొ, హరుఁడో, పూజ్యుఁడు,
పలుకుము, యుత్కృష్టతముఁడు ప్రభుఁ డెవ్వాఁడో? ౭౧

క. అన్యోన్యోపమమై దుఃఖ
స్వన మగు సంసారమందు భ్రాంతం బగుచున్
క్షణమును నొకచో నిలువని
మనమునఁ గల సందియమ్ము మాన్పవె దేవా! ౭౨

తే. ఎన్ని తీర్థములందుఁ గ్రుంకిడిన, నెన్ని
సాధనమ్ముల దైవతశతముఁ గొలువ,
నెఱుఁగకయె యున్నఁ బరతత్త్వ, మెట్లు కలుగు
స్థైర్యమును జిత్తశాంతియు జనుల కెందు? ౭౩

మ. ఎవ్వాని సంస్మరించుచు యజియించెద నెవ్వాని దేవదేవుఁగా
నెవ్వాని నొందఁ గోరి భజియించి నుతించి సమర్చ చేతు, సిం
హవ్వఁ డధీశ్వరేశుఁడో, వచింపు మెఱుంగ వలంతు, స్వామి! నే
నవ్విభు సంశయావళుల నీఁగి సుఖింతు? నుపాయ మే మగున్? 30

క. వ్యాసా! లోకపితామహు
నీసందేహములు దీర్ప నే వేఁడిన సం
తోసమున సురజ్యేష్ఠుం
డీ సంక్షేపోజ్జ్వలోక్తు లిట్లని పలికెన్. 31

క. ఏ మందు నిపుడు పుత్రక!
నీ మొనసిన సందియములు నిక్కము తీర్పన్
నేమయ్యా, నేనె కా దల
దామోదరుఁ డైనఁ గామదమనుం డయినన్. 32

క. కాసంత మెఱుఁగఁ జాలర
యీసంసారమున రాగు లెంత తెలిసినన్
దా సర్వ మెఱుఁగు రాగ ని
రాసుఁడు నిర్మత్సరుండు ప్రగతేహుండున్. 33

ఉ. స్థావరజంగమం బయిన సర్వము నష్టము నొంది పూర్వ మే
కావధికార్ణవం బయిన యత్తఱి, నుద్భవ మొంది పంచభూ
తావళి మాత్రనే యెసఁగ, నప్పుడు నే నుదయంబు నొందితిన్,
గేవల మొక్క పద్మకమనీయ హిరణ్మయ గర్భమందునన్. 34

ఉ. కన్నులు రెండు విచ్చి యెటు గాంచిన సూర్యుఁడు గానరాఁడు, సో
మన్నయుఁ గానరాఁ డోకక్షమాధర మేసియు వృక్ష మేసియుం
గన్నులఁ గానరా, వపుడు కంజముకర్ణిక సుస్థిరాసనా
భ్యున్నతి నుండి శాంతముగఁ బూనితి సత్యవిచార మీఁగతిన్.

ఉ. ఈ మహనీయనీరనిధి నెందుల నే నిటు పుట్టినాఁడ? న
న్నోమినభర్త యెవ్వఁ డగునో సృజియించిన కర్త యెవ్వఁడో

కొన్నా, మఱియుఁ జగంబు లయ మొందెడువేళ హరించు హర్త వాఁ
డేమిటివాఁడొ, నేఁ దెలియ నెట్లు? తలంపఁగఁ జోద్య మయ్యెడిన్.

ఉ. నీరము కాశ్రయించెదని, నీ కిది మొట్లులు నిల్చి భూమియా
ధారము లేక, కన్పడద థాయణి యెందును, నన్ను నిట్లు సం
ధారణచేయు పంకజము తథ్యముగా జనియించుఁ బంకమం,
దారసి పట్టె, మూల మట నైన ధరిత్రి కనంగ రాదొకో! 32

సా. అని చింతించి నిజాధివాస మగు పద్మాస్థానముల్ డిగ్గి చ
య్యన నీరంబులలో గమించి వసుమత్యన్వేషణాయత్తబు
ద్ధిని వే యేండ్లు పరిభ్రమించియు నొకే దీక్షం దదాలోచనం
బును గావించియు నేరనైతిఁ గనఁ దన్మూలంబు నేమాత్రముల్.

క. తరియెడఁ 'దపమ్ము నొనరుపు
మూ' యను నశరీరవాణి యాకసమునఁ గ
ర్ణాయితమైనం జేసితి
వే యేండ్లా యబ్జపీఠి విడువక తపముల్. 35

క. అంతట సృజింపు మనియెడి
వింతగు శ్రుతి పుట్టి చెవుల వినవైనను నే
నెంతయు విమూఢమతినై
చింతించితి, నెవరి సృష్టి సేయుదు నంచున్. 40

క. ఏమియుఁ జేయం దోఁపక
నామన మురియాడుచుండ నాపయికి బలో
ద్దాములు దారుణరాక్షసు
లా మధుకైటభులు దుమికి యార్చిరి పెలుచన్. 41

క. తమకోప నన్నబ్జిని యు
న్నము సేయఁగఁ దజిమి తటిమి తద్ద యడుగ సం
భ్రమమున నాళం బాలం
బముగా నడినీట డిగ్గఁ బాఱితి నేనున్. 42

ఉ. అచ్చటఁ గాననయ్యెఁ బరమాద్భుతవిగ్రహుఁ డొక్క పూరుషుం
డచ్చపు నీలమేఘమటు శ్యామశరీరమువాఁడు, నెమ్మెయిం
బచ్చని పట్టుదువ్వలువవాఁడు, మెడన్ వనమాలవాఁడు, కన్
విచ్చక శేషశయ్య శయనించిన నాల్గుబుజాలవాఁడు నై. ౪౩

మ. ఒకచే శంఖము నీరవంబు యున, నింకొక్కంటఁ జక్రంబు నా
డక నిష్పందము గాఁగ, నొండొకటఁ బ్రేలన్ బ్రీలి కౌమోదకం,
బొకచేఁ బద్మము మోడ్పఁ, ద న్నెఱుఁగకే యుండెన్ జగన్నాథనా
యకుఁ డా కేశవుఁ డచ్యుతుండు హరి నిద్రాయత్తచిత్తంబుతో.

ఉ. శేషునిభోగశయ్య వివశీకృతుఁడై యటు యోగనిద్రకు
న్వేషము స్పందముం దెలియ నేరమిఁ గన్గొని నే నుపాయ మ
న్వేష కొనర్చి దేవి హరినిద్రనె బుద్ధి స్మరించి పొందు సం
తోషము రాత్రిసూక్తతతితో భజియించితి దాని నెంతయున్. ౪౫

ఉ. అంతఁ బ్రసన్నచిత్తయయి యచ్యుతుఁ గ్రమ్మిన యోగనిద్ర ని
ద్రాంతత నొంది విష్ణుతనుసంగతి దివ్యవిభూషణావళీ
కాంతులు దిగ్దిగంతములఁ గ్రమ్మ నచింత్య మతర్క్య మద్భుతా
త్యంతమనోజ్ఞరూపమును దాలిచి నిల్చె నభోంగణంబునన్. ౪౬

క. అది విడువ మహావిష్ణువు
కదలి తెలిసి చూచి మధువుఁ గైటభదైత్యుం
గదనము చేసెను వారల
వదలక హరి యైదువేల వత్సరము లొగిన్. ౪౮

ఆ. వారివంక దేవి పరగింప దృక్కులు
రాగముగ్ధులైన రాక్షసులను
నురుతరం బొనర్చి యుత్సంగ దేశంబు
హరి వధించె వారి నందు నునిచి. ౫౦

తే. అంతలో రుద్రుఁ డచ్చటి కరుగుదెంచె;
ముమ్మూరము మేము కని స్వస్థబుద్ధుల మయి

దేవదివ్యమనోజ్ఞ దేదీప్యమాన
రూపము నుతించితిమి, భక్తి రూపు లొంద. ౭౯

క. పరశక్తి కృపాదృక్కులు
పరగించుచు మువ్వురం గని భావనతనులన్
బొరయించుచుం గృతార్థత
బెరయుంగా నిట్లు పలికెఁ బ్రియవచనమ్ములన్. ౮౦

౼. విధి హరి రుద్రులార! రిపుభీకులు నీల్గిరి మీర లింక ని
ర్వ్యాధు లయి సృష్టి పాలనము నత్యయముం బొనరింపుఁడీ యథా
విధిఁ దగు మందిరములను బేర్చి వసించి సుఖంబుగాఁ జతు
ర్విధ మగు జంతుజాలముల సృష్టి యొనర్పుఁడు మీవిభూతులన్.

క. విదితస్వరమై పేశల
గదితంబై, చెవుల వినఁగఁ గడు మధురంబై
యెదలకు సుఖదము జననీ
మృదువాక్సుధ చెవులఁ గ్రోలి మే మంటి మిటుల్. ౮౨

క. అమ్మా! యందు కశక్తుల
మమ్మా! మహి లేదు, వితత మంతట జల, మె
ట్లమ్మా! సృష్టి? గుణము లే
వమ్మా! తన్మాత్ర లింద్రియమ్ములు నేవే? ౮౩

ఉ. ఆపలు కాలకించి శివ యల్లన నవ్విన దానికాంతు లే
రూపము నొంది కన్పడిన రూపయి యంబరవీధి రత్నసం
చాపిత మచ్ఛమౌక్తికపుదామము లొప్పు సువర్ణకింకిణీ
దీపిత ఘల్లులారవము దివ్యవిమానము గానిపించె నే. ౮౪

బ్రహ్మాదులు భువనేశ్వరిని సందర్శించుట

ఉ. దానిని జూపి యెక్కుఁ డని తల్లి వచింపఁగ మేము తత్పరా
ధీనత నోంకృతిన్ సలిపి ధీవిజితేంద్రియవృత్తు లొంది యా

సీనుల నైతి మా శుభము శ్రేష్ఠము రమ్యము దేవసద్మస
మ్యగ్రమము నై యెసంగెడి విమానవరంబున శంక దక్కుచున్. ౫౬

మ. సుఖసంవిష్టుల మైన మమ్ముఁ గని యా శుభ్రాంగి యంతన్ మహ
న్ముఖరంహంబున నాత్మశక్తి గగనాశన్ దివ్యమానంబు ను
న్ముఖముగా నడిపింప నొక్కత్రుటిలో మున్నున్న మున్నీటిని
రక్షలంబున్ దృగ్గోచరం బయిన మా కాశ్చర్య మాశ్యాం బగున్. ౫౭

చ. మఱునిముసంబె చూడ బహుమానముగా ఫలభారనమ్రమవి
స్తరతరుశాఖలన్ సిలిచి శ్రావ్యకుహూ రుతుల లాలపింపఁగాఁ
బరభృతముల్ మనోజ్ఞవనవారములో గిరిరాజిలో మనో
హరమహి కన్పడెం బశువు లంగనలుం బురుషుల్ చెలంగఁగాన్.

చ. మఱియును గానవచ్చె బహుమార్గ వినోద వినిస్సరత్సరి
ద్వరముల విభ్రమ చ్ఛటుల తాండవకేళి పరంబులైన ని
ర్ఝరములు ఫుల్ల పద్మ వనరాజి విలాసి మరాళముల్ సరో
వరములు కూపముల్ విపులవాపికలున్ బలు పల్వలంబులున్.

సీ. మఱియుం గానఁగ నయ్యెఁ గట్టెదుట రమ్యంబైన ప్రాకారసం
వరణంబై వరహర్మ్యరాజి యయి దివ్యద్యుక్షశాలామనో
హరమై వస్తుసుసంభృతంబు నయి కల్యాణైకపాత్రంబునై
పుర మొక్కం, డది పూర్వదృష్ట మనుచున్ బుద్ధిం బ్రమోదంబుతోన్.

క. మెఱు పాకస్మికముగ నం
బరమున మెఱుపారు నట్లు మా బుద్ధులలోఁ
బుర మిది స్వర్గం బనియెడి
సరి నొక్కటఁ బ్రత్యభిజ్ఞ జాతం బయ్యెన్. ౬౧

క. ఇది యెవ్వరు సృష్టించిన
యది యని విస్మయము నందునంతటిలో మా
కెదురుగను మృగయాపరుఁడై
కదలెడి దేవనిభ రాజు కానంబడియెన్. ౬౨

తే. అప్పుడు మూడనయ్యో నంబిక యువ్విమా
నాగ్రమున నిషణ్ణ యగుచు ధృతిని,
వడి విమాన మంతఁ బవనేరితం బయి
కదలెఁ దక్షిణంబ గగనవీథి. ౬౨

ఉ. ఒక్కముహూర్తమాత్రమున నొండొకచోటికిఁ జేరఁ బోవ మా
కక్కడఁ గాననయ్యెను వనాంతము నందననామకంబు, సం
బొక్కడఁ బారిజాతతరు పూదిన నీడను విశ్రమించి పెం
పెక్కిన కామధేనువు చరింపఁ జతూరద మహా గజేంద్రముల్. ౬౩

క. మందారవాటిఁ గిన్నర
బృందము గంధర్వయక్ష విద్యాధరు లా
నందంబునఁ బాడుచుఁ గను
విందుగ నాడుచు రమించి వెలసిరి మూడన్. ౬౪

క. మేనక మొదలగు నచ్చర
చానలు భావాదు లెఱిఁగి జాణతనముతో
గానము చేయుచుఁ దాళ
స్థానీయక్రీడ నృత్యతత లైరి రతిన్. ౬౫

క. ఆలోకింపఁగ నైరటఁ
బాలోమీసహితుఁడైన పాకారియు ది
క్పాలకులు సూర్యచంద్రులు
నాలోలత్సురగణంబు లాశ్చర్యముగాన్. ౬౬

క. మే మట్లు చూచుచుండఁగ
నా మహితపురంబునుండి యాందోళిక పైఁ
గామగతిన్ మఘవానుని
శ్రీ మెఱసెడి రాజు వెడలెఁ జెలు వొప్పారన్. ౬౭

ఆ. చూచి చోద్య మందుచో మా విమానంబు
నంతలోనఁ గదలె నతిరయమున

సకలదేవసంఘ మగు బ్రహ్మలోకంబు
పొందె బ్రహ్మఁ గంటి మందు నొకని. ౧౮

మ. నిజరూపంబులు దాల్చి వేదములు సందీపించి సాంగంబుగా
నజునిం గొల్వఁగఁ జూడనయ్యె సభలో నబ్ధుల్ సరిత్సాగర
వ్రజముం బర్వతపన్నగోరగములున్ స్వస్వప్రభావంబులన్
భజియింపం గని విస్మయంపడిరి శ్రీనాథుండు శ్రీకంఠుఁడున్. ౧౯

ఉ. నాలుగు మోము లొప్పిన సనాతనుఁ డీతఁడు బ్రహ్మ యెవ్వఁడో
తేలుచు మంచు వా రడుగఁ దేరె కనుంగొని నేను పల్కితిం,
జాల నెఱుంగ సృష్టిపతి సత్ప్రభుఁ డీతఁ డెవండొ, నన్ను నుం
బోలుప నేర, విభ్రమము పూనుటకుం గత మే మగుం బ్రభూ!

క. క్షణమాత్రమున మనోజవ
మున నటఁ గదలెను విమానమును కైలాస
మ్మును గనఁ దదుత్తరక్షణ
మునఁ జేరెను యక్షగణసముదయోజ్జ్వలమున్. ౨౦

వసంతతిలక — అందున్న కోకిలలు పంచమ మాలపింపన్,
స్యందింప గానసుధఁ గిన్నెర లార్ద్రిపక్తిన్,
మందారవాటికల నాఁగ విమానరాజం,
బందుండి యప్పుడ వినిర్గతుఁడై భవుండున్. ౨౧

మ. భగవానుండు వృషాధిరూఢుఁ డగుచున్ బంచాస్యముల్ తేజరి
ల్లఁగఁ బాంక్తేయభుజంబుగాఁ ద్రిణయనోల్లాసంబుతో, నంశుకం
బుగ వైయాఘ్రము కౌంజరంబు నజినంబున్ వెల్గఁ బ్రావారమై,
సిగలోఁ బువ్వుగ నర్ధచంద్రుఁడు ప్రకాశింపంగఁ గానంబడెన్. ౨౩

ఉ. ఆతనిపుత్రు లిద్దఱు గజాస్యషడాస్యులు పార్శ్వరక్షు ల
త్యాతతతేజులై కొలువ నంకము చేరఁగ మాతృకల్ గణ
వ్రాతము నందిముఖ్యులు శివప్రభుపృష్ఠగులై లయస్వనో
ద్ఘాతలుగాఁ జరింపఁ గని కన్నుల, సంశయ మయ్యె, నారదా! ౨౪

క. ఏమా యని యబ్బురపడు
నామాత్రనె వాతవేగమై కైలాసా
గ్రామలభువి దాఁటుచు నా
పై మా యానంబు చేరె వైకుంఠంబున్. ౭౫

ఉ. పుత్రక! యందుఁ జూచిన విభూతు లమేయము లయ్య, చెప్ప నా
మాత్రములే! రమారమణమందిరముం గని శ్యామలోజ్జ్వల
ద్గాత్రుఁడు విస్మయంపడెఁ దత్క్షణమే సరసీరుహోల్లస
న్నేత్రుఁ డొకండు తత్సదనస్థితుఁడై కనిపించెఁ జిత్రమై. ౭౬

ఉ. శ్రీహరి పీతవాసుఁ డతసీకుసుమాభశరీరుఁడుం జతు
ర్బాహుఁడు పక్షివాహనముపై సిరి చెంగట పీఁట జామర
గ్రాహిణియై కనంబడినఁ గన్నుల నమ్మఁగ లేక కేశవుం
డా హరుఁ డేను నొండొరులయాననముల్ తిలకించుచుండఁగా. ౭౭

క. ముగ్ధులమై పలుకక సం
దిగ్ధమనస్కు లగు మమ్ముఁ దీవ్రరయమునన్
స్నిగ్ధప్రభము విమానము
దుగ్ధాబ్ధికిఁ జేర్చెఁ బవనధూతం బగుచున్. ౭౮

క. కంటిమి పాలసముద్రము
మింటికిఁ బొంగఁగ మహోర్మిమిషదాశంబై
జుంటెనురువు మిలమిలలకు
నంటెడి యాదోవిసర సమాకీర్ణంబున్. ౭౯

ఉ. అంతటిలో సుగంధ మొకఁ డద్భుతమై పరతెంచి నాసికా
సంతతులందుఁ జొచ్చె హరిచందన కల్పక పారిజాత భా
స్వంతము కేతకీ వకుళ చంపక వారిజ జాతి కుంద వా
సంతిక మల్లికా సురభి సంగతమై పవనావధూతమై. ౮౦

ఉ. అంతటిలో వినంగనయి స్వాగతశబ్ద ముఖానునాద ప
ర్యంతముగాఁ గుహూధ్వనిసమంచిత పంచమరాగపూరితా

శాంతము కోకిలస్వరము హార్దము శీతల మార్ద్రి మెంతయున్
శాంతము కర్ణయుగ్మకరసాయనమై కరగించె మాయెదల్. ౮౧

ఉ. అంతటిలోనఁ జూడ్కిఁ గననైన మిఱుమి ట్లొసఁగించె మాకు ద్వీ
పాంత మొకండు స్వీయ మణిభాస్వర కాంతి ధగద్ధగాయిత
ప్రాంత మనేకరత్న నికర ప్రతిభాంత మచింత్యవైభవా
క్రాంతము దివ్యహార్త్తిక వికల్పిత దామ విభూషితాంతమై. ౮౨

క. నానా స్తరణోత్తరమై
నానాచిత్రాభిచిత్రణ మనోజ్ఞంబై
నానాపుష్పద్రుమమై
నానామంజులరవంబు నగరము మెఱసెన్. ౮౩

తే. ఆమణిద్వీపమందు శివాకృతిన్ వె
లుంగు పర్యంక మొండు కానంగ నయ్యె,
నదియు బహురత్నఖచితం బనంతరత్న
రాజితంబు రమ్యాకృతిభ్రాజితంబు. ౮౪

తే. అదియు నానాస్తరణ విస్తరాంతరము మ
హేంద్రచాపాభిరామ భూయిష్ఠకలము,
దూరమున మావిమానమందున నె యుండి
కంటి మం దుపవిష్టయౌ కలికిమిన్న. ౮౫

ఉ. రక్తసుగంధ లేపనము రాజిలఁ, ధాలిచి రక్తదామముల్,
రక్తదుకూలధారిణిగ రక్త విశాల విలోచనాఢ్యయై,
రక్తరదచ్ఛదంబులను రంజిలి రక్తపదాంబుజాతయై
రక్తరుచిప్రభా పటల రంజిత సర్వదిశావకాశయై. ౮౬

శా. విద్యుత్కోటి తళత్తళప్రభ లోకే పేరాశి యైనట్లుగా
నద్యత్సూర్య సహస్రకాంతు లొకచో నుద్ద్యోత మైనట్లుగాఁ
బ్రద్యోతించుచుఁ గోటిలక్ష్ములరుచిన్ బ్రాలేయరుఙ్మండలీ
పద్యస్రావి సుధాసమాన కరుణా సంపూర్ణ శోభాఢ్యయై. ౮౭

క. మున్నెన్నఁడుఁ గని యెఱుఁగని
సన్నుతరూపము ధరించి సస్మితరుచిసం
పన్నత శ్రీభువనేశ్వరి
సన్నిఁ యభీష్టాభయములు పాశాంకుశముల్. ౮౮

క. కరుణాతరంగితారుణ
తరుణీ నవపూవనాఢ్య తరళోజ్జ్వలహా
పరిపూర్ణమూర్తి మెఱయఁగఁ
గర మమరగు నూర్తిఁ గనవయ్యె సుతా! ౮౯

చ. లలితమృదుస్మితద్యుతుల రాజిలి, చెక్కులఁ బర్వుచున్న క
మ్మల కమనీయకాంతులను మంజులమై, సిగలోని పువ్వుగా
వెలిఁగెడు నర్ధచంద్రునును వెన్నెలజాలులఁ జల్లనై సము
జ్జ్వల మగు శ్రీముఖాంబుజము వర్ణనసేయుట యెట్లు నారదా?

మ. మఱి యాతల్లికుచద్వయంబు వివరింపన్ సాధ్యమే నాకు, వి
స్తారమై రోదసి పూర్ణకుంభములతో సాదృశ్యముం బూని, యా
పరమామ్నాయపవిత్రదుగ్ధములు విశ్వం బెల్ల పూరించుచున్
బరువై నిబ్బరమై సువర్తులము నై వంద్యంబు నయ్యెం గదన్. ౯౧

క. శిరమున రత్నకిరీటము
పురులుం గనకాంగదములు భుజములపై భా
సుర నానామణి సముదయ
పరికీర్ణవిభూషణాళి వరలఁగ నొప్పెన్. ౯౨

క. అచ్చటి లీలాశుకములె
యుచ్చారణ సేయ హ్రీంకృతోచ్చైశ్రుతులన్
నెచ్చెలు లేక హృల్లేఖన్
సచ్చిన్మయ భువనరాజ్ఞి జపము సలుపరా! ౯౩

క. శ్రీమంత్రరాజమటుల
గాయత్రి నాధ్యస్త యగుచు నయ్యెయెడలం

శాయక యనంగకుసుమా
ద్యాయతనాంబికలు గొలువ నగపడెను సుతా! ౯౪

క. చూచుచునే మున్సురమును
నీ చాన యి దెవ్వ రొకో, యేమిటి పేరో,
నేఁజూడఁ దెలియు టంచును
నాచోఁ గదలక విచార మావేశింపన్. ౯౫

క. ఇది యచ్చర యగునా, కా
దిది మఱి గంధర్వి యగుట యెట్లు, లదియుం గా;
దిది యింక నేదే దైవత
ముదిత యగునో, కా దటంచు మునురము దలఁపన్. ౯౬

క. ఆలోచించుచునుండెడి
యాలోనన చూడఁజూడ నద్భుతరుచియై
వే లగు ముఖములఁ గన్నుల
వేల కరంబుల శిరముల వెలసెను బుత్రా! ౯౭

తే. చారుహాసిని యామహాసాధ్వివంక
నల్ల భగవానుఁ డా విష్ణు వట్టె కాంచి
యాత్మవిజ్ఞానమున నామె నంబగాఁగఁ
దెలిసి మది నిశ్చయించి తాఁ బలికె నిట్లు. ౯౮

క. ఇది భగవతి, మనయందఱ
మొదటి మహాకారణంబు మూలాంబిక, యి
య్యదియె మహావిద్యయు నా
నిదియె మహామాయ యనఁగ నిదె పూర్ణ యగున్. ౯౯

మ. ఇది దుర్జ్ఞేయము స్వల్పబుద్ధులకుఁ గానీ యోగిగమ్యం బిదా
ను, దురారాధ్యము హీనభాగ్యులకు నెందుంగాని, పుణ్యాత్ము లి
య్యది యిచ్ఛాపరశక్తిగా మఱియు నిత్యానిత్యసంరూపగా
నిదె విశ్వేశ్వరి వేదగర్భ శివ సర్వేశేశిగాఁ గొల్తురా! ౧౦౦

క. కుడి యడుఁగుఁ గాలం బొనెడ
నిడె విశ్వాలయం బొనర్చి యెడఁ గ్రీడించున్,
పొదలఁగఁ దన దేహంబునఁ
బదిలంబుగ సర్వజీవభాగ్యాంగములున్. ౧౦౧

తే. సర్వబీజమయాత్మయై సాంప్రతంబ
వెలుఁగుచున్నది యిది, దీని బలసి కొలుచు
నల్లదే విభూతుల కోటు లర్బుదములు
దివ్యభూషాను లేపనో ద్దీప్తములుగ. ౧౦౨

తే. ఓ విధి కపర్దులార! ధన్యులము మనము
భగవతీదర్శనమ్ము సంప్రాప్త మయ్యె,
స్వయముగాఁ గృతకృత్యుల మయితి మెంత
తప మొనర్చిన పుణ్యానేతలమొ మనము! ౧౦౩

ఉ. ఎంతటి భాగ్య మున్న భువనేశ్వరి దేవి శివం గనంగఁ బ్రా
పింతుము, దీనిఁ జూచుట లభింపదు రాగిజనాళి కెన్నఁడే,
నంతటి కాదియా ప్రకృతియై యదియే పురుషప్రసక్తయై
యంతయు సృష్టి సేసి పరమాత్మకుఁ జూపును విశ్వదృశ్యమున్.

క. దీనికిఁ బోలిచికొనఁగా
నే నెక్కడ, నెచట మీర, లెల్ల దివిజులున్!
దీనికి లక్షాంశతులం
గానం జాలరు రమాదికత్రిదశసతుల్. ౧౦౪

చ. తొలి నొక మఱ్ఱియాకుచిఱుదొన్నె నమర్చిన వింతతొట్టిలో
బుడుతఁడనై పదాంబుజపు బొట్టనవ్రేలిని జేతఁ బట్టి పె
న్నలవున నోటఁ బెట్టుకొని యాడుచుఁ గేరుచు నెన్నియేని యూ
టలఁ బడి పాలు గాఱు నునుడాలగు మేన నెసంగుతత్తఱిన్. ౧౦౫

శా. నన్నీతల్లియె యా సుధార్ణవతరంగశ్రేణియుయ్యాలలోఁ
బన్నుండన్ మృదుపాణి సిట్టటుల నూఁపం బ్రేమతో వేడుకల్

గన్నాఁడన్, మధురార్ద్ర కంఠమున జోలం బాడి లాలింపఁగా
విన్నాఁడన్, మదిఁ బ్రత్యభిజ్ఞ వెలసెన్ విద్యోతమానంబుగా. ౧౦౮

క. మనుజజనని యిదియె, దీనికిఁ
బనుపున నన్నలుల భక్తిఁ బొనరింతము, డా
యను జని నిశ్చయముగఁ బద
మును గొని నుతియింత, మిచ్చు భూరివరంబుల్. ౧౦౯

క. ద్వారంబునఁ గల యీపరి
చారకు లొకవేళ మనలఁ జననీకుండన్
వారించిన నటనుండియె
పూరింతము దేవినుతులు పూనినభక్తిన్. ౧౧౦

తే. ఇట్లు హరి పల్క, మేము ప్రహృష్టుల మయి
యోంకృతి యొనర్చి, యోగ నుద్యుక్తుల మయి,
యావిమానంబు డిగి, ద్వారమందుఁ జేరి,
మువ్వురము నిల్చితిమి కొంత పొసఁగఁ గొంత. ౧౧౧

క. ద్వారగతం బగు తన పరి
వారముఁ గని దేవి యల్ల పరప స్మితంబున్,
వా రెల్ల రొక్క త్రుటిలో
స్త్రీరూపంబులు ధరించి చెలఁగి రవేళన్. ౧౧౨

క. నేనును హరియును శివుఁడుం
జానలమై భూషణాఢ్య చారు తనులమై
కానంబడినన్ విస్మయ
మూనఁగఁ జేరితిమి దేవియొద్దకు భక్తిన్. ౧౧౩

క. అవలోకించుచు నొండొరు
యువతీరూపములు మేము నూర్జితమతితో
నవనతుల మైన, మ మ్మది
యవలోకించెను గృపార్ద్ర మగు చూపులతో. ౧౧౪

క. నానామణిగణఖచితము
భానుసహస్రప్రకాశ భాసుర మవ్వే
పీ నిర్మలపదపీఠము
ధ్యానించుచుఁ గాంచు మువుర మందున్ నిలువన్. ౧౧౪

ఉ. అందుఁ జరింపఁ గంటిమి పరాంబికకుం బరిచర్య సేయుచుం
గొందఱు రక్తవస్త్రములు కొందఱు పచ్చని పట్టువస్త్రముల్
కొందఱు నీలవస్త్రములు కొంద ఱనేక విచిత్ర వస్త్రముల్
సుందరరీతిఁ దాల్చి బహుశోభనరూపము లొంది కొల్వఁగా. ౧౧౫

ఉ. వారలు దివ్యభూషణ విభా విభవంబున నొప్పి నాట్యసం
చార మొనర్చుచుం బరవశంబునఁ బాడుచు వీణ లొత్తుచున్
మారుతవాద్యసంతతు లమందతఁ బూరణ సేయుచున్ శుభా
కారతఁ దల్లిఁ గొల్వఁ గనఁ గన్నులపండువ యయ్యె, నారదా!

క. మఱియుం జెప్పెద వినుమా
పరమాద్భుత మంబపాదపద్మముమధ్యన్
స్ఫురిత నఖర ముకురంబునఁ
బరికించిన చిత్ర దృశ్య పరిణాహంబున్. ౧౧౭

ఉ. స్థావరజంగమం బయిన సర్వముతోడ నజాండ మెల్ల నా
తావునఁ జూడ నయ్యె, నను స్థాణుని విష్ణువుఁ గంటి మం దిఁకన్
దేవపతిన్ యమున్ వరుణు దీప్తకుబేర సమీర పావకా
శావిభు లెల్ల సూర్యుఁడు నిశాపతియుం గనవచ్చి రందులో. ౧౧౮

క. గిరి కాననములు నదు ల
బ్ధిరాజి గంధర్వ యక్ష విద్యాధర కి
న్నర పన్నగ రాక్షసు ల
చ్చరలున్ సిద్ధులును మునులు సర్వామరులున్. ౧౧౯

తే. చిత్రకేతు విశ్వావసు శ్వేతముఖ్య
దివ్య గంధర్వవిభు లందు దీప్తులైరి,

సిద్ధ సాధ్యులు వసువు లశ్వినులుఁ దోఁచి
రంద, మఱియుం బితృగణంబు నరయ నయ్యె. ౧౨౦

క. పలికింప మహతి నారదుఁ
డలఘుఁడు తుంబురుఁడు రాగ మాలాపింపన్
గులికెడి హాహాహూహూ
సలలిత నాట్యంబు చూడఁ జాలితి మచ్చో. ౧౨౧

శా. వైకుంఠంబును బ్రహ్మలోకమును దివ్యంబైన కైలాసమున్
వీక్షం గానఁగనయ్యెఁ దత్పదనఖావిష్టంబులై, నేను నం
దే కానంబడితిన్ జతుర్ముఖములన్ నీరేజమందున్ మఱిన్
లోకేశుం డల శేషశాయియు మధుండుం గైటభుండుం దగన్.

క. ఈవిధ మద్భుతముం గని
యే విస్మయ మంది వారి నీక్షింపంగా
నావలనే హరిహరులును
నావేశితవిభ్రమముల నగపడిరి సుతా! ౧౨౩

క. మే మెల్లరముం దానిని
మాయాతగ మఱియు విశ్వమాతగఁ గని చే
తోమోదమున శతాబ్దం
బా మేర తదేక దృష్టి నం దుంటిమయా! ౧౨౪

మ. అమృతాంభోనిధియంతరీపమున మధ్యంబందునం దత్సఖీ
సముదాయంబును గూడి మేమును నిజేచ్ఛన్ వేడ్కఁ లొప్పన్ విహా
రము గావించుచు దేవిఁ గొల్చుచును దద్రమ్యాకృతిన్ బ్రహ
ర్షముతోఁ బొంగుచు నంతకాలము ముహూర్తంబట్లు వెళ్ళింపఁగా.

## విష్ణు కృత భువనేశ్వరీ స్తుతి

క. ఒకనాఁడు మహావిష్ణువు
వికసించినతరుణిరూపు వెలయఁగఁ దా నా

ద్దికఁజో నా భువనేశ్వరి
నికటమున నుతించె నిట్లు నిస్తులభక్తిన్. ౧౨౬

క. మ్రొక్కెద దేవికిఁ బ్రకృతికి
మ్రొక్కెద విధాత్రి కిదియె మ్రొక్కెద సిద్ధిన్
మ్రొక్కెద సంసారారణి
మ్రొక్కెదఁ గల్యాణి వరద మ్రొక్కెద వృద్ధిన్. ౧౨౭

తే. సచ్చిదానందమయి, నమస్కారమమ్మ!
పంచకృత్యపరాయణా, వందనమ్ము!
నిఖిలసంసారమూలారణీ, నమస్సు!
జనని, భువనేశ్వరీ, యిదే వినతి గొనుము! ౧౨౮

తే. ఏయధిష్ఠానమున సృష్టి యెల్లఁ బొదలు,
నాయధిష్ఠాన కూటస్థమై వెలింగి,
యర్థమాత్రార్థ భూతవౌ నంబ! నీకు
మ్రొక్కు లిడెద హృల్లేఖకు మ్రొక్కు లివియె. ౧౨౯

చ. ఎఱుఁగుదు నంబ! మున్న యిది యెల్లయు నీయెడ సన్నివిష్టమై
మెఱయు నటంచు విన్న శ్రుతిమిన్కులఁ, గంటిఁ దేటతెల్లమై
యెఱుఁగఁగ వచ్చె సంభవలయేశ్వరి వీ వని సర్వలోకవి
స్తరమహనీయ వీవ యని సర్వసమర్థ వటంచు, నేఁ డిదే. ౧౩౦

ఉ. ఈ సదసద్వికార మగు నెల్ల జగత్తును విస్తరించి ఖే
లాసదృశంబుగా నవికలంబుగ నిర్వదిమూఁడు తత్త్వముల్
భాసిలఁ జూపి పూరుషునిభావము రంజిలఁ జేసి, తల్లి! శ్రీ
వాసమయాన వెల్గెదు విడంబిత లోకమహేంద్రజాలవై. ౧౩౧

మ. జననీ! నామము రూప మీవ యగుటన్ సర్వంబు నీవే వినా
కన భావింప నసాధ్య, మీ వఖిలలోకంబందు వ్యాపించి నిం
డిన సర్వాత్మవు సర్వశక్తివి, నినుం డిందింప నాపూరుషుం
డు నశక్తుండటె, బుద్ధిమంతులకుఁ జెల్లున్ నిన్న సేవింపఁగా. ౧౩౨

ఉ. ఈవిధి విశ్వమెల్ల వెలయించి ప్రభావవశంబుచేత లో
కావళి మోదముం బొరయు టంతయు నీమహిమంబె, తల్లి! క
ల్పావధివేళ సర్వము లయం బొనరించెదు నీవె, యంబ! మా
కేవిధి నీమహత్త్వము నిజేచ్ఛల సత్త్వ మెఱుంగ సాధ్యమా! ౧౩౩

క. అల మధుకైటభదైత్యుల
వలనను రక్షించి మమ్ము బహులోకములన్
దిలకింపఁజేసి భాగ్యము
కలిగించితి నిన్ను నిందుఁ గన్నులఁ గాంచన్. ౧౩౪

ఉ. చూపితి మాకు స్వర్గమును జూపితి బ్రహ్మపదంబు నాపయిం
జూపితి రాజతాచలము చూపితి వంత వికుంఠధామముం,
జూపకయున్న నీరచనఁ జోద్యము లింకను నెన్నియున్నవో
యోప మెఱుంగ నేను విధి యుగ్రుఁడు, నోపుదు రెవ్వ రాపయిన్!

ఉ. నీ నఖదర్పణాన జననీ! కనిపించె మఱొక్క విష్ణుఁ డీ
శానుఁడు పద్మయోనియు మహాత్ములు నింకను నెంద ఱెట్టిచం
దాన మఱెన్నిలోకములఁ దాను వెలింగెద రూహ సేయఁగా
నేనియు నేరఁ దల్లి! యెవ రెన్నఁగలారు భవత్ప్రభావముల్! ౧౩౬

శా. అమ్మా! నీపదపీఠిఁ జాఁగిలి యిదే యాచింతు, నశ్రాంత మే
నిమ్మాడ్కిన్ భవదుజ్జ్వలాకృతి యెద న్వీక్షింపనోఁగాత, నా
ట్యమ్ముం జేయుత నీశుభాహ్వయము జిహ్వాగ్రంబునందున్, నివా
సమ్మున్ నిత్యముఁ జేయుఁగాతఁ గృప శీర్షంబందు నీపాదముల్.

క. సతతము భృత్యుఁడు నీ కగు
నితఁడు, స్వామినివి నీవు నితనికి నెపుడున్;
సుతుఁ డీతఁడు, తల్లివి నీ
వితనికి; మన కిట్టి వ్యాప్తి యొసఁగుత ధ్రువమై. ౧౩౭

క. సర్వం బెఱుఁగుదు నీవే
సర్వజ్ఞవు, పరిసమాప్తిసమవధి వగుటన్

సర్వేశ్వరి! భవదిచ్ఛా
పర్వమకన్నఁ గలఁ జెఱొక్క వర మేఁ గోరన్. ౧౩౯

తే. సృష్టి నొనరించు స్రష్ట, రక్షింతు నేను,
శివుఁడు హరియించు, ననెడి ప్రసిద్ధి కలుగు;
నిది నిజం బౌను, మేము నీయిచ్ఛవలన
శక్తియుక్తులమై క్రియాక్షముల మగుట. ౧౪౦

తే. జగము ధరియించునది ధరాశక్తిగాదు,
సర్వధాత్రి, త్వదాధార శక్తి గాని;
భాస్కరుండు భాసించు నీప్రభన, తల్లి!
విరజనై సర్వమును నీవ వెలుఁగఁ జేయ. ౧౪౧

క. జని గల నను నజ భవులను
ననఁ జెల్లదు నిత్యు లనుచు, నట్టి యెడ సురేం
ద్రుని నితరుల ననఁ జెల్లునె
చను నిత్య యనం బురాణి జనని నిన్నే. ౧౪౨

క. కరుణేక్షణములఁ బరపినఁ
బురాణపురుషునిఁగ నాత్మఁ బొడఁగాంచెద, న
ట్లరయనియెడలఁ దమోహం
కరణంబున విభుఁడ నంచు గర్వింతును నేన్. ౧౪౩

తే. బుద్ధిమంతుల విద్య నాఁ బొల్చె దీవ,
శక్తిమంతులలోఁ దల్లి! శక్తి వీవ,
కాంతి కీర్తియుఁ దుష్టియుఁ గమల వీవ,
ముక్తి జనులకుఁ గూర్చు విరక్తి వీవ! ౧౪౪

క. గాయత్రియు వేదాది క
లాయితవును నర్థమాత్ర వగుదు, స్వధయు స్వా
హా యన, నీవె సురావన
కై యాగము నిగమరాశి నలరింతు వహో! ౧౪౫

ఉ. ఈ యఖిలప్రపంచము రచింతువు మోక్షము గూర్చు పేర్మి, నిం
కీయెడ జీవభావ మది యెట్లు పొసంగును సృష్టియందు? నె
ట్లా యుదధిం దరంగలయ, మట్ల, యనాది యమర్త్య మైన త
చ్ఛ్రేయము నంశమాత్ర మయి చెల్లు సమస్తము, తల్లి! చూడఁగన్.

మ. ఇది సర్వంబు భవత్కృతంబ యని యె ప్డీక్షించు జీవుండు నె
మ్మది, సర్వంబుఁ ద్వదంతరంగమున నే మాయన్ లయంబుం బొర
చ్చెదు; నాట్యాంతమునన్ నటుం డెటులు దా స్వీయాకృతిం దాల్చు, న
ట్ల, దయాబ్ధీ! విరమింతు వీవును గృతార్థత్వంబు చేకూర్చుచున్.

ఉ. మోహమహోర్మియౌ భవసముద్రము నిస్తరణం బొనర్పఁగా
వాహము వీవ గా కొరులనుపాయము లేక సమాశ్రయింతు, స
స్నేహవిలోకనంబు కరుణించి మహాత్రికరాంతకాలమం
దో హృతసర్వలోక! నను నొద్దికఁ గావు నమస్కరించెదన్. ౧౮౮

క. మ్రొక్కెద నీపదయుగళము
దిక్కనిభక్తిం బరేశ్వరి! మహావిద్యా!
యెక్కాలము జ్ఞానకలా
భాక్కునుగాఁ జేయు, సర్వవరదాత్రి! నన్నున్. ౧౮౯

**శివకృత భువనేశ్వరీ స్తుతి**

ఆ. దేవదేవుఁడు హరి గోవిందుఁ డచ్యుతుం
డిట్లు మఱిమఱి నుతియించినంత,
నెదుటఁ జేరి తల్లి కెఱఁగి పదంబుల,
శర్వుఁ డిట్లు పల్కె శంకరుండు. ౧౯౦

చ. జననివి నీవు విష్ణునకు స్రష్ట కిఁకన్ మఱి నాకుఁ గావొకో,
జనని వశేషసృష్టికిని, సంస్థితి కీవ సమర్థ వౌదు, నిం
కను నగు దీవ పృథ్వి యుదకంబు నభం బనలానిలంబులున్
గుణములు నింద్రియంబులును గూడిన బుద్ధి మన స్సహంతయున్.

క. ఎఱుఁగనివారే యందురు
హరి హర విధికృత మటంచు నఖిలజగత్తున్,
పరికల్పించితి వీవు
ర్వర నీవే, తల్లి! నీవు పుట్టించు టెటుల్? ౧౯౨

క. భూతము లెనసి విషయగుణ
జాతముతో, జాత మగును జగ మని పలుకన్,
మాతరొ! నీకళ లే కది
జాతంబై స్ఫుటముగాఁగ సాధ్యం బగునే? ౧౯౩

చ. వివిధవిలాసవేషములఁ వేసి రమించుకుతూహలంబు సం
భవ మగు నెప్డు నీయెడఁద, మాత! చరాచరభూతరాశిగా
నవు దపుడే, త్రిమూర్తికృతభావము నూనెద వప్పుడే; తదు
త్సవము ముచింప దెప్డు, డది సర్వమునున్ విరమింతు వాత్మలో.

ఉ. నీ పదపాంసురేణు కణ నీత మహోదయ మొంది నేను ల
క్ష్మీసతి పద్మసూతియు సృజింతుము విశ్వము తత్క్షణంబుతో,
నో పరమార్థిచిత్త! మము నుద్ధరణం బొనరింపవేని నీ
వే, పడయుంగనో ముగుర కెట్టులు సత్త్వ రజస్తమంబులున్!

క. జనపతి సచివుఁడు భృత్యుఁడు
ధనికుఁడు నిర్ధనుఁ డటంచు ధరణి సమస్తం
బును గడు విషమం బగు నీ
మనమును నటు విషమ మగును, మాంగల్యాఖనీ! ౧౯౬

క. ప్రకటింప నిలుప లోఁగొన
సకలమ్ము గుణత్రయమ్ము చాలుం జుమ్మా,
యిఁక మఱి ద్రుహిణుని హరి ననుఁ
బ్రకటింతు జగత్త్రయమ్ము పరికల్పింపన్. ౧౯౭

ఉ. నన్ను హరిన్ విరించిని సనాతని! నీవు విమానమందు నుం
డ న్నియమించి దారి భువనావళు లెంతయు నద్భుతంబు లే

మెన్నఁ దెలుంగనట్టివి యనేకము చూపితి, చేసినావె నే
మన్నియు; నీగుణత్రయము నందుకుఁ జాలు, భవాని! కాదొకో!

క. నీలీలల నే నెఱుఁగం
జాలము, నీకళను జేసి సర్వజగత్తుల్
పాలించి సంహరింతువు,
ఖేలనగాఁ బురుషుఁ గూడి క్రీడింతువుమా! ౧౫౯

శా. నీపాదాంబుజసేవ యున్న జననీ! నిత్యంబు నిష్ఠే సతీ
రూపంబే వర మంచు దద్విరహదుర్మోహంబె ప్రాపించుచో
నాపాపిష్ఠవుఁ బౌరుషత్వ మది యేలా, యేల త్రైలోక్యపా
లీపూజ్యత్వ పతిత్వముల్ మహిమముల్ కీర్తుల్ మహైశ్వర్యముల్!

క. స్త్రీభావ మూని నీపద
సౌభాగ్యావాప్తి నొంది సంసృతి నీఁగం
గా భవుఁ డోపె నటంచును
నీభువనమునందుఁ గీర్తి యెలయును గాతన్. ౧౬౧

క. నీసాన్నిధ్యము సేవయుఁ
బాసిన సామ్రాజ్య మెవఁడు వాంఛించును, నీ
భాసురపదదూరుల మగు
చో, సత్యము, త్రుటియు యుగముచొప్పనఁ దోఁచున్. ౧౬౨

క. మును లెవ్వరు నీపదసే
వను వర్జించి, యొరు దీక్ష వర్తించెదరో,
జననీ! వారలు విధివం
చన వైభవపరిభవంబు సలిపినవారల్. ౧౬౩

ఆ. తపము కాదు, కాదు దమము సమాధియుఁ,
గ్రతుశతంబులేనిఁ గావు, నీదు
పదపరాగసేవ భవసాగరమునుండి
ముక్తినీ సమర్థము, జగదంబ! ౧౬౪

మ. కృప నాపైఁ గలదేని తల్లి! యొకచో కేల్మోడ్చి ప్రార్థింతు, నా
కుపదేశింపు నవార్ణమంత్ర, మది నాయూహాం బరిభ్రష్టమై
జపసంభావ్యత వెల్గకున్నది, స్మృతిన్ సందీప్తముం జేసి మో
హపువారాశిఁ దరింపఁజేయఁగదవే, యంబా! భవోత్తారిణీ! ౧౬౫

శా. ఆకర్ణిన్ భువనేశ్వరిన్ శివుఁడు తా నర్థింపఁగా, నంబ యు
చ్చారించెన్ స్ఫుటమై నవాక్షరము, నీశానుండు దానిన్ శుభో
చ్చారం బొప్ప గ్రహించి, దేవిచరణాబ్జం బంటుచున్ మ్రొక్కి, దీ
క్షారమ్యంబుగఁ గామమోక్షకరబీజంబుల్ జపించెన్ ధృతిన్. ౧౬౬

తే. శంకరుండు లోకావళీశంకరుండు
నటు నవార్ణజపాధీనుఁ డైనఁ గాంచి
యా మహామాయశుభచరణాంతికమున,
నే వినమ్రుఁడనై నిల్చి యిట్టు లంటి. ౧౬౭

తే. సకలజనధాత్రి వని నిన్ను సంస్తుతించు
వేదములు ని న్నెఱుంగఁ గోవిదము లగుట,
నఖిలమఖహోమములను స్వాహాస్వరూప
మున వెలుంగవె, సర్వజ్ఞమూర్తి! జనని! ౧౬౮

శా. అమ్మా! కర్తను నేనె యన్నిటికి, బ్రహ్మాండంపుభాండంబు స
ర్వ మ్మేనే సృజియింతు నద్భుతముగా, వర్ణింప నాతో సముం
డిమ్ముల్లోకములందు లేఁడు, ధ్రువ, మేనే ధన్యుఁడో బ్రహ్మనం
చిమ్మాడ్కిన్ దురహంకృతిం జొనుపఁ బోకే, నన్ను మోహాబ్ధిలో.

ఉ. తల్లి! నిజంబుగా నిపుడు ధన్యుఁడ, నీపదపద్మరేణుసం
పల్లవలబ్ధిచే; విను, భవం బెడలించి విముక్తి గూర్చు నీ
యెల్లకు నీశ్వరిం బర వరింతు; మహార్తి మహార్గళంబు సం
ధిల్లఁగఁ జేయు మోహము విదీర్ణముగాఁ గృప సేయవే ననున్.

క. నీచే నావిస్మృతిఁ గని
నీ చెప్పెడి పనుపు సేయు నీకింకరుఁడన్,

నాచేతఁ బొగడ్గ మ్రొక్కుచు
నాచింతను నన్నుఁ గావు మజ్ఞుఁడఁ దల్లీ ! ౧౭౧

క. నీకె వినోదవిహారిణి
వై విశ్వం బీక్షవలన నలరించెదు; న
న్నీ విశ్వవిధాత యనెడి
యావా రేమియు నెఱుఁగని యజ్ఞులె తల్లీ ! ౧౭౨

సీ. నీప్రభావ మెఱుంగ నేరమినే తల్లి !
స్వర్గకాము లయి యజ్ఞములు సేత,
నీనామము జపింప నేరమినే శ్రమ
నష్టాంగయోగసమాధిఁ గొనుట,
నీపదవరివస్య నేరమినే తత్త్వ
సంఖ్యావిధానవిస్తారు లగుట,
నీస్వరూపము చూడ నేరమినే బహు
భవముల మూఢులై పతితు లగుట,

యొక్క నిమిషార్ధ మాత్రంబు నోపరొక్క,
నీపవిత్రచరిత్రంబు నిలుప నెదల,
నంబికా యని, యీశ్వరీ యనుచు, శక్తి
యంచు, శివ యని, నీనామ మనరె లేరొ ! ౧౭౩

చ. సరసిజమందు నాకు మును జన్మము గూర్చిన దీవె కావొకో !
హరి మధుకైటభుల్ పొడువ, నాతనిఁ బాలన చేసి తీవెగా !
హరుని హరించి నాముఖమునం దుదయింపఁగఁ జేసినావుగా !
హరి హరు లేను నీకృప సమర్థుల మౌదుము నీదుశక్తినే ! ౧౭౪

క. నీజని యెవఁడుం జూడం,
డేజనుఁడుఁ వినఁడు, స్థాన మిది యనఁ డెవఁడే
నీ, జగదాదివి, యేకవు,
నా జననివి శక్తి వీవ యను శ్రుతి దాన్. ౧౭౫

తే. సీవితీర్ణవినోదంబు కేవలము మ
హాద్భుతావహం బగుటచే నాదిదేవుఁ
డగుణుఁడు నిరీహుఁడు నకర్త యయ్యుఁ బ్రీతి
నరయు నని పల్కుదు రభిజ్ఞులైన బుధులు. ౧౭౬

క. అయినం దల్లీ! యొకసం
దియంబు వేఁడించు నెడఁదఁ, దీర్పుము దానిన్,
సయిదోడు నీకుఁ బురుషుం
డయి పరుఁడు వెలుంగు, మీ రనాదు లిరువురున్. ౧౭౭

తే. వేదవాక్యంబు మిథ్య గాఁబోదు గాని,
యిది విరుద్ధంబుగాఁ దోఁచి యెడఁద వేఁచు;
బ్రహ్మవిదు లద్వితీయంబు బ్రహ్మ మేక
మే యటందురు, మీ ద్విత్వ మే మనందు! ౧౭౮

శా. నాపుణ్యాతిశయమ్ముచే నిపుడు పొందం జాలితిన్ భవ్యహా
నీపాదాంబుజసేవ, సందియ ముమా! నీనోట నే తీర్పు, నీ
రూపం బేది, నిజంబు పూరుషుఁడవో, స్త్రీరూపాత్మవో, తెల్పి, సం
దీపింపంగదవే స్వరూపము, భవాబ్ధిన్ దాఁట ముక్తుండఁ గాన్.

క. వినయావనతాంగుఁడనై
తను నే నిటు ప్రశ్న సేయ, దయతో నా కి
ట్లనె నాదిశక్తి భగవతి
ననుఁ గాంచి కటాక్షలలితనయనాబ్జములన్. ౧౮౦

**బ్రహ్మాదులకు శ్రీదేవి నిజస్వరూపము నుపదేశించుట**

క. నాకును నాతనికి సదా
యేకత్వమె కాని భేద మేమియు లే, దే
నే కాదె యతం, డాతం
డే కద నే, భేదమెల్ల నెదఁ గల భ్రమనే. ౧౮౧

క. కారణ కార్య విభేదా
కారత సూక్ష్మాంతరంబు గల మము నెఱుఁగన్
నేమము నెవఁ, డతఁ డీ సం
సారంబు తరించు బుద్ధిశాలి నిజముగా. ౧౮౨

ఉ. ఏకము నద్వితీయమును నే యగు బ్రహ్మ మనాది నిత్యస
త్యాకము నైనఁగాని, యది ద్వైతము నొందును సృష్టివేళ, నే
నేఁక నుపాధియోగమున వే ఱగు చెం డయి దీప మొండె, ఛా
యాకృతు లద్దమం దెటులొ, యట్టులె మా ప్రతిబింబరూపముల్.

తే. సర్గసంక్షయంపుసమయానఁ, బురుషుండు
గాను, స్త్రీయుఁ గ్లీబ మేనిఁ గాను,
సర్గవేళ బుద్ధిసామర్థ్యకల్పిత
మెల్ల భేద మనుచు నెఱుఁగ వలయు. ౧౮౪

క. నేనే బుద్ధిని శ్రీయున్
నేనే ధృతి, కీర్తి నేనె, నేనే స్మృతియున్,
నేనే శ్రద్ధను, మేధన్
నేనే, దయ లజ్జ నేనె, నేనే క్షుధయున్. ౧౮౫

క. నేనే తృష్ణను క్షమయున్,
నేనే కాంతియును శాంతి, నేనె పిపాసన్,
నేనే నిద్రను తంద్రను,
నేనె జరాజరలు, విద్య నేనె యవిద్యన్. ౧౮౬

క. నేనే స్పృహయును వాంఛయు,
నేనే శక్తియు, నశక్తియేనియు నేనే,
నేనే తజ్జ్ఞా వస,
లేనే నాడీసమస్త, మేనే వృష్టిన్. ౧౮౭

క. నేనే సమస్త మగువా,
క్కే నే, బూతనేనె, యస్ఫుత మేనె, పరావా

క్కనే, మధ్యమ పశ్యం
తి నామను వైఖరి యన నేనే సుమ్మీ! ౧౨౮

క. నేనే యీసర్వము, నేఁ
గానిది సంసారమందుఁ గలయ వెదకినం
గానీ గానంబడ దను
జ్ఞానము సుదృఢం బొనర్పు జలజజ! మదిలో. ౧౨౯

మ. బహునామంబులు దాల్చి శక్తి నయి గీర్వాణాకృతిం బొంది లో
కహితార్థంబు పరాక్రమించెదను నేఁ గౌబేరినై వజ్రహ
స్తాహ్వానై వైష్ణవి బ్రాహ్మి గౌరి శివనై వారాహినై వారుణీ
విహితాకారను నారసింహి నయి తద్భావానుకూలంబుగా. ౧౩౦

చ. జలమున నేనె శైత్యము, కృశానునియౌష్ణ్యము నేన, భానులో
పల వెలుఁ గేన, యాదును; క్షపాపతిలో హిమ మేను; జీవకో
టులు నను వీడనేని నొకటుల్ లవమేనిఁ జలింపలేవు, దై
త్యుల సమయింప శక్తుఁ డగునో శివుఁ డేనియు నేఁ దొలంగినన్!

తే. స్ఖలితుఁ బతితుని భీతుని భ్రాంతు శత్రు
జితు నరాధము దుర్బలమతిని జనులు
శక్తిహీనుఁ డితఁడు, వీఁ డశక్తుఁ డండ్రు
గాని, రుద్రహీనుఁడు విష్ణుహీనుఁ డనరు. ౧౩౨

క. కావున శక్తియె హేతువు
గావుట యెఱుఁగంగవలయుఁ, గంజజ! శక్తిన్
నీవుం గూడిన సృష్టిం
గావింపఁ గలాడ వగుదు, కడుఁ బెద్దవునన్. ౧౩౩

మ. హరియున్ శంభుఁడు నింద్రుఁడున్ హిమకరుం డాదిత్యుఁడుం ద్వష్టయున్
వరుణుండుం బవనుండు శక్తియుతులై భాసింతు, రాశక్తిచే
ధరియింపంగ సమర్థ మౌ ధర, తదాధారంబె లేకున్న నీ
ధరయున్ శేషుఁడుఁ గూర్మ మొక్క యణుమాత్రం బూనఁగా నేర్తు రే!

క. నా కిచ్చ కలిగెనేనిన్
లోకంబుల జలము పీల్చి లోఁగొందుఁ ద్రుటిన్,
బోకార్తు నా విభావసు,
పేఁకన్ స్తంభింతుఁ బవను వివిధచరములన్. ౧౯౫

వ. మఱియుఁ జతుర్ముఖా! తత్త్వంబు లసత్తులై యుద్భవించుచుండు నని శంకింప వలవదు. ఘట కపాలాదులకుఁ బ్రాగభావ ప్రధ్వంసాభావం బులుం బోలె విద్యమానంబు లగు తత్త్వంబులకు నావిర్భావ తిరోభావంబులె కాని యుత్పత్తి ప్రలయంబులు ఘటిల్ల నేరవు. ప్రకృతంబున నీయెడఁ బృథివి కానంబడ కున్నను, నయ్యది పర మాణువులుగ నయ్యె నని యెఱుంగ నగు. ౧౯౬

తే. ఇదిగొ కొనుము మహత్తత్త్వ మేడు తెఱఁగు,
లదియు శాశ్వతము క్షణిక మదియె శూన్య
మగును, నిత్యం బనిత్యంబు, నది సకర్తృ
కం బహంకారజనకంబు, కమలభవుఁడ! ౧౯౭

తే. ఇ ట్లహంకార మాదిగా నేడు తెఱఁగు
లగు మహత్తత్త్వము గ్రహించి యఖిలభూత
చయము రచియింపు మబ్జజా! చనుఁడు మీరు
స్వస్వవిధులఁ దీర్పుఁడు దైవభావితు లయి. ౧౯౮

ఉ. ఇదె భవదీయశక్తిఁ గొనుమీ చతురానన! చారురూప స
స్మిద దరహాసినిన్ విమల మాల్యవిభూషణ భూషితన్ శుభా
స్పద సమధిష్ఠితాసన సువాసిని దివ్యమహాసరస్వతిన్
ముదిత రజోగుణాన్విత; నినున్ సహచారిణియై భజించెడున్.

చ. ఇదె నినుఁ గూడి వీడక చరించు వరాంగన నావిభూతి సు
మ్మిది, యవమాన్య గాదు, హృదయేశ్వరిగాఁ బ్రియగాఁగఁ బూజనా
స్పదగ నెఱింగి దీనిఁ గొని సత్యనివాసము చేరఁబొమ్ము, త
త్పదమున మహత్త్వబీజ సముపాత్త చతుర్విధ సృష్టి సేయుమా.

తే. కాలకర్మ స్వభావముల్ కారణములు
జగతి కంతయు నన్న సూక్ష్మం బెఱింగి
లింగకోశమునుండి వేర్చేసి సకల
జీవులం జరాచరంబుల సృష్టి సలుపు. —౨౦౨

చ. సరసిజగర్భ! నీకు హరి జాప్యుఁడు, సత్త్వగుణప్రధానుఁడై
పరగుటఁ బూజనీయుఁ డగువాఁ, డెపు డెప్డు విపత్తు గల్గు, నా
తరుణములన్ ధరించి యవతారములన్ బహుభంగి దైత్యసం
హరణ మొనర్చు; శంభుఁడు జనార్దనుతోడయి యుండు సర్వదా.

క. సురలను సృష్టింపుము; త
ద్భరణము త్రైవర్ణ్యవిహిత బహుయజ్ఞములన్
జరిపింపుము; మన్నామ
స్మరణం బమరులకుఁ దుష్టి సలుపుం గాతన్. —౨౦౩

క. శర్వుఁడు తమోగుణాఢ్యుఁడు
సర్వముఖంబుల నతండు సంపూజ్యుండై
గీర్వాణుల నాశక్తులు
పర్వి దిగంతరములందుఁ బాయక కాచున్. —౨౦౪

ఉ. ఈవిధి నాన తిచ్చి భువనేశ్వరి, నాకు నవార్ణమంత్రదీ
క్షావిధి తీర్చి, ధ్యానపరిచర్యలు తెల్పి, వచించె నిట్లు: మం
త్రావళి నుత్తమం బిది, హృదంతరవీధి సదా ధరించి, త
ద్భావన సర్వకార్యముల వర్తిలు; శ్రేయము దానఁ జేకురున్.

తే. అట్లు కరుణించి నన్ను ననంతరమున
నాజగన్మాత భువనేశి యాదిశక్తి,
హరి కొసఁగుచున్ మహాలక్ష్మి, ననియె నిట్లు,
చెలఁగ శోభన రుచిర శుచిస్మితంబు. —౨౦౬

శా. దీనిం గ్రీడకు నీ కొసంగితిని బ్రీతిన్ శ్రీమహాలక్ష్మి, ల
క్ష్మీనారాయణయోగ మిప్డు డిటులన్ సిద్ధించె, నీదానురః

స్థానంబందు ఘటింపు దీని నెప్పుడున్, సర్వార్థముల్ చేకుఱన్,
శ్రీనారాయణ! దీని నేమఱక పూజింపం దగున్ సర్వదా. ౨౦౭

ఆ. నీవు విధియు శివుఁడు నిజము మద్గుణజాతు
లగుట సర్వమాన్యు లగుదు రెపుడు,
ముగుర భేద మెన్ను మూఢచేతస్కులు
నిరయగాము లగుట నిక్కువమ్ము. ౨౦౮

క. హరియే సాక్షాత్తు శివుం
డరయంగా శివుఁడె తాను హరియను వాఁడున్
మఱియుం ద్రుహిణుం డట్లే
మెఱయున్ భేదంబు లేక మీయిర్వురకున్. ౨౦౯

తే. వరలు పరమాత్మచింతనాపాది సత్త్వ,
మది ప్రధానగుణంబు నీకంబుజాక్ష!
తక్కు రెండు గౌణములు; పెంపెక్కు మఱి
లక్ష్మితోడి రజోగుణోల్లసితుఁడ వయి. ౨౧౦

ఉ. మాధవ! నీకొసంగెద సుమంగళమంత్రము, వాగ్భవంబు నా
మాధిగతంబు మాయ తుదియై విలసిల్లెడు దాని, దాన ను
ద్గీథముఁ గూర్చి సంతతముఁ గీర్తనసేయు, జపింపు భక్తి హృ
ద్వీధి ధరించి; కామనలు తీర్చు నిదే మఱి మోక్షదంబు నౌ. ౨౧౧

క. వైకుంఠమున రమింపు య
థాకామ మనాది గాఁగఁ దలఁచుచు నన్నున్,
మీ కుండదు మృత్యుభయము
నాకడుపున నెల్ల లయ మొనర్చెదు వఱకున్. ౨౧౨

తే. శ్రీమహాకాళి నిచ్చుచు శివున కవలఁ
బలికె నమృతంపుసోనలౌ పలుకు లిట్లు,
త్రిగుణరూపిణి యయి ప్రకృతిస్వరూప,
నిర్గుణాత్మిక యయ్యు పరానిష్కలాఖ్య. ౨౧౩

క. హర! కైసని గారి మనో
హరిని మహాకాళిఁ గొను విహారము సేయం
గ, రచింపుము కైలాసం
బు, రుచిఁ బెడునట్టికీర్తిఁ బొందుము సుఖముల్. ౨౧౪

తే. తమము ముఖ్యంబు నీకు, సత్త్వము రజమ్ము
గౌణగుణములు, రాత్రిసాక్రమణవేళఁ
దమము రజమును గొనుము, సత్త్వంబుఁ బూను
తప మొనర్పఁగఁ బరమాత్మఁ దలఁచువేళ. ౨౧౫

సీ. త్రిగుణములే మీ రెల్లఁ ద్రిగుణాత్మకముగాని
వస్తు వీసంసృతిఁ బడయ లేము;
దృశ్యంబు నిర్గుణం బెటు లౌను? బరమాత్మ
నిర్గుణుం డతఁడు కంటికి గనపడఁడు;
సమయానువర్తినై సగుణ నిర్గుణ నేను
కార్యం బెపుడుఁ గాను, కారణమునే;
సర్వకారణ నౌట సగుణ నౌదును, బరు
షాంతికంబున నిర్గుణాత్మ నౌదు;

సత్త్వవలన నహంకారజన్మ మగును,
త్రిగుణము లహంకృతిని సంప్రతిష్ఠితములు,
దానిచేత మహత్తత్త్వ మౌను జన్మ,
మదియె బుద్ధి యనంగ విఖ్యాత మగును. ౨౧౬

తే. దానఁ దన్మాత్ర లుదయించు, వానివలన
నేను భూతంబు లేను కర్మేంద్రియములు
నైదు జ్ఞానేంద్రియంబులు నవల మనసు
గలిసి పదియాఱు కారణకార్యగణము. ౨౧౭

క. చనుఁడీ ముగురు విమానం
బున నిలయంబులకుఁ, జేయఁ బూనుఁడు విధులన్,

నను స్మరియించినమాత్రం
బున దర్శన మొసఁగి విషమములు హరియింతున్. ౨౧౭

క. స్మరియింపుఁడు నన్ను సదా,
స్మరింపుఁడు సనాతనుఁ డవఁ జను పరమాత్మున్,
నిరతము మా యిరువుర సం
స్మరణంబునఁ గార్యసిద్ధి సాధ్యముసుండీ. ౨౧౮

చ. సెల వటు పొంది, శక్తులను జేకొని, శ్రీభువనేశ్వరీ మహో
జ్జ్వలభువనంబు రూపము ప్రభావము నద్భుత దర్శనోక్తులుం
దలఁచుచునే విమానమును దాసి కనుంగొనునంత ద్వీపమే
గల పొడ గానరాదు, శివఁ గానము, కన్పడ దా సుధాబ్ధియున్.

క. పరికింపఁ ద్రిమూర్తులముం
బురుషాకృతు లొంది మరలఁ బొడకట్టితి, మా
ర్యార మొక్క విమానం బది
హరి మధుకైటభులఁ ద్రుంచినటఁ జేర్చెఁ ద్రుటిన్. ౨౨౦

తే. నారదా! నేను విష్ణుండు గౌరివిభుఁడు
నట్టి దేవీప్రభావంబు నరసినార
మంచు వివరింపఁ బ్రీతుఁడై యతనిసుతుఁడు
నారదమహర్షి ప్రశ్నించె నలువ నిట్లు. ౨౨౨

తే. ఆదిపురుషుండు నిర్గుణుం డచ్యుతుండు
కనుల కగపడెనో మఱి, కన్నశక్తి
త్రిగుణమూ, నిర్గుణాత్మయా, తెలుపు తండ్రి!
వానిరూపంబు తెలుపుము దానిరూపు. ౨౨౩

క. శ్వేతద్వీపమునందు మ
హాతపమున్ మఱియు మఱియు నతితీవ్రగతిన్
దాతా! చేసి, మహాత్ములఁ
బూతుల సిద్ధులను, గంటిఁ బొందక దానిన్. ౨౨౪

వ. ఇవ్విధంబున నిజతనూద్భవిజిత పారదుం డగు నారదుం డడిగిన బ్రహ్మాసనుం డగు చతుర్వదనుండు దరహాస వికసిత ముఖ కల్హారుం డయి సంశయ నివారణ నిపుణంబులగు సత్యవచస్స్ఫురణంబుల నిట్లని నుడువం దొడంగె. ౨౨౫

క. రూపము లేనిది నిర్గుణ,
మేపగిదిం దానిఁ గనుల నీక్షింప నగున్?
రూపము గల దెల్లయు నిల
రూపింపుము నశ్వరస్వరూపము గాఁగన్. ౨౨౬

తే. నిర్గుణం బగు నల శక్తి దుర్గమంబు,
నిర్గుణుం డగు పురుషుఁడున్ దుర్గముండు,
భావనామాత్ర సాధ్యులు కేవలమ్ము,
జ్ఞానగమ్యులు మునులకు ధ్యానపదులు. ౨౨౭

క. ప్రకృతియుఁ బురుషుఁ డనాదు ల
వికృతు లనంతులు నచింత్యవిగ్రహు, లరుదౌ
నొక నమ్మిక వారలచే
రిక సాధ్యం, బదియె లేక లేరు తెలియఁగన్. ౨౨౮

వ. మఱియు సర్వభూతాత్మకం బయిన పరమచైతన్యము సర్వగతం బయి, తేజోరూపంబున నెల్లజీవుల ననపాయం బై యుండుఁ; గావునఁ బ్రకృతి పురుషు లిరువురును సర్వగతులు సర్వవ్యాపకులు నని యెఱుంగుము. చరాచరాత్మకం బగు సంసారంబునఁ దద్వి రహితం బగునది రవంతయుఁ గానంబడదు. సర్వదేహంబులయందు మిశ్రీభూతులై వెలుంగు ప్రకృతి పురుషు లిరువురు నిరంతరైకావస్థాన గతు లవ్వటం జేసి చిన్మయులు నిర్గుణులు నిర్మలులు నగు నవ్వారల నేకరూపులుగ నుపాసింపవలయు. దానం జేసియ, బ్రహ్మవేత్తలు మాయావిశిష్టం బయిన బ్రహ్మమే శ్రీదేవీపదవాచ్య మని యుపదేశింతురు. ౨౨౯

తే. అల్ల శక్తి యెదో, పరమాత్మ వాఁడె;
పురుషుఁ డెవ్వఁడో, యల శక్తి పరమ యదియుఁ
సూక్ష్మ మగు నంతరంబేనిఁ జూడఁబోరు
వేదవేదాంగవిదు లగు విమలమతులు. ౫౩౦

క. నారద! యీవిశ్వ మహం
కారమునఁ జరాచరాత్మకం బయ్యె, నహం
కారజగుణావృతచిత్తం
బేరీతిని నిర్గుణంబు నెఱుఁగం జాలున్ ? ౫౩౧

క. గుణవిచ్ఛేదము కానిది
కనఁగా నల నిర్గుణం బగమ్యం బది; యే
జనున కహంకారము చనఁ,
గను నాతఁడు చిత్తమం దకల్మషవృత్తిన్. ౫౩౨

క. అది విని నారదుఁ డడిగెను,
విదితంబుగ సాత్త్వికాది వివిధగుణము లె
ట్లుదితం బయ్యె? స్వరూపం
బెది వానిది? ముక్తి దేనియెఱుక లభించున్? ౫౩౩

వ. అని యడిగిన నారదునకు బ్రహ్మ యి ట్లనియె. ౫౩౪

క. త్రివిధాహంకారసము
ద్భవ మగు శక్తిత్రయంబు వరుసన్ జ్ఞానం
బవు సాత్త్వికిని, క్రియాత్మిక
మవు రాజసి, ద్రవ్యశక్తి యగుఁ దామసిచే. ౫౩౫

సీ. వానికార్యంబులన్ వాక్రుత్తు విను యథా
తత్త్వంబుగా నారదా! మహర్షి,
వంతులోఁ దామసాహంకారజాతమౌ
ద్రవ్యశక్తిని సముద్భవము లగును,

శబ్దంబు మఱియు స్పర్శము రూప రస గంధ
వాచ్యమౌ తన్మాత్ర పంచకంబు;
శబ్దగుణక మాకసము, స్పర్శగుణకము
వాయువు, వహ్ని రూపగుణకమ్ము,

వరుస రస గంధ గుణములు వారి పృథ్వు
లెఱుఁగుమివి సూక్ష్మములుగ, నీయెల్ల పదియు
మిళితమై ద్రవ్యశక్తి సమ్మేళ మొంది
ఉపనువృత్తిక సర్గమౌఁ దామసమున. ౩౧

సీ. రాజస్యహంకార బీజక్రియాశక్తి
జాతమౌ వస్తుపంచకము వినుము,
శ్రోత్రంబు త్వక్కు చక్షు ఘ్రాణ జిహ్వాలు
నన నొప్పు జ్ఞానేంద్రియంబు లైదు,
వాక్పాణి పాదముల్ పాయువు గుహ్యంబు
ననఁ బఱు కర్మేంద్రియంబు లైదు,
ప్రాణం బపానంబు వ్యానం బుదాన స
మానముల్ వాయువు లేను గూడి

యైదు పదియును రాజసాఖ్యాన సర్గ
మగుఁ గ్రియాశక్తి మయ సాధనాళిమాత్ర
మని యెఱుఁగు మి వెల్ల; సమస్తమునకుఁ
జిదనువృత్తి యుపాదానపదము సుమ్ము. ౩౨

సీ. సాత్త్వికాహంకార జాతమౌ జ్ఞానశ
క్తిని బుట్టు నల వస్తుగణము వినుము,
జ్ఞానేంద్రియంబుల కేనింటికిని దిశల్
వాయువు సూర్యుండు వరుణుఁ డశ్వి
నులు నధిష్ఠానరూపులు దేవతాపంచ
కము, నట్ల చంద్రుండు కంజజుండు

సీ. పుంసు మనస్సులోఁ బొందించి యల రస
తన్మాత్ర, రెండుగా దానఁ జేసి,
యందులో నొకభాగ మట్లుంచి, రెండవ
భాగంబు నాల్గుగాఁ బంచి, యట్లె
తక్కు భూతంబుల తన్మాత్రలను గూడ
రెండుగా నొకటి నాల్గింటిగఁ జీల్చి,
ప్రేలనిరసము సాబాలునఁ దక్కటి
భూతాళి యష్టాంశములను జేర్ప,

నుదక ముదయించు, రసమునఁ దూడి చీల్చి
నట్టి నాలుగుభాగమ్ము లట్లు మరల
నితరభూతతన్మాత్రల నెసఁగి కలియు
భూతతన్మాత్ర లవి మాఱు భూతములుగ. ౨౮౭

వ. ఇట్లు వేర్వేఱుగఁ బంచభూతసంభవమై, యవ్వానియందు నధిష్ఠానముగాఁ జైతన్యము ప్రవేశించినంతన, యహ ముదయించు. ౨౮౮

క. ఆ యహ మను నభిమానం
బాయత్తంబైన నదియె యాద్యం డగు నా
రాయణుఁ డనియు ననంబడుఁ,
బాయక వైశ్వానరాఖ్యఁ బ్రథితుఁ డతండౌ. ౨౮౯

సీ. భూతముల్ పూర్వోక్త రీతి ఘనీభూత
రూపత విస్పష్టరూపము లయి,
యొక్కొక్క భూతంబు కొక్కొక్క గుణము ప్ర
ధానంబుగ గుణవృద్ధముల యగును;
నాకాశమున గుణంబగు శబ్ద మొక్కటె;
స్పర్శమ్ము శబ్దమ్ము వాయువునకు;
శబ్దంబు రూపంబు స్పర్శంబు నా మూఁడు
గుణము లౌ నగ్నికి గుణము లగుచు;

జలమునకు నాల్గు గుణములౌ శబ్ద మనఁగ
స్పర్శమును రూపగుణము రసం బనంగఁ;
బృథివి కైదు గుణంబులై వెలయు గంధ
శబ్దరూపముల్ రసము స్పర్శం బనంగ. [illegible]

తే. అట్లు మిళితమై పుట్టు బ్రహ్మాండ మిద్ది
సర్వజీవాళి మేళనజాత మగుచు
సకలము నజాండ మిది; జీవజాతు లెల్ల
నెనుబదియు నాల్గు లక్షలై యొసఁగు నయ్య! [illegible]

సత్త్వాదుల స్వరూపము

క. వివరించితి సర్గం, బిఁక
వివరింతు గుణస్వరూప విధముల్ వినుమా,
భువి సత్త్వము ప్రీత్యాత్మక
మవు, నా ప్రీత్యుద్భవంబు నగును సుఖమునన్. [illegible]

ఉ. శాంతియు శౌచ మార్జవము సత్యము లజ్జ దయాస్వభావమున్
సంతసమున్ దయా ధృతులు సంతతతుష్టియు శ్వేతవర్ణమం
దెంతయుఁ బ్రీతి ధర్మమున నిష్ఠము సత్తున సిండుశ్రద్ధ యు
త్యంత మసత్తునన్ విముఖతాప్తియు సాత్త్వికలక్షణంబు లౌ. [illegible]

క. తత్త్వం బెఱిఁగిన ఘనులు
సాత్త్విక మన మఱియు రాజసము తామసమున్
త్రిత్వాకారప్రత్యే
కత్వమున వచింత్రు శ్రద్ధ గ్రాలఁ నటంచున్. [illegible]

ఉ. రక్తముచాయ రాజసము రాజిలు, నప్రియకారి యౌటచేఁ
బ్రోక్తము దుఃఖయోగము తదుద్భవకారణ మంచు, దానిని
ద్రిక్తత మానగర్వములు ద్వేషము ద్రోహము స్తంభమున్ క్రుధా
యాస్తియు నిద్ర శల్యము నివి యొప్పును రాజసలక్షణంబులై. [illegible]

క. వెలయుం దమంబు రంగుగ
  వలు వగుచు, విషాద మోహన ప్రద మని యా
  ప్తులు గుర్తింపంగాఁ దగుఁ
  దెలిపెదఁ, దల్లక్షణంబు దెలియుము వత్సా! —౯౫౩

సీ. ఆలస్య మెం దుండు, నజ్ఞాన మెం దుండు,
      నతినిద్ర యెందు, దైన్యం బ దెందుఁ,
  గార్పణ్య మెం దుండుఁ గౌటిల్య మెం దుండు,
      భయ మెందు నుండు, విషాద మెందు,
  రోష మెందుల నుండు, వైషమ్య మెం దుండు,
      నెం దుండుఁ బరదోష మెన్నుచుంట,
  వేదశాస్త్రీయుక్త విధులందు నాస్తిక
      -బుద్ధి యెం దుండు వివృద్ధ మగుచు,

  నందుఁ దామస మగు శ్రద్ధ యావరించె
  ననుచు నీ లక్షణంబుల నరయఁ దగును
  బుద్ధిమంతుఁడు; లెస్స నీబుద్ధిఁ గనుము,
  పరగు నిది పరతాపోపపాదక మగు. —౯౫౪

క. కేవలము సత్త్వగుణమును
  గేవలము రజోగుణంబుఁ గేవలతమముల్
  లేవెం, దన్యోన్యాశ్రయ
  భావంబున నవి విమిశ్రవర్తనఁ బొదలున్. —౯౫౫

క. శ్రేయస్కాముఁడు సత్త్వ
  స్థాయస్ఫూర్తిన్ వెలుంగఁ బచరించి, రజ
  స్సాయమున మొనర్చుచు, నె
  ట్లో యడఁపంగఁ గడఁగుఁ దమఉద్రేకంబున్. —౯౫౬

క. ఒక్కటి పెం పొందిన మఱి
  తక్కటి రెండును విరుద్ధధర్మము లగుటచే

ను కక్కఱి శమియించును, విను
వక్కాణించెదను వత్స! వానివివరముల్. ౨౫౭

క. వినినంతమాత్ర నెవ్వఁడుఁ
గనినంతనునేని జ్ఞాని కాఁ డచలంబై
యనువుగ ఫలజనకం బగు
ననుభవ మది లేక, నిక్కమయ్య తనూజా! ౨౫౮

ఉ. ఒక్కఁడు పుణ్యతీర్థమహిమోక్తి వినం గని శ్రద్ధ మీఱఁ జా
నక్కడి కేఁగి క్రుంకు లిడి యర్థవిధంబున దానధర్మముల్
పెక్కులు రాజసమ్మున నొనరించి గృహాగతుఁ డయ్యె; వాని కే
నక్కట! కామమూదియగు నారిపుషట్క మడంగ దింతయున్.

తే. పాపదేహవికారరూపంబు లైన
కామరాగాదికం బడంగనిది తనువు
పాపభూయిష్ఠమే కద, వానితీర్థ
సేవయును విస్క వృథ యయ్యెఁ గేవలమ్ము. ౨౬౦

ఉ. కర్షకుఁ డొక్కరుండు తనుకష్టము నోరిచి నల్లనేల సం
కర్షణముం బొనర్చి సరిగాఁ దఱి విత్తులు చల్లి వారిసం
తర్ష మొనర్చె రేఁ బవలు దానినిఁ బాయక కాచియుం దుదిన్
హర్షముతో హిమాత్యయమునన్ నిదురించెను పంటవేళలో. ౨౬౧

క. అకటా! వనమున వ్యాఘ్రా
దికములు శలభములుఁ బైరు తినివేసె, సము
త్సుకత మెఱయఁగా నా క
ర్షకుఁ డాసించిన ఫలంబు సర్వం బడఁగెన్. ౨౬౨

క. ఒక్కనితీర్థశ్రమ, మిం
కొక్కనికృషి, యిట్లు నిరుపయోగము లగుఁ, జెం
పెక్కను శాస్త్రవిలోకన
నెక్కడ సత్త్వము విరాగ మొసఁగు ఫలంబై. ౨౬౩

తే. సత్త్వ మెక్కువయై రజస్తమము లడఁచుఁ,
దమము సత్త్వమ్మును రజోభ్యుదయ మడంచుఁ,
దమము పెరిగి యడంచు సత్త్వంబు రజము;
నపు డగు విరాగ లోభ మోహములు వరుస. ౨౬౪

ఉ. సత్త్వము వృద్ధి గన్న, స్థిరసంస్థిత మా మతి, ధర్మమందు లో
లత్వము సత్త్వభోగవిముఖత్వము యాజ్ఞికకర్మలందు నా
సక్త్వము వృద్ధి గాంచు. నిరతంబు సుఖగ్రహణం బొనర్చుటకా
సాత్త్వికవిత్త మొక్కటె, రజమ్మును నొంచి తమస్సు నోర్చుటకా.

ఉ. రాజసమైన శ్రద్ధ ప్రబలంబయినంత. సనాతనంబులై
భ్రాజిలు ధర్మముల్ వదలు వాంఛ జనించుఁ, గ్రమప్రవృత్తిగా
రాజసవిత్తవర్ధనము రాజసభోగసుఖేచ్ఛ, దానితో
సాజము నిర్గతంబగుట సత్త్వముఁ దామసముకా గ్రమంబుగా.

చ. ఎపుడు తమం బెసంగు నపుడే శ్రుతియందుఁ బ్రమాణబుద్ధియుకా
వ్యపగత మౌఁ, బొనర్చును ధనార్త్యయ మొల్లక, ద్రోహివలె, నిరా
సపరుఁడునై శతుం డగు, నశాంతుఁ డగుకా, గ్రసియించు, రాజసం
బుపశమ మంద సత్త్వమును నొక్కుట, దుర్మతి గ్రోధనుండు నై.

తే. సత్త్వ మేనిఁ దమస్సు రజస్సునేని
నొంటిగా నుండ, వన్యోన్య మంటియుండు;
నం దొకటి తక్కు రెంటి మూహిందఁ జేయు,
మిథునధర్మంబు లవి యని కథితము లగు. ౨౬౮

తే. మృత్తుచేఁ గుండ, కుండచే మృత్తు నెట్లొ,
యజ్ఞదత్తుండు దేవదత్తాహ్వయుండు
నొక్కపని యెట్లు సేతురో, యుగ్మభావ
మవియుఁ బూనును స్త్రీపురుషాత్తియువలె. ౨౬౯

తే. అట్లు పలుకు బ్రహ్మ నడిగితి, సంతృప్తి
నొందకుంటిని మధురోక్తులు విని,

మఱియుఁ జెలువు గుణసమగ్రరూపంబును,
బుష్టి పరమశాంతిఁ బొందు మనల్లు. ౨౭౦

గుణ స్వరూప నిరూపణము

తే. అట్టు లడుగు నారదునుల్కు లాలకించి
యా రజోగుణసంభూతుఁ డగు విరించి,
యాదరంబొప్ప నీక్షించి యాత్మజాతు
వంక, వివరించె నీరీతి నింక, వినుము. ౨౭౧

క. గుణముల నిండగు రూపం
బనువర్ణింపంగ సాధ్య మగునే నా, కై
నను నది నానేర్చినవ
ట్టును దృష్టాంతముల స్ఫుటపఱుతు, విను దాసిన్. ౨౭౨

వ. పొలఁతి యశేషభూషణ విభూషితయై లలితాంగియై స్మితో
జ్జ్వల యయి హావభావవిలసద్వపువై పతికిం బ్రియంబు మి
క్కిలి పచరించు, బంధుతతికిం బ్రమదం బొనఁగూర్చుఁ దల్లిదం
డ్రులకు, నదే సపత్నికిఁ గడుం గలిగింపదె శోకమోహముల్! ౨౭౩

మ. మదదంతావళబృంహితం బగుచు భ్రామ్యద్వాజిహేషారవా
స్పదమై స్యందననేమిఘోష మయి యాస్ఫాల్యత్పదాతప్రథా
పదమౌ వాహిని చోరలుంఠిత భయభ్రాంత్యాపనోదక్షమం
బదియే దస్యుజనాళికిన్ భయవిమోహోపాదియై యొప్పదే! ౨౭౪

చ. ఘనతిమిరావగుంఠితము గర్జనఘోరతటిద్భ్రమంబు దు
ర్దిన మది విత్తుకైతు నలరించి, యనావృతగేహవాసులౌ
జనుల నలంతవెట్టి యనిశంబును బ్రోషితభర్తృకాజనం
బున కెడలేని యార్తియు విమోహభరంబుఁ గరంబు గూర్పదే!

క. గుణ మేదియు నొంటిగ నెం
దును నుండంబోదు సుమ్ము, తోడై యుండుం;

గనుక, సుఖంబును మోక్షం
బును మోహామునట్లు యుడియు మూఁడుం గూర్చున్. ౨౭౬

ఉ. సత్త్వగుణంబు నిర్మలము స్వచ్ఛము నై వికేదప్రకాశశో
భాత్మము తోడ నొప్పు; నది నర్తిలుచున్న లఘుత్వ మొందు, లో
లత్వము మాననేర్చు, విషయంబులఁ బటువృత్తి తోలంగు, సత్కథా
విస్తరము స్మృష్టిపూం, కోనవు వెన్కటివృత్తుల నింద్రియావళుల్.

క. చంచలచిత్తము జృంభా
ప్రాంచితదేహంబు స్తంభపరవశమనముం
గాంచకగ నగు జనంబుల
నుంచునెడ రజోగుణంబు మేదుర మగుచున్. ౨౭౮

క. కలి నన్వేషించుచుఁ జా
పలమున మది శాంతి లేక భ్రమియింపంగాఁ
గలిగెడి కోర్కెల బరువై
తలకొను నింద్రియగణంబు తమ మేపొందన్. ౨౭౯

తే. ఇట్లు గుణవిస్తరంబు వచింప స్రష్ట,
నారదుఁడు ప్రశ్న చేసె; గుణత్రయంబు
భిన్నలక్షణంబు విరుద్ధవృత్తి, యొకట
మిశ్రమై యెట్లు కార్యముల్ సలుపు ననుచు. ౨౮౦

వ. అని యడిగిన నారదునకు బ్రహ్మ యి ట్లనియె. ౨౮౧

ఉ. తైలము వర్తి యగ్నియు నితాంతము నైరులు భిన్నధర్మసం
శాలులు నయ్యు నొండొకట సంగతమై వెలుఁగొంది దీపమై
చాలవె పాఱద్రోల ఘనసంతమసంబు దిగంతభూమి, కా
లీల గుణత్రయంబుఁ బొనరింపఁగఁ జాలును గార్యజాలముల్.

వ. అని పితామహుండు నాకుఁ దెలిపె నని నారదుండు, వ్యాసునితో
మఱియు ని ట్లనియె. ౨౮3

క. వ్యాసమునీంద్రా! సత్యవ
తీసుత! విను కారణములు త్రిగుణములే సు
మ్మీ సృష్టి కెల్ల, నేఁ గమ
లాసనుచే మున్ను విన్న దదియే వత్సా! ౨౨౮

తే. ఇట్లు మున్ను నారద సంయమీశ్వరుండు
విస్తరించె గుణంబుల వివర మెల్ల
గాన, జనమేజయా! నీవు దీప్తి నెఱిఁగి
నిష్ఠ మీఱఁ బరాశక్తి నిలుపు మెడఁద. ౨౨౯

శా. ఆరాధింపుము దాని నాపరమ దివ్యాకార, నెద్దానిచే
నీ శోభిల్లిన సర్వముం వితతమై యాకీర్తి భాసించునో,
సారం బేదియొ సర్వనామములకున్, సంసాధ్యకార్యాళికే
దారంభంబుగ నేది నిర్గుణయునై సాకారయై పొల్చునో! ౨౩౦

క. పురుషుఁడు పూర్ణుఁడు పరముఁడు
నిరీహుఁ డవ్యయుఁ డకర్త నిర్గుణుఁ డేక నీ
పరమమహామాయయె దా
విరచించును సదసదాత్మవిశ్వం బెల్లన్. ౨౩౧

క. హరి హరు లజుఁ డిన చంద్రులు
పురుహూతుం డగ్ని వాయువులు వరుణాదుల్
సుర లెల్ల శక్తియుతులై
కరము సమర్థు లటు గాక కదలం గలరే! ౨౩౨

ఉ. ఆ పరమేశియే జగతి కంతకుఁ గారణమయ్యె! భూప! దే
వీపదభక్తిఁ జిత్తము ద్రవింప మఖం బొనరింపఁ బూను, మం
బాపరిచర్యచేత సులభం బఖిలేప్సితసిద్ధిదంబు సం
తాపహరం, బనంతకరుణామయ యీశ్వరి సత్త్వమూర్తి [illegible].

ఉ. దానినె మున్ను బ్రహ్మయు సదాశివుఁడున్ హరి పూజచేసి, వి
ద్వాని జితాత్ములౌ మునులు ధ్యాన మొనర్తురు మోక్షకాంక్షులై

దాసిపని శేషానుము [illegible] నముగాఁ బ్రసంగమా
ర్తౌన పచించింతనె వంబు లసాధ్యములైన నీయదే! ౨౯౦

## సత్యవ్రత చరిత్రము

తే. వినుము సత్యవ్రతుం డను విప్రుఁ డొకఁడు
బిరుదుమహిం బుగా భయవివ్హాలుఁ డయి
పలుక 'నై యై' యట చు నాపరమమూర్తిఁ
జలమెఁ గవిరాజు దేవి ప్రసన్న యగుచు. ౨౯౧

క. దేవీనామమహాత్మ్యము
భావితముగ మాకు నెప్పుడుఁ బ్రత్యక్షమును
మ్మా విమలకథాముఖమున,
నా, వేదవ్యాసుఁ గాంచి నయ మెసలారన్. ౨౯౨

వ. జనమేజయుం డా సత్యవ్రతునికథ వినవలతు నానతి మ్మని వేఁడిన వ్యాసుం డి ట్లనియె. ౨౯౩

క. వినిపింతుఁ గౌరవేశ్వర!
మునులసమాజమున నేను మును విన్నది పా
వనము మనోహర మతిశో
భన మద్భుత మగు పురాణవరకథ, వినుమా. ౨౯౪

క. కురురాజ! ము న్నొకానొక
తఱి నేఁ దీర్థాభినిరతిఁ దరలి మునినిరం
తరసేవ్యము నైమిశవని
కరిగి మునీంద్రులకు నెఱఁగి యచట నిలిచితిన్. ౨౯౫

క. అందుండి రపుడు సనకస
నందను లాదిగల బ్రహ్మనందనులు చిదా
నందులు జీవన్ముక్తు ల
మందతపోవ్రతు లనేక మానిజనములున్. ౨౯౬

క. వేదవిదుల్ వేదవ్రత
వేదులు వేదాంతవిదులు వివిధాధ్వరసం
పాదితపుణ్యులు శౌచా
మోదులు మును లా సమాజమునఁ గల రనఘా! ౨౬

క. ఆ పుణ్యసమితిలో బహు
ధా పుణ్యకథాప్రసంగతతి నడువంగా
నా పరిషత్తును వినయా
లాపుఁడు జమదగ్ని యిట్టులం బ్రశ్నించెన్. ౨౭

క. కందను మహానుభావులు
నిం దొక్కటిఁ గూడియుంట నెంతయు మదికిన్
విం దయ్యె నాకుఁ గల్గిన
సందేహము దీర్పరయ్య సదయహృదయులై. ౨౮

క. చేరఁగ సుఖసేవ్యుండై
కోరిక లెల్లయును వేగఁ గూర్చెడు విభుఁడై
యారాధనీయతముఁ డగు
శ్రీరమ్యుఁడు వేలు పెవ్వఁ డెల విచ్చెదరో! ౨౯

క. అట్టిఁడు బ్రహ్మానో, విష్ణువో,
గట్టులదొరకూఁతుమగఁడో, కా కింద్రుఁడో, యు
ద్భట్టో, సమీరణుఁడో, ధన
రాట్టో, కుమారుఁడో, యినుండో, రజనీపతియో! ౩౦

మ. మునిగోష్ఠిన్ జమదగ్ని యీవిధిని మోదంబుం గేలుతో సందియం
బును దీర్పుం డని వేడుకొన్న వచనంబుల్ లెస్సగా లోమశుం
డను మానీశ్వరుఁ డాలకించి సభలో నత్యాదరం బొప్ప నా
తని సంబోధన చేసి పల్కెను సమాధానంబు నీరీతిగా. ౩౧

సీ. శుభ మిచ్చుయించెడి శుద్ధు లెల్లరకును
సంసేవ్యతమ పరాశక్తి యొకతె,

క. వేదవిదుల్ వేదవ్రత
వేదులు వేదాంతవిదులు వివిధాధ్వరసం
పాదితపుణ్యులు శౌచా
మోదులు మును లా సమాజమునఁ గల రనఘా! ౨౯౭

క. ఆ పుణ్యసమితిలో బహు
ధా పుణ్యకథాప్రసంగతతి నడువంగా
నాపరిషత్తును వినయా
లాపుఁడు జమదగ్ని యిట్టులం బ్రశ్నించెన్. ౨౯౮

క. ఇందరు మహానుభావులు
నిం దొక్కటఁ గూడియుంట నెంతయు మదికిన్
విం దయ్యె నాకుఁ గల్గిన
సందేహము దీర్పరయ్య సదయహృదయులై. ౨౯౯

క. చేరఁగ సుఖసేవ్యుండై
కోరిక లెల్లయును వేగఁ గూర్చెడు విభుఁడై
యారాధనీయతముఁ డగు
శ్రీరమ్యుఁడు వేలు పెవ్వఁడొ సెల విచ్చెదరో! ౩౦౦

క. అట్టిఁడు బ్రహ్మయొ, విష్ణువొ,
గట్టులదొరకూఁతుమగఁడొ, నాకేంద్రుఁడొ, యు
గ్రాట్టో, సమీరణుఁడో, ధన
రాట్టో, కుమారుఁడో, యినుండో, రజనీపతియో! ౩౦౧

మ. మునిగోష్ఠిన్ జమదగ్ని యీవిధిని మోదంబుం గేలుతో సందియం
బును దీర్పుం డని వేడుకొన్న వచనంబుల్ లెస్సగా లోమశుం
డను మానీశ్వరుఁ డాలకించి సభలో నత్యాదరం బొప్ప నా
తని సంబోధన చేసి పల్కెను సమాధానంబు నీరీతిగా. ౩౦౨

సీ. శుభ మిచ్చుచుండెడి శుద్ధు లెల్లరకును
సంసేవ్యతమ పరాశక్తి యొకతె,

యదియే ప్రకృతి యాద్య యదియె సర్వగ శివ
యదియె బ్రహ్మైనమహాత్మజనని,
సంసారపాదప సంతతి కదె మూల,
మదె సమస్తము దాల్చు నఖిలధాత్రి,
స్మరణంబుచే సముచ్చారణ వరదాత్రి
యద్దియే కరుణారసార్ద్రమూర్తి,
యాపరేశి మహత్త్వబోధాతిభూమి
యయిన యితిహాసమును మునులార! వినుడు,
ద్విజుఁ డొకం డెట్లు శుభము ప్రాపించెఁ గేవ
లాక్షరోచ్చారణముమాత్ర; నది వచింతు. ౫౧౭

తే. దేవదత్తుం డనంగ భూదేవుఁ డొకఁడు
పుత్త్రహీనుండు కోసలభూమిఁ గలఁడు;
పుత్త్రి కామనతో విధిపూర్వకముగ
వాఁడు కావింప నిష్టి యుపక్రమించె. ౫౧౮

క. తమసాతీరంబున ను
త్తమమండప మొం డొనర్చి దానికి ద్విజస
త్తములను సత్రక్రియవి
త్తములను బహువేదవిద్వదాన్యులఁ బిలిచెన్. ౫౧౯

తే. వేది నిర్మించి, యట యథావిధిఁ బ్రతిష్ఠ
సలిపి యగ్నిని, బుత్త్రేష్టిఁ దొడఁగెఁ జేయ,
బ్రహ్మగ సుహోత్రమూని, యధ్వర్యుఁడుగను
యాజ్ఞవల్క్యుఁడు, హోత బృహస్పతిగను. ౫౨౦

తే. పైలమునివర్యుఁ బ్రస్తోతృపదవి నుంచి,
గోభిలాఖ్యు నుద్గాతగాఁ గూర్చె, మఱియు
మానిసింహుల సభ్యులఁగా నొనర్చి,
వసు వొసఁగె నెల్లరకు విధివత్తుగాఁగ. ౫౨౧

తే. అప్పుడు దుర్జాత సామగాయనవరిష్ఠుఁ
డందు సప్తస్వరముల సమన్వితము ర
థంతరమ్ము గానము స్వరితమ్ము గూర్చి
సలుపుచుండె మనోజ్ఞసుశ్రావ్యఫణితి. ౩౦౮

క. ఆసమయంబున బహుళ
శ్వాసంబులఁ జేసి సుంత స్వరభంగము గాఁ
గా, సహియింపక గోభిలు
సీసున ననె దేవదత్తుఁ డిట్లు కుపితుఁడై. ౩౦౯

తే. మూర్ఖు వైతేమయా మునిముఖ్య నీవ!
యయ్యయో కావ్యకర్మగదయ్యె యిదియుఁ?
బుత్త్రుఁ గామించి యజనంబు హోనముప నిటు
లిందు స్వరభంగ మొనరించి తేమనందు? ౩౧౦

తే. గోభిలుఁడు పల్కె నిటు బిట్టు కుపితుఁ డగుచు,
మూర్ఖుఁడు శఠుండు శబ్దవిమూఢుఁ డయిన
పుత్త్రుఁ డుదయించు నీకు, దుర్బుద్ధి వగుచు
నిట్లు నిందించి యుంట నిర్హేతుకముగ. ౩౧౧

క. శ్వాసోచ్ఛ్వాసంబుల య
భ్యాసము సాజము శరీరభాజనులకు, నే
దోసంబును దద్గ్రహణా
యాస స్వరభంగగతుల నంటదు జనులన్. ౩౧౨

తే. ఆమహాత్ముండు గోభిలుం డటు శపింప,
దేవదత్తుండు తచ్ఛాపతీవ్రవాక్య
భీతుఁడై, యార్తమూర్తి వినీతుఁ డగుచు
వేఁడె ని ట్లని గోభిలు వివిధగతుల. ౩౧౩

క. అయ్యో మహాత్మా! యే మన
నయ్యా! నిన్నుఁబోటి మహాను లక్రోధనులై

యెయ్యెడలఁ సౌఖ్యప్రదము
లయ్యెడ రే, దీని కెంత యలుక వలసెనే? ౩౦౬

తే. సుతునిఁ బడయ కేను సుమహచ్ఛ్రగావేశ
తపనఁ బొగిలినాఁడ దద్దయు మును,
పిట్లు కరుణ మాలి హింసించెదో మఱి
శాపవాక్యలం బ్రశస్తహృదయ! ౩౦౭

ఉ. వినవో కో వేదవేత్తలగు విప్రులు సెప్పఁగ మూర్ఖుఁడైన పు
త్త్రునిఁ గనుకంటె మే లగు సుతుఁ బడయం గనకుంట నాఁగ, నం
దును బహునింద్యకర్ముఁ డబుధుం డగు బ్రాహ్మణుఁ, డట్టివానిఁ జె
ల్చిన నిజ మారయం బశువులఁ గణుతింపఁగవచ్చు, భూసురా! ౩౦౮

శా. భూదేవుం డిల మూర్ఖుఁ డైనయెడలఁ బూజార్హతల్ లేవు, నె
చ్చో దానార్హత లేదు; కర్మవిధులఁ దూరుం డగుఁ శూద్రుఁ డి
ట్లో దా నట్టుల; నింద్యు నాతనిఁ బవిత్రుల్ చేర రానీక యెం
తే దూరంబున నుంతు రాసనవిధిఁ దేవర్షి కార్యంబులఁ. ౩౦౯

ఉ. వేదవివర్జితుండయిన విప్రుఁ డగుఁ గరదుండు రాజు; కెం
తే దయ నట్టివాని క్షుధ దీర్చెడి యన్నము మించి వేఱుగా
నేదియు దాన మీయఁ దగ, దిచ్చిన నారకి యౌను; మూర్ఖుఁ
సాదర మొప్పఁ గర్షకజనంబునఁ గూర్చి మెలంగ మే లగుఁ.

తే. శ్రాద్ధమున మూర్ఖవిప్రునర్చనముకంటెఁ,
గుశచటంబునఁ జేయుటే కొంత మేలు;
మూఢుఁ డెయ్యెడ దానాదిపూజ లందు,
నాయెడ బుధుండు వసియింపనైనఁ జనదు. ౩౧౧

ఉ. వేప ఫలింపఁ దత్ఫలము విందులు కాకులు మెక్కనేకదా!
యాపగిదిఁ దురాత్ములసుఖార్థమె దుష్టవిభూతి చొప్పడుఁ;
ఏపురుషుండు వేదవిదు నిం తలరించు భుజింపఁ బెట్టి, మె
చ్చె పులకింత్రు స్వర్గమున నాతనిపూర్వులు పూర్ణతుష్టులై.

క. కావున గోభిల! నన్నుం
గావుము, మరలింపు శాపకలనత, మే లౌ
జా వట్టి సుతుని కంటెం,
దావక పదయుగళి వ్రాలినాఁడన్ దేవా! ౩_౭౧

ఉ. గోభిలుపాదపద్మములకుం బ్రణతుం డయి వాఁడు గాఢసం
క్షోభము నొంది యశ్రువులు గూరినకన్నుల నిట్లు వేఁడు న
ప్డాభుని గాంచి గోభిలునియాత్మ కరంగె; క్షణార్ధకోపనుల్
శోభనులౌ మహాత్ములు; లశుద్ధులు దుష్టులు కల్పకోపనుల్. ౩_౭౨

చ. జలము స్వభావశీతలము చయ్యన వేఁడిమి యెక్కు నెంతచే,
జ్వలనునితోడియోగమున; దానివియోగము నొంది యెంటనే
చలువ యగున్; మహాత్ములకు శాంతము పూను మనస్సు లట్లు; గో
భిలుఁడుఁ గృపాతరంగిత పవిత్ర వచస్సులఁ బల్కె నిట్టులన్. ౩_౭౩

తే. నావచనకారణంబుగా దేవదత్త!
మూర్ఖుఁడై నీకుఁ బుత్త్రుండు పుట్టుఁగాని,
వాఁడు పిమ్మట మఱియు విద్వాంసుఁడు నగు
నుడుగుము కలంక నీమది విడువు వగపు. ౩_౭౪

తే. ప్రముదితుఁడై దేవదత్తుఁ డా వరము నంది,
యిష్టిని సమాప్తి చేసి యథేష్ట దక్షి
ణల నొసంగి ఋత్విజుల హృష్టుల నొనర్చి
పంపి, యెదురు సూచుచు నుండెఁ బడయ సుతుని. ౩_౭౫

ఉ. రోహిణికిన్ సమాన యగు రూపసి యాతని ధర్మపత్నియున్
రోహిణినామ దాని కతఁడున్ శుభలగ్నమునందు గర్భని
ర్వాహ మొనర్చి పుంసవనవర్తనఁ దీర్చి యలంకరించి యు
త్సాహము మీఱ వేదవిహితంబుగఁ జేసె సమస్తసద్విధుల్. ౩_౭౬

తే. పది నెలలు నిండ రోహిణీవనిత యంత
శుభదినంబున రోహిణీశుద్ధతార

శుభముహూర్తానఁ బ్రసవించె శుభకుమారు,
జననుఁ డతనికిఁ దీరిచె జాతకర్మ. ౩౨౭

క. సుతు దర్శించినపిమ్మట
సుతథ్యుఁ డని నామకరణ మొనరిచి విధిస
మ్మతముగ గర్భాష్టమమున
నతని కుపనయన మొనర్చె నానందమునన్. ౩౨౮

క. శుభలగ్నంబున నతనికు
నభిమానము మీఱ వేద మధ్యాపనఁ జే
య భరితహర్షుఁడు బ్రహ్మ
ప్రభువుం డా మహానివసుఁడు ప్రారంభించెన్. ౩౨౯

క. గురుఁ డటు పాఠము సెప్పిన
మరలం బాఠం బనండు, మాటాడఁడు వా
తెఱువఁ డొకించుక, పెదవుల
నద విప్పఁడు, నాల్క యింత యాడింపఁడునో! ౩౩౦

క. చెప్పినపాఠము చెవులన్
జొప్పడెనో లేదో తెలియఁ జొప్పడదు మదిం
జెప్పర మగు మఱపుం డెర
గప్పినవడి మూఢుఁడట్లు కనఁబడు నెపుడున్. ౩౩౧

క. బ్రతిమాలు నొకప్పుడు పిత
కతిపయసమయముల విసివి కసరుం దిట్టున్
స్తుతియించు బుజ్జగించును
మతిఁ దూలినఁ గొట్టు నొక్కమాఱు కుపితుఁడై. ౩౩౨

క. ఎన్నివిధంబులఁ జెప్పిన
సున్నయ్యెఁ బ్రయత్న మెల్ల, సుంత యుతథ్యుం
డన్నిగమంబులఁ బలుకం
బన్నింపఁడు జిహ్వ; వచ్చెఁ బండ్రెం డేండ్లన్. ౩౩౩

క. విధిపూర్వకముగ సంధ్యా
విధి నిర్వర్తింప జాతవేదసమర్చా
విధి సేయఁగ నేరం డను
కథ విప్రుల ఋషుల జగతిఁ గలయం బ్రాఁకెన్. ౩౩౫

క. ఎం డెం దరిగె నుతఘ్యం
షం డెల్లరు నవ్వ సాగి ప్రాతనిఁ గంచున్
నిందింతురు తలిదండ్రులు
బందుగు లందఱు నిజేచ్ఛఁ బదురుము రతనిన్. ౩౩౬

ఉ. ఇంత శోకుండు పుత్రుఁడు జనించుటకంటెను మేలు పంగు న
త్యంతము సంధుఁడైన సుతుఁ డంచు వచింపఁగఁ దల్లి దండ్రు తో
యెంతయు నావచస్సు లెరియింపఁగ వాఁడు విరక్త బుద్ధి వి
శ్రాంత సురాపగాతట సుశాంత తపోవనిఁ జొచ్చె నిష్ఠమై. ౩౩౭

క. ఉటజం బొక్కటి గంగా
తటమునఁ గల్పించి దివ్యతరముగఁ దా న
చ్చట వనవృత్తిని నివసిం
చుటకున్ నిశ్చయ మొనర్చి చొప్పడె దీక్షన్. ౩౩౮

తే. బ్రహచర్యంబు పర మగు వ్రతము నాకు
సత్యమే పల్కువాఁడ, నసత్య మింత
పలుక కుండెద, బలితంపుఁ బ్రతిన లంచు
స్థిరమనీష సంకల్పంబు చేసె నతఁడు. ౩౩౯

సీ. వేదాధ్యయన మన్న విధి యెఱుంగఁ డొకింత,
జపవిధానము నేర్వఁ జాలఁ డింత,
దైవతధ్యానంపు దారి యగమ్యంబు,
రాదు వానికిఁ దదారాధనంబు,
నాసనవిధ మన్న నాదియుఁ గానరాఁ,
డింత ప్రాణాయామ మెఱుఁగ లేఁడు,

వినఁడు ప్రత్యాహార మనుపేరు కలదైన,
భూతశుద్ధి యొనర్చు పోలు వెఱుఁగఁడు,
మంత్ర మెఱుఁగఁడు, కీలకమహిమ నేని,
మొదలు గాయత్రి పలుకు టేమో యెఱుంగఁ,
డాచమన మన్న స్నానంబు శౌచ మన్న
నేమొ యెఱుఁగఁడు, మఱి చేయు నేమి తపము! ౩౩౯

క. ప్రాణాగ్నిహోత్రమును బలి
దానము సంధ్యార్చనంబు తదుపరి సమిధా
ధానము హోమము నతిథిస
మ్మానమునము నతని కింత యాడవు మదిలో. ౩౪౦

శా. ప్రాతర్సాయల నేలు కాంచి యెటులో ప ద్ధోమి మంత్రక్రియా
వీతస్నాన మొనర్చి గాంగధునిలో విన్యాధిమధ్యాన ఖ
ద్యోతుం డెక్కెడువేళ నాఁకటిసాదన్ దూలంగ సర్వాంగముల్
చేతం జిక్కిన పండ్లు వన్యములు భక్షించున్ గతాతంకుఁడై. ౩౪౧

క. సత్యం బెప్పుడుఁ బల్కు, న
సత్యం బొకవేళ నాల్క సడలదు; దానన్
సత్యాత్ముం డని జనములు
ప్రత్యేకము పేరు పెట్టి పలికిరి వానిన్. ౩౪౨

క. ఒక్కని కహిత మొనర్పం,
డొక్కనికిన్ హితము సేయ నూకొనఁ డెన్నం,
డొక్కట సుఖనిద్రం గొను,
నొక్కఁడ చింతించు నిర్భయుం డయి యిటులన్. ౩౪౩

ఉ. ఎన్నఁడు నన్ను మృత్యువు వరించుఁ, దరింతును దుఃఖవార్ధిఁ? బ్ర
సన్నశతాత్మజీవనముకన్న నిసీ! మరణంబు మేలు, మా
ఖ్యోన్నతి కెల్ల దైవముదురూహమె కారణ, మేమి సేతు? నా
యున్నతవిప్రజన్మము వృథోద్యత మయ్యెను విద్య యంటమిన్.

క. పాలం బిదుకని ధేనువు
లీలం, బుష్పించియుఁ ఫలింపనితరువుం
బోలెన్, వంధ్యాతరుణీ
శ్రీలుం బలెనే, వృథా కులీనతఁ గంటిన్. ౩౮౫

ఉ. నే నిటు లేల దైవమును నింద యొనర్చుట? పూర్వజన్మలో
దానము సేయ విప్రుఁడు వదాన్యుఁడు కోరెనొపుస్తక, మ్మనూ
నానులఁ జేయ ఛాత్రుల, సుసాధుధరాసురసేవ సేయ, సుం
తేనిఁ దపస్సు తీర్థముల నెన్నఁడుఁ జేయ, శఠుండ నైతిఁ జా. ౩౮౬

తే. వేదశాస్త్రార్థపారగుల్ విప్రపుత్రు
లెంద ఱున్నార, లొకఁ డేన మందమతిని,
దైవయోగంబు నే మందుఁ దపము సేయు
టేమొ యెఱుఁగను సాధనం బేమి నాకు? ౩౮౭

క. దైవమె తప్పం దలఁచిన
చో, వృథ పురుషశ్రమంబు క్షోణీస్థలిలోఁ,
గావునఁ బరంబు ధ్రువముగ
దైవమె, ఛీ! పౌరుషప్రదర్శనము వృథా. ౩౮౮

తే. హరి హరు లజుండు శక్రాదు లఖిలసురులు
కాలవశగులు, కాలమ్ము గడవరాదు;
పవలు రే యిట్లు బహుభంగి వాఁడు పొగులు
జాహ్నవీతీరపావనాశ్రమమునీడ. ౩౮౯

చ. నలిఁ బదునాలుగేండ్లు విజనం బగు తద్వనభూమి నుంతయున్
సలుపక యే తపంబు యజనంబు జపం బటు కాలయాపనం
జలుప, నబద్ధ మాడఁ డను సద్యశ మొందు జనాళి వ్యాప్తిఁ గాం
వెలసెను సత్యమే వ్రతము వీని కటంచు వచింప నందఱున్. ౩౯౦

తే. అట్టిచో నొక్కనాఁడు వేటాడువాఁడు
శరశరాసనధారి నిషాదుఁ డొకఁడు

సమయమున్యుండు హానవిశారదుండు
క్రూరరూపుఁ డా వనభూమిఁ జేర వచ్చె. 3౫౪

క. కోలం బొక్కటి మేనం
గీలింపంబడి కిరాతు కెడపిన వాలుం
గోలం బిట్టార్చుచు భయ
లోలితమై మానికడకు ద్రుతగతిఁ బాఱెన్. 3౫౫

క. వడవడ వడఁకుచు నెత్తుటఁ
దడిసిన దేహంబుతోడ దైన్యాకులమై
తడఁబడు నడుగుల వెఱఁ బ
ర్విడెడు వరాహంబు దృష్టిపీథిం బడఁగా. 3౫౬

ఉ. ఆ ముని మానసంబున దయారస మొక్కటఁ బుట్టి యుద్భ్రతా
యామతఁ బొంగి వెల్లువయి యాఁగక పాఱ వికంపమానుఁడై
మై మయి లేక పల్కుతనమాట యెఱుంగక యుచ్చరించె ధీ
ధామము వాగ్భవాభిధసుధాకరబీజము మంత్రరాజమున్. 3౫౭

క. ఆ సారస్వత శుభ బీ
జాసాదన మత్రుతంబు నజ్ఞాతం బా
భూసురునకైన సద్యో
భాసురమై నోట దైవవశమున వెడలెన్. 3౫౮

తే. అట్లు వెడలిన బీజమహాత్మ్య మింత
యెఱుఁగఁ, డాపూని వగ నొందు నెడఁదఁ గరుణ;
దారి గానక కోలంబు తత్తరమున
నం దొకానొక పొదమాటు కరిగి డాఁగె. 3౫౯

ఉ. అంతఁ బరక్షణంబుననె యచ్చటికిం బరతెంచె నాశ్రమో
పాంతము దాసికై వెదకువాఁడు నిషాదవిభుండు విల్లు క
ర్ణాంతము లాఁగి పట్టిన శరంబున నొప్పి కరాళగాత్రుఁడై
యంతకుమూర్తిఁ దాల్చి యెఱుపారెడుకన్నుల సంజ పర్వఁగా.

క. ఒక్కెండ కుశాసనమున
నక్కడఁ సత్యవ్రతాఖ్యుఁ డాసీనుండై
యొక్కెడఁ గానంబడినన్
మ్రొక్కి నిషాదుండు పలికె మునిపుత్త్రునితోన్. ౩౫౮

క. నా యేటు తినినకిటి యది
యే యెడఁ జనెనయ్యా! చెప్పు, మెఱుఁగుదును నిజం
బే యాఁడెడి వ్రతి వని, య
య్యా! యాఁకట నాకుటుంబ మటమటలాడున్. ౩౫౯

క. విధియే యిది నావృత్తిగ
విధియించె, నిజంబె నేను విను పల్కెద, నె
వ్విధమున నైన శుభాశుభ
విధానములఁ బోష్యరక్ష విహితము కాదే! ౩౬౦

తే. నీవు సత్యవ్రతుండవు, నిజము పలుకు
శరహతంబు వరాహ మేచాయఁ బాఱె?
నాకుటుంబ మాఁకటిమంట నవయుచున్న,
దార్త్తి నడఁగెద, నడఁ బల్కు మవనిదేవ! ౩౬౧

చ. మఱిమఱి యిట్లు తన్నుఁ బ్రతిమాలఁ గిరాతుఁడు, విప్రుఁ డాత్మలోఁ
జిరతరచింత చేసె, నెటు చెప్పుదుఁ, జెప్పనిచో వ్రతంబు రూ
పఱుఁ, గలచొప్పు చెప్పిన క్షుధార్తుఁ డితండు శరవ్యధార్త సూ
కరము వధించు, నిప్పు డెది కర్జము, పల్కుటొ, పల్కకుండుటో!

క. సత్యము హింసాయుతమేన్
సత్యము కా, దనృతమైన సంగతదయమై
సత్యంబ, జనహితంబే
సత్యం బటు గాక హత్య సత్యం బగునే? ౩౬౩

క. ఒకరికి హితమిం దది యిం
కొకరికి నహితము విరుద్ధయోగముచే, నే

నీఁక నిపు డే మనువాఁడ
వికలము గాకుండ ధర్మవిధియున్ వ్రతమున్ ? 316

ఉ. అబుసమిచంద్రుఁ డట్టుల నిజాత్మ విచార మొనర్చుచున్, మని
ర్ధారణ చేయఁజాల కిది ధర్మ మటంచు నిరుత్తరుండుగాఁ
బాఱుఁడు, బాణవిద్ధకిటిపాటు కనుంగొని యప్రయత్నమె ము
చ్చారణచేసె నే శుభవచస్సు కృపాకలితార్ద్రచిత్తుఁడై. 317

ఉ. దాన నిజాద్యబీజ సముదాహరణమ్మునఁ జేసి దేవి ప్ర
ధానికవిద్య ప్రీత యయి తత్క్షణమే దయచేసె విద్య. స
న్మానిదురాప మేది యది మానసవీథిఁ బరిస్ఫురించె, ఫం
దోనిధి నాకుజాతునకుఁ దోఁచినటుల్, కవి యయ్యె నాతఁడున్. 318

తే. ఎదుర ధృతచాపుఁడై యున్న యెఱుకుఁ గాంచి
యొక్క గీతంబు వ్రాకుచ్చె నుత్తరముగ
సత్యకామాఖ్యుఁ డా ద్విజసత్తముండు
పరమధర్మాత్ముఁ డతిదయాపరత నిట్లు. 319

తే. “ఏది చూచునో యది పల్కలేదు సుంత !
యేది పలుకునో యది చూడలేదు నిక్క;
మయ్యయో వ్యాధుఁడా ! స్వకార్యార్థి వగుచు
నేల మఱిమఱి ప్రశ్నింతు విట్లు వృథయు?” 320

క. అది విని వ్యాధుఁడు సూకర
పదముం గన్గొనెడియాశ వదలె; ముని జగ
ద్విదితుం డయ్యెఁ గవీశ్వర
పదభాజనుఁ డీతఁ డపరవాల్మీకి యనన్. 321

క. వెండియు సారస్వతము న
ఖండవిధిన్ జపము దీర్ఘకాల మొనర్చెన్
బండితకవి యని యతఁ డు
ద్దండఖ్యాతిన్ రహించె దశదిక్కులలో. 322

క. ప్రతిపర్వంబును బ్రాహ్మణు
లితనియశోవిశదగీతు లెసఁగింతురు సం
స్తుతియింత్రు మహాను లాతని
నతి విస్తృతిఁ బాడి యీశుభాఖ్యానకముల్. 32౧

తే. మున్నుతథ్యుని నెవ్వారు మూఢుఁ డనుచుఁ
బదరి వదలిరో కఠినులై, వారె యిపుడు
గారవం బొప్ప నిలు సేర్చి గౌరవించి;
రట్లు గావున సేవింపు మంబ నధిప! 32౬

శా. దేవీయజ్ఞము శాస్త్రచోదితవిధిం దీపింపు మాశక్తియే
యీవిశ్వంబున కాదికారణ మదే యిచ్చున్ మనోభీష్టముల్,
భావింపన్ స్మరియింప మ్రొక్క లిడఁగన్ వర్ణింప ధ్యానింపఁగా
సేవింపన్ భజియింప భక్తిమెయి నర్చింపంగఁ గీర్తింపఁగా. 325

ఉ. దీనుల నార్తులన్ వికలదేహులఁ గాంచి, క్షుధావ్యథారుజా
ధీనులఁ గాంచి, క్షుద్రుల నతృప్తులఁ గాంచి, యశక్తులన్, దరి
ద్రాణుల నాధిపీడితులఁ ద్రస్తుల మూర్ఖులఁ గాంచి, పుష్టిధీ
హీనులఁ గాంచి కాంచి యజితేంద్రియవృత్తులఁ దుష్టచిత్తులన్.

ఉ. సంతతవేదవాదులను సంపదుదాత్తులఁ జూచి, శౌర్యదు
ర్దాంతులఁ బుత్రపౌత్రపరిరాజితసౌఖ్యులఁ జూచి, దీర్ఘవి
శ్రాంతయశస్కులన్ గని, సులక్షణలక్షితులన్ వశీకృతా
శాంతుల రాజ్యశోభనవసంతుల శాంతులఁ జూచి చాంతులన్.

క. వారలు మును శ్రీఁ గొలువని
వారలు, మఱి కొలిచియున్న వా రని వీరల్
వేఱుగ వ్యతిరేకాన్వయ
పూరణ ననుమానరచన బుధుఁ డెఱిఁగికొనున్. 32౮

తే. పుణ్యములగోష్ఠి లోమశమునిముఖమున
విన్న దేవీమహాత్త్వపవిత్రచరిత

చెప్పితి నృపేంద్ర! యిది నల్పి చిత్తశుద్ధి
నీవు నర్చింపు శ్రీదేవి నియతి సతము. ౩౭౬

దేవీయజ్ఞవిధానము

వ. జనమేజయుం డిట్లనియె. ౩౭౭

శా. స్వామీ! పల్కుము దానియజ్ఞవిధి నిర్వర్తింతు సద్బుద్ధితో
నేమంత్రంబొ, సపర్య యేవిధమొ, యేద్రవ్యసంజాతముల్
హోమార్థంబు సమీకరింపవలె? విప్రౌఘంబు సంఖ్యాక్రమం
బేమార్గం బగు? నెట్టిదక్షిణల నర్పింపదగుం జెప్పవే! ౩౭౮

వ. వ్యాసుం డిట్లనియె. ౩౮౦

క. దేవీయజ్ఞవిధాన మి
దే వర్ణింతు విను మందు నెఱుఁగం బోలున్,
త్రైవిధ్యము సత్త్వరజో
భావంబులఁ దమముచేతఁ బ్రథమమునన్. ౩౮౧

తే. మునులకు సాత్త్వికయజ్ఞము,
జనపతికులములకు రాజసంబున్, రక్షో
గణమునకుఁ దామసంబును
గుణరహితము జ్ఞానమయ మగు విముక్తులకున్. ౩౮౨

తే. పుణ్యకాలంబునఁ బవిత్రభూమి న్యాయ
మార్గచిత విత్తమున వేదమంత్రవిధుల
శ్రోత్రియబ్రాహ్మణులు చిత్తశుద్ధి కలిగి
శ్రద్ధమైఁ జేయుయాగంబు సాత్త్వికంబు. ౩౮౩

తే. వలయు మంత్ర క్రియా ద్రవ్యములను శుద్ధి
మూఁట; నటుగాని కల్గదు పూర్ణఫలము;
సుకృతమేని నన్యాయవిత్తకృతమైన
రాదు యశ మిందుఁ, బరమందు గాదు సుఖము. ౩౮౪

సీ. అమయుం బాండవరాజసూయ మిలఁ బ్రత్యక్షప్రమాణం బను
త్తమయజ్ఞం బది, భూరిదక్షిణ సమాప్తంబయ్యె, సాక్షాత్త్రివి
క్రముఁ డా కృష్ణుఁడు దానినేత, క్రతుకర్మప్రాభవుల్ మానిస
త్తము లాసాదితసర్వవిద్యులు భరద్వాజాదులే ఋత్విజుల్. ౯౬

శా. కానీ యజ్ఞసమాప్తియైన నెలయుం గాకుండనే వారికిం
బోనేపోయెను రాజ్యలక్ష్మి, సభ నీచుం బొందెఁ దల్సాధ్వి: బల్
కానం జేష్టపడ నయ్యె; మాత్స్యుకడ డాఁగన్ వచ్చెఁ; బాంచాల
స్త్రీనారీమణి యందుఁ గీచకుఁచే: బ్రెప్పాల్ వడెన్ మెండియున్.

క. ఎం దేగె ద్విజాశీశ్శుభ,
మెం దేగెను యజ్ఞసుకృత, మెందేగెను గో
విందునియెడ భక్తియు, సభ
యందున జడ పట్టి యీడ్చునపు డాసాధ్విన్. ౯౮

ఆ. వలయుఁ దలఁప ధర్మవైగుణ్య మిందులోఁ
గర్త ధర్మసుతుఁడె గాక, నేత
హరియె యౌనుగాక, యయినను భవితవ్య
మిట్టు లయ్యె నంచు ననఁగఁ దగదు. ౯౯

క. భవితవ్య మయిన దంచున్
బ్రవచింపఁ బ్రమాణపాళి వ్యర్థం బగు వే
దవిధుల్ సాధనములు ధ
ర్మవచనము లుపాయములును మాయును వితథమై. ౧౦౦

తే. దైవము నుపాయమును రెండుఁ దలఁప నగును
కర్మ విపరీతఫలసిద్ధికలది యయినఁ,
గర్మలో లోప మెద్దియో కల దటంచుఁ
బ్రాజ్ఞు లగువార లూహింపవలయు మొదల. ౧౦౧

తే. కర్మయున్ బహువిధ మంత్రము కర్మవిదులు;
కలుగు భేదంబు శ్రీయుఁ, జేయుక ర్తయందు,

నుండు భేదంబు మంత్రప్రయోగమందు,
ద్రవ్యమున సాధనముల భేదంబు కద్దు. ౩౯౦

సీ. ఎఱుఁగవె మున్ను జిష్ణుఁడు వధింపఁగ బ్రహ్మఁగ విశ్వరూపు, వాఁ
డసురుగ మాతృపక్షకుశలార్థము తత్క్రియఁ జేయుచుణ్ సురా
సురులకు స్వస్తి యన్న, దనుసూతులవృద్ధిని గాంచి, క్రుద్ధుఁడై
హరి నఱికండె వజ్రమున నాతనిఁ; గ ర్మకలాప మీయెడణ్.

కం. అటు గాక సేయ రోషో
ద్భటుఁడై ద్రుపదుండు మఖము భారద్వాజుణ్
బటిమ వధించుసుతుం గన
ఘటియింపడె వేది నొక్క కన్యామణియుణ్! ౩౯౩

ఆ. మున్ను దశరథుండు పుత్రేష్టి నొకపుత్రు
నొదవఁ జేయ నల్వు రుదితు లైరి;
విహితరీతిఁ జేయు విధి సిద్ధతర మాను
విపరిణామకరు లవిధికృతములు. ౩౯౪

తే. ధర్మపుత్రుండు ఋతవాది, ద్రౌపది సతి,
భ్రాతలు శుభాంగు లైన దుర్ద్రవ్యయోగ
దోషమునఁ జేసి చేడ్పాటు తొడరె, వారి
రాజసూయంబు విపరీతభాజనముగ. ౩౯౫

సీ. కానఁగ వత్స! సాత్త్వికమఖం బది దుర్లభ మెందు, దానిపై
ఖానసమానిసత్తములె కా కొరు సేయ నశక్తులయ్యు, యె
వ్వానికి న్యాయసంచితము వన్యము ఋష్యము సంస్కృతంబునో
బోనమొ, వాఁడె సేయు విధిపూర్వకరీతి వియూపసైఖరిణ్. ౩౯౬

తే. రాజసములు సయూపముల్ ద్రవ్యబహుళ
సంస్కృతమ్ములు నభిమానసంయుతములు
క్షత్రవైశ్యుల కగుఁ; దామసంబు లింక
మాదకములు క్రోధనమానుపాదుల కగు. ౩౯౭

ఉ. మానసయజ్ఞ మెన్న నసమానము దానిని మోక్షకాంక్షులై
మానుగ సర్వసాధనసమగ్రముగా నొనరింప నేర్తు, రే
దేనియుఁ దక్క-యజ్ఞముల నించుక న్యూనత యావహించు ద్ర
వ్యానకొ శ్రద్ధలోనొ క్రియయందునొ ఋత్విజసంపదాప్తినో! ౩౯౮

క. ముందు మనశ్శోధన చే
యం దగు; వీతేంద్రియార్థ మగు నెడ నది యె
న్నం దగ మగు శుచి యని; దా
నం దేహముఁ బూత, మట్టి నరుఁ డధికృతుఁడౌ. ౩౯౯

సీ. వాఁ డంతఁ గల్పించు బహుయోజనాయామ
మండపరాజంబు మనసునందు,
స్తంభములై యజ్ఞీయ తరుదారు కృతములై
మెఱుఁగారు విస్తారమేఖల లయి,
యందు వేది నమర్చి యగ్నులు మనసుచే
సుష్ఠుగా నచటఁ బ్రతిష్ఠ సేసి,
ఋత్విగ్వరణ మంత నిచ్ఛలోఁ గావించి
భావించి వేదవిద్బ్రాహ్మణులను,

బ్రహ్మ నధ్వర్యు హోతను గ్రమమునఁ బ్ర
దాత నుద్గాతఁ బ్రతిహర్తఁ దక్కఁగల్గు
ఋత్విజుల సభ్యులఁ శాస్త్రరీతిఁ బిల్చి
వారిఁ బూజింపవలె మనెఁ బరమ భక్తి. ౪౦౦

సీ. ప్రాణపంచక మందుఁ బంచాగ్నులై యొప్ప,
వానిఁ బ్రతిష్ఠింపవలయు వేడ్క,
ప్రాణాగ్ని యే గార్హపత్యాగ్ని యగు, నం ద
పాన మాహవనీయవహ్ని యగును,
వ్యానంబు దక్షిణవహ్ని యౌ, నవసథ్య
కాగ్ని యౌచు సమాన మమరు నందు,

పక్షస్థ లెల్ల మహాన సంజ్ఞక వహ్నిగా
వెలయ సుత్కటదీప్తి వెలుఁగు నదియు,
ధ్యానమంతట మనసుచేఁ బరమశుభము
నిర్గుణం బగు ద్రవ్యంబు నిర్మలముగ,
మనసె యగు హోతయును యజమానుఁ డంమ,
యజ్ఞపతి నిర్గుణబ్రహ్మమై వెలుంగు. ౯౦

తే. ఆ పరబ్రహ్మరూపిణీ, యాదిశక్తి,
నిర్గుణాకార, నిర్భేదనిధివిధాత్రి,
యెల్లకును నేది యాధార, మేది యెల్ల
యెడల వ్యాపించి పూర్ణయై యొప్పుఁగు తల్లి. ౯౦౨

ఉ. దాసని బ్రహ్మనిష్ఠ నెడఁదం బదిలం బొనరించి, యాంతర
ధ్యానసమాప్తపూర్వ మగు ద్రవ్యసమస్తము దానిప్రీతికై
ప్రాణకృశానుకీలలఁ దిరంబుగ హోమ మొనర్పఁగావలెన్,
మానసదివ్యరంగము సమగ్రవిభాప్రవిభాస్వరంబుగా. ౯౦౩

చ. ఆయెడ వాఁడు చిత్తము నిరాశ్రయముం బచరించి, రాజ! ప్రా
ణాయమనంబు సేసి, వెలయంగఁ దదగ్నులఁ గుండలీముఖ
స్థాయితవీథి వెంట వసుసం ప్రవిలాప మొనర్చి, కూడఁగాఁ
జేయును బ్రేల్చి బ్రహ్మపదసిద్ధ మహేశ్వరి శాశ్వతం బరన్. ౯౦౪

క. తాను స్వయం బీశ్వరి యను
స్వానుభవం బతని కపుడు సాక్షాత్కృతమౌ
తానై యాపరమేశ్వరి
కానంగా నగును వానికన్నుల కరుదై. ౯౦౫

మ. అతఁ డవ్వేళ నిరాకులం బయిన చిత్తాబ్జంబునందున్ సమా
హితతుండై నిజయోగనిష్ఠ మెయి స్ఫూర్తిం గాంచు ధ్యానంబునన్
వితతుండై తను నెల్లభూతములలో వీక్షించుచున్, సర్వభూ
తతతిం దాఁ దనయందుఁ గాంచు; నిటు లందం జాలు భూనాయకా.

శా. భూతాత్మం డతఁ డెప్పు డయ్యె, నప్పు డోపుఁ సచ్చిదానంద శ్రీ
మాతం జూడఁగ నాత్మలో; నపుడు బ్రహ్మజ్ఞానియై వెల్గు; మా
యాతూలంబు సుదగ్ధమై, మిగిలెడిన్ బ్రారబ్ధ మొండే తనూ
పాతార్థిం; గృతకృత్యుఁ డాతఁ డిక జీవన్ముక్త మూర్ధన్యుఁడున్.

కం. దేహం బుడిగినవాఁ డా
రోహించును మోక్షపదము రూఢిగ రాజా!
శ్రీ హైమవతిన్ శోభన
దేహన్ భువనేశి నెమ్మనిన్ గొల్వఁ గదే! [illegible]

కం. కడఁగి సమస్తవిధంబుల
నుడుగక గురువాక్యసరణి నూఁకొనుచు శివన్
నొడువుచుఁ దత్కథలే చెవి
నిడుచున్ మంతన మొనర్ప నెసఁగు శుభంబుల్. [illegible]

మ. నృపవరా! వేదము స్వర్గకాములకు నగ్నిష్టోమయాగంబు చే
య విధించుంగద, దానఁ జేపడినపుణ్యాం బద్ది క్షీణింప వాఁ
డు వడున్ మృత్యుముఖంబునం దనుచు నంద్రుంగాదె తత్త్వజ్ఞు; ల
ట్లవుటం దక్కుమఖంబు లన్నియు క్షయాయత్తప్రయోగంబులో!

కం. మానసయజనం బొక్కటి
యే నిర్వర్తించినట్టు లెసఁగించినచో
నేనాఁ డక్షయఫల మగు
నానిశ్శ్రేయసము గూర్చు ననితరసమమై. [illegible]

తే. కాని, జనమేజయా! యసమాన మట్టి
మానసమఖంబు సాధింపఁ బూనుపొంటె
జయము కాంక్షించు రాజులే చాల, రీవొ
సలిపినాఁడవు తామససర్పమఖము! [illegible]

శా. నీవైరంబు దురాత్మతక్షకునితో నిర్వాహితం బయ్యె, నీ
చే వహ్నిన్ దహియింపఁ ద్రెళ్ళిపడి చచ్చెన్ వ్యాళముల్ కోట్లుగా

దేహీయజ్ఞ మొనర్పఁ బూను మఁక విస్తీర్ణ క్రియాకాలపం
క్తివిష్టం బెపె చేసె మున్ను విశదమై సృష్ట్యాది, రాజోత్తమా!

మ. కలరు ద్విజోత్తముల్ శుభమఖక్రియ దక్షులు వేదవిత్తముల్
కలితతదర్థబీజపకస్త్రవిశారదు, లట్టివారలన్
బిలువఁగ నంపి కర్త వయి వేగమ తీర్పు మఖంబు, వారి కి
స్త్రులఫల మిచ్చి నీజనకు దుర్గతినుండి సముద్ధరింపరా! [illegible]

సీ. విప్రాపమాన ప్రవృత్తి పాపము పెంగఁ
గడు దుర్ఘటము నరకప్రదంబు,
శాపజం బగు దోషసంప్రాప్తియును దానిఁ
గూడె నీతండ్రికిఁ దోడుపడుచు,
నందుపై సర్పదంశాయాత దుర్మర
ణావాప్తియును సయ్యె నతని కంక,
నదియునుంగాక వాఁ డంతరాళపుఁ జావు
చచ్చెను నింద్యం బశస్తతరము,

తే. కాదు కుశసంస్తరంబులు కలుగుభూమి,
గాదు సంగరక్షోణిని, గగనమందు
సౌధతలిఁ దండ్రి కంతంబు జాత మయ్యె,
లేదు దానంబు, స్నానంబు లేదు గంగ! [illegible]

కం. ఇవి యన్నియు నొక్కొక్కటి
ప్రవణంబులు నరకగహ్వరంబునఁ ద్రోయన్,
ధ్రువము, కపూణము లన్నియుఁ
గవిసెన్ నీతండ్రిమరణకాలమున నృపా! [illegible]

కం. కాలము తఱియుట యెఱిఁగిన
వేళన్ దాఁ బ్రాణి యెందు వెలసినఁ బొందం
గా లేకయు సాధనములు
సోలుచు వివశార్తిదుఃఖదోషుం డగుచున్. [illegible]

క. "ఈ దేహము కేవలభూ
తోదిత, మది యెటులు సన్నునులు కేల? పడం
గాఁ దలచినఁ బడుఁగావుత,
వా దేటికి నన్యయుండ బ్రహ్మను నాకున్ ! ౪౧౮

తే. "నేను ముక్తుండ, సంసారిఁ గాను, సర్వ
థా సనాతనుఁడ, శరీరధారణంబు
కర్మచేఁ బ్రాప్త మయ్యె; భుక్తంబు లయ్యె
నవియును సుఖదుఃఖఫలానుభవమువలన. ౪౧౯

క. "ఘోరము భయదము నగుసం
సారం బను సంకటమ్ము సమసెను, నిటుపైఁ
గారింపలేదు న;" న్నను
ధీరధృతిం దనువు విడిచి పోయిన నేనిన్. ౪౨౦

తే. అట్టిస్మృతి స్నానదానశూన్యంబె యయిన
ముక్తుఁ డగు వాఁడు జన్మసంసక్తివలన;
నాపరాకాష్ఠ యోగులకైన నరిది;
యయ్యొ! మీతండ్రి చన్నది యట్లు గాదు. ౪౨౧

క. విన్నంతనె ద్విజశాపం
బన్నా! తన దేహమందు నత్యంత మమ
త్వోన్నతి నభిమానంబుం
బన్నె, స్నిగ్ధేద మింత పడయఁడు మదిలో. ౪౨౨

ఉ. నాతను వుజ్జ్వలం బిది యనామయమై వెలుఁగొందు, రాజ్యము
న్యాతసమస్తకంటకమునై విలసిల్లెడి, నింతలోనె శో
భాతత మీ శరీరము నిపాతమహార్తికి నిచ్చగింతునే?
హా! తలపోయఁ దక్షకవిషాగ్నిచికిత్స యసాధ్య మౌనొకో! ౪౨౩

క. జాంగలికులఁ బిలిచి, పనిచి
జాంగళ మణి యంత్ర తంత్ర మంత్రజ్ఞుల స

ర్వాంగము పరిరక్షింపం,
బ్రాంగణభువి నిల్పిరిడీ మహాసైన్యంబుల్. ౪౨౪

క. ఇట్టుల నాజ్ఞాపించుచు
నెట్టన నురుసౌధ మొండు నిర్మించి, తదీ
యాట్టాలికోపరిస్థితి
నెట్టులనే నాత్మరక్ష నెంచెం జేయన్. ౪౨౫

క. ఆ నరనాథుం డిట్టుల
స్నానము దానమ్ము దేవిస్మరణము దైవ
ధ్యానంబు భూమిశయనము
గానీ లేకుండ మోహకంధిపతితుఁడై. ౪౨౬

క. కలియోగంబున పూని
చ్ఛలనం బొనరించి యతఁడు సర్పవిషజ్వా
లల బ్రమగ్గె సౌధతలిఁ; ద
త్ఫలితముగ నవశ్యనరకవాసం బబ్బెన్. ౪౨౭

తే. ఓయి జనమేజయా! తండ్రి నుద్ధరింపఁ
బూనుకొనవోయి; పాపకపూయ నరక
వార్ధిలోనుండి శ్రీదేవిపాదపద్మ
సేవ యను తెప్ప గూర్చి ప్రసిద్ధఫణితి. ౪౨౮

తే. అమితతేజస్వి వ్యాసమహర్షి పలుక
లాలకించుచు జనమేజయాధిపుండు
బాష్పముల్ జడి వార నవారితముగఁ
గనుల, నిటు పల్కె గద్గదకంఠుఁ డగుచు. ౪౨౯

క. ఛీ! నా యీ బ్రదు కేటికి,
మానాయన నరకకూపమగ్నుం డైనన్ !
నే నేమి చేయ నాతఁడు
పూనన్ మఱి స్వర్గసుఖము, పోల్చి తెలుపవే. ౪౩౦

మ. వెండియుఁ జక్రినావు ప్రభవిష్ణుఁడు సర్వలోకనా
థుం డొనరించె యజ్ఞ మని, శ్రోడయు యూతని కేద్విజేంద్రు లం
దుండిరి? వేదతత్త్వవిదు లొప్పిరి ఋత్విజు లౌచు నెవ్వ? రి
వ్వాం డన కెల్ల దెల్పు మది నూఁదఁగఁ దద్విధ మెల్ల సాంగమై.

తే. హరి యొనర్చిన యంబికాయజ్ఞవిధము
నీవు వివరింప విని సమాహితుఁడ నగుచు
నేను గావింతు విధివిధానాన దాని,
ననుచు జనమేజయుఁడు వేఁడ వ్యాసుఁ డనియె. ౪౯

కం. నరవర! వివరించెద విను.
పురుషోత్తమకృత మహాధ్వ పుణ్యాధ్వర వి
స్తరకథ శ్రద్ధాళుఁడవై;
పరమాద్భుత మది తలంప భగవత్పరముల్. ౫౦

కం. దేవి యనుజ్ఞం గొని యా
మూవురు మూర్తులును శక్తిపూర్వులుగాఁ బుం
భావం బూని విమానము
పై వార్ధిన్ మరల దరిసి వచ్చిరి ప్రీతిన్. ౫౧

కం. ఘోరం బగు వారాన్నిధి
వారిజనాభుండు భవుఁడు వారిజభవుఁడున్
జేరి సృజించిరి ధర వే
ర్వేఱుగఁ దమస్థానములును విడిదలకొఱకై. ౫౨

తే. అందు నాధారశక్తి యనంత మచల
మైనయది పరదేవి స్వరూపమ్ముగా వి
మోక్షణ మొనర్చె; ధర దానఁ బుట్టి వెలసె
లెస్సగ మధుకైటభుల మేదస్సుతోడ. ౫౩

తే. అట్లగుట భూమి మేదిని యనఁ బరంగె,
ధారణమ్మున మఱి దాని ధర యనంద్రు,

విపుల విస్తారయోగతఁ బృథివి యుండ్రు,
మహి యనంగ మహీయస్త్వమహనామఁ బరగె. ౨౩౭

వ. మఱియు నవ్వసుంధర, యపారంబు నగాధంబు నగు నకూపారనీరం బున బ్రుంగిపోక నిలువ, సహస్రఫణుం డగు నాదిశేషునిచేఁ దలం దాల్పఁ బడియె. ౨౩౮

క. ధరణిన్ ధరియించుటకై
గిరివిస్తర మొనరె, లోహకీలము కట్టిన్
భరియించురీతిని; మహీ
ధరసంజ్ఞ యొసంగె శైలతతికిన్ దానన్. ౨౩౯

క. అందున్ మేరువు కన్నుల
విందై బహుయోజనాళి విస్తరమై వె
ల్గొందున్, స్వర్ణమయము, మి
న్నంటెడి, మణిశృంగ శోభ దక్షిణామంబై. ౨౪౦

వ. విశ్వస్రష్ట యగు బ్రహ్మకు, మరీచి, నారదుఁడు, అత్రి, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, ననఁ బ్రథితు లగు పుత్త్రు లుదయించిరి. ౨౪౧

తే. అందులో మరీచికిని గశ్యపుఁడు పుట్టె;
నతఁడు పదుమూవురన్ దక్షసుతలఁ గొనిన,
వారు బహుధా సురాసురావళిని గాంచి;
రిట్లు వితతమై కాశ్యపసృష్టి వెలసె. ౨౪౨

తే. సర్ప పశు పక్షి మానుష జాతిజాత
విస్తరం బయి యీసృష్టి వితత మయ్యె;
దాని సామాన్యమానవుల్ మానసముల
భావనముసేయు టొకయింత వశము గాదు. ౨౪౩

క. లవపటితనువున బ్రహ్మకుఁ
గలిగెన్ స్వాయంభువుండు ఘనుఁడు మనువు, దా

వలదేహార్ధంబందున్
సలలిత శతరూప యనఁగ సాధ్వి జనించెన్. ౧౧౦

తే. దానికిఁ బ్రియవ్రతుండు నుత్తానపాదుఁ
డనఁగ నిద్దరు సుతులుఁ, గన్యకలు మువ్వు
రద్భుతాకార లుదయించి; రట్లు సృష్టి
బ్రహ్మదేవుండు సాగించి ప్రమద మలర. ౧౧౧

సీ. మేరుశృంగముపైనిఁ జారుప్రకారమ్ము
గాఁ గూర్చె బ్రహ్మలోకంబుఁ దనకు,
సర్వలోకోపరిష్ఠంబు వైకుంఠంబు
శ్రీనాథు లీలాస్థాన మయ్యె,
భూతసంఘాత సంస్థిత కైలాసంబు
సాంబసదాశివస్థాన మయ్యె,
బహురత్న రాజిత స్వర్గంబు మేరువు
పై సురాధిపతి కావాస మయ్యెఁ,
బాలకడలిఁ ద్రచ్చిననాఁడు వడసె నతఁడు
పారిజాత మైరావత భద్రగజము,
కామధేను వుచ్చైశ్శ్రవో నామ హయము,
నచ్చరలను, ధన్వంతరి, నమృతకరుని. ౧౧౨

క. ఈవిధముగఁ ద్రివిధంబై
దేవతలు మనుష్యు లనఁగఁ దిర్యక్కులుగా
భావిత మగు సృష్టికథా
శ్రీవిభవము వెలసె వివిధరీతుల నరుదై. ౧౧౩

తే. జీవజాతంబు కర్మతోఁ జేరి యెసఁగు
నండజ స్వేదజోద్భిజ్జ మనఁగ మఱి జ
రాయుజంబు లనఁగ నాల్గుచాయ లగుచు,
నిట్లు సర్గంబు మహిమ రహించుచుండె. ౧౧౪

## విష్ణుకృత దేవీయజ్ఞము

ఉ. భాసిలుచుండ సర్గము ప్రవర్తితమై యిటులన్ విభుండు శ్రీ
వాసుఁ డధోక్షజుండు భగవంతుఁడు క్రీడ లొనర్చుచున్ నిజా
వాసమునన్ రమారమణి పజ్జ వెలుంగుచు నుండ, నొక్క శ్రీ
వాసరవేళ నెమ్మదిని బాఢ, స్మరించెను దేవిపరత్నమున్.

చ. అల్లన జ్ఞప్తి వచ్చెను సుధార్ణవడోలికలందుఁ జేలు ర
త్నోల్లసితాంతరీపమున నుజ్జ్వలరూపముతోడ వెల్గు నా
తల్లియుఁ, దద్విరూపమును దాను ధరించినచొప్పు, దానిచేఁ
దొల్లి సమాప్తమైన శుభధూర్వహ తంత్రము శాక్తమంత్రమున్.

మ. అంబాయజ్ఞము సేయువేడ్క మదిలో నావిర్భవింపంగ ల
క్ష్మ్యంబాకాంతుఁడు లేచి వైళము, సమాహ్వానం బొనర్చెన్ మహే-
శుం బద్మాసను శక్రుఁ బావకు ధనేశున్ దక్షిణేశున్ జలే
శుం బూతాత్ము వసిష్ఠుఁ గశ్యపుని దక్షున్ వామదేవున్ గురున్.

సీ. యజ్ఞసంభారంబు లతివిస్తరంబుగఁ
గల్పించె బహుసాత్త్వికములు, విపుల
విభవాభిరామమై వెలయుంగ శిల్పుల
వితతమండపముఁ గావింపఁ బంచె,
సప్తవింశతి విప్రసత్తములను భక్తి
వరియించె నార్త్విజ్యభార మూనఁ,
జిత్రరీతిని మహాచితిఁ గూర్చి వేదులు
వేయించె రమ్యసువిస్తరముగ,
నుర్విసురులు దేవీబీజయుక్త మంత్ర
రాజ జపపరాయణులైరి, శ్రద్ధతోడ
విహితరీతిఁ గల్పించి హవిస్సు, దాని
వితతముగ హోమ మొనరించి రతులనిష్ఠ.

క. హోమము తీరెన నిముసం
బే మాధవుఁ గూర్చి పుట్టె నెంతయు మధుర

శ్రీ మహితాక్షర సుస్వర
ధామం బశరీరవాణి తా నిట్లనియెన్. ౪౫౩

మ. అమరానీకమునన్ సమస్తుఁడవు మార్తాండవుం గమ్ము, శ్రీ
రమణా! బ్రహ్మయు వాసవాదిక సురవ్రాతంబు నిన్నర్చలన్
సముపాసింపఁగ మానవావళికిఁ బూజాపాత్రమై సర్వకా
లములం దెందు వరప్రదుండ వయి పారమ్యంబుతో నొప్పుమా!

మ. హరి! నీవే సకలాధ్వరక్రియల ముఖ్యప్రఖ్యాతం దాల్చి, శ్రీ
పరమేశుం డని యజ్ఞమూర్తి యని సేవల్ సేయఁగా యాజ్ఞికుల్,
ధరణీభారకు లైన దానవుల విధ్వంసంబు గావించి నిన్
శరణంచున్ సురసంఘముల్ గొలువ రక్షం జేయు మీశుండవై.

క. ఏయే వేళల ధర్మం
బీయిల, హరి! గ్లాని నొందుఁ నీవు మదంశన్,
ఆయా యెడ రూపుం గొని
చేయవలెన్ ధర్మరక్ష స్థిరమహిమమునన్. ౪౫౬

శా. నానాయోనుల ధర్మరక్షణమునఁ బూనంబోవు నీరూపముల్
ధ్యానార్హంబులు మాననీయములు విఖ్యాతంబులై యొప్పి, లో
కానీకంబుల నీ కఖండయశ మవ్యాజంబుగాఁ గూర్చు ల
క్ష్మీనాథా! సహధర్మచారిణిగ వాసించున్ భవచ్ఛక్తియున్. ౪౫౭

శా. వైకుంఠా! యది నారసింహి యనఁగా, వారాహియున్ నా, నా నా
కాకారంబుల భూమణాయుధమహాత్మ్యంబుతో నొప్పుచున్
నీ కెవ్వేళలఁ గార్యసాధనమునం దీపించు నాయంశచే
మాకాంతా! యవి నీ కథకరణసీమల్ గావు సమ్మాన్యముల్.

శా. ఆ నాశక్తులు నీవు నీభరతపుణ్యక్షేత్రమం దెల్లెడన్
నానాభంగిఁ బ్రతీకజాలముల నానాపూజలం గొంచు భ
క్తానీకంబు కభీష్టసిద్ధి దయచేయం జాలుచున్ సద్యశః
స్థానీయంబులరై వెల్గింగి త్రిజగత్సంభావ్యతం గాంచుఁడీ! ౪౫౯

క. విన్నన్ నాశక్తుల భ
క్త్యున్నతి వేదోక్తమంత్రయుక్తిని సేవా
సక్త్యున్నతి నామజపార్చా
సన్నుతులం జేసి నరుఁడు సౌఖ్యము లొందున్. ౧౬౦

తే. ఈవిధివరంబు లొసఁగి యా దేవవాణి
యల్ల విరమింప జిష్ణుఁడు హర్షవశత
యజ్ఞసంపూర్తిఁ జేసి యథార్థరీతి
నందఱం బంపి తాఁ జేరె నాత్మపురము. ౧౬౧

మ. పరమంబై విశదంబునై శ్రవణపర్వంబై శుభావాసమై
వరదానాక్షరమై వినంబడిన భవ్యశ్రీశ్రుతిన్ బల్మఱున్
బరివర్ణించుచు మెచ్చుచుం దలఁచుచుం బ్రార్థించుచున్ మ్రొక్కుచున్
సరివస్యారతులైరి శక్తికి సురవ్రాతంబు మహాసాంద్రదశన్. ౧౬౨

వ. అని విని జనమేజయుం డి ట్లనియె. ౧౬౩

క. హరి సేసిన మఖము సువి
స్తరముగఁ బల్కితివి మఱియుఁ దల్లిచరిత్రం
బరుదుగ వినిపింపుము నీ
కరుణం బావనుఁడఁగా మఖం బొసరింతున్. ౧౬౪

వ. వ్యాసుం డి ట్లనియె. ౧౬౫

క. నుతమువఁగ వినఁ జవియై వె
ల్గెను నితిహాస మ్మొకండు కీర్తించెద, నా
నుడి విను మవధానుఁడవై
కడుఁ బుణ్యపురాణ మంబికాకథ, రాజా! ౧౬౬

## సుదర్శన చరిత్రము

ఉ. కోసలదేశమందు నవికుంఠితశౌర్యధనుండు ధర్మవి
ఖ్యాసముదీర్ణమూర్తి ధ్రువసంధి యనంగ నినాన్వయుండు తా

జేసెను రాజ్యపాలన శుచివ్రతుఁడై ఘనముల్ కులాశ్రమా
శాసనముల్ ధ్రువమ్ములుగ సర్వసమృద్ధి నెసంగ సంపదల్. ౪౮౬

క. ఆతఁడు రాజ్య మొనర్పఁగ
నీతిం జను లింత తప్ప నేరరు, చోరుల్
కాతరులు ధూర్తజనులుఁ ద
దాతతవిషయమునఁ గాన నరుదు వెదకినన్. ౪౮౭

తే. వాని కుండిరి రూపసంపన్నపత్ను
లిరువు; రందు మనోరమ జ్యేష్ఠపత్ని;
యపరపత్ని లీలావతి యనఁ బరంగు;
నిద్దరును గామభోగదాయినులు పతికి. ౪౮౮

చ. సవతులతోడఁ గూడి ధ్రువసంధి వనంబులఁ గాంతదీర్ఘికా
సవిధములందుఁ జంద్రమణిశాలలలో గిరికందరావళిన్
వివిధ మనోజ్ఞ కామభవ విశ్రుతలీలల సంచరించె నా
నవపరిలుబ్ధ బంభరముచందము దోఁప విలాసవైఖరిన్. ౪౮౯

తే. ధర్మపత్ని మనోరమాతన్వి యొక్క
శుభముహూర్తమ్మునం గాంచె సుతుని సర్వ
రాజ్యలక్షణసంపన్ను రాజవదను,
వానికి సుదర్శనాభిఖ్య ప్రథిత మయ్యె. ౪౯౦

ఆ. అంతనొక్కమాస మగుడు లీలావతి
కనియెఁ బుత్రు రమ్యగాత్రు శుద్ధ
పక్షమందు దివ్యబుక్షయోగంబునన్
శత్రుజిత్తు నాఁ బ్రశస్తి వెలుఁగ. ౪౯౧

క. ఇరువురుసుతులకు జనకుఁడు
కర మానందమున జాతకర్మము చూడా
కరణం బిత్యాదిగ సం
స్కరణము లొనరించెఁ బ్రేమసంపద పొదలన్. ౪౯౨

చ. మొగముల క్రొవ్వాలు ముంగురులమూఁకల నూటికి నంటుకొనఁగ నై
కెగయుచుఁ గ్రోయుచున్, రెప్పల నిట్లు నెయిన క్రొవ్విద రంచుఁ బల్కు బం
దుగులు, ప్రియం బొనర్చుచు నమూల్యముగా ధ్రువసంధికిన్ సమా
నగరిమ నాటలాడుచు మనంబు హరించిరి పుత్రు లిద్దఱున్. ౪౭౪

ఉ. అందును శత్రుజిత్తు పలు కాశినముఖ్యులు మూటకట్టుచున్
జిందు సుధారసంబు; బటులఁ జేసి విశేష మతండు తండ్రికా
నందము చేయు. మంత్రులు జనంబుల కెక్కుడు నూర్పు; నట్లు కాఁ
డందఱకున్ సుదర్శనుఁ డొకండుక మందుఁడు మందభాగ్యుఁడున్.

మ. అటు లుండన్ ధ్రువసంధి తన్ను విధి వెంటాడఁగ వేఁటాడువాఁడై
నటవీవీథికి నొక్కనాఁడు చని, పంచాస్యంబులఁ జోపుచున్,
గిటిసంఘంబులఁ గూల్చుచున్, గజములం గ్రేడించుచున్, ఖడ్గకం
కటముల్ సించుచు,, నన్యసత్త్వములకుం గాలుండు నా నొప్పుచున్.

క. మృగయాపరుఁడై క్రీడిం
పఁగ వనమధ్యమునఁ బొదలమాటున డాఁగన్
మృగరాజుఁ గాంచి ధనువును
బిగలాఁగి శరంబు విడిచె వెన్నునఁ గ్రువ్వన్. ౪౭౬

ఉ. క్రుచ్చిన బాణపాతమున ఘూర్ణిలి హుమ్మని బొబ్బ వెట్టి పై
యచ్చరవీథికి న్నెగసి యా మృగరాజ ముదీర్ణవేగమై,
చిచ్చరపిడ్గునా బయలఁ జిందులు ద్రొక్కుచుఁ దోఁక యెత్తుచున్
వచ్చె నరేంద్రుపై కెదురు వాఁడి సటల్ ఝళిపించి భీమమై. ౪౭౭

మ. నృపసింహుండును దానిఁ దాఁకు గని యున్మేషాక్షుఁడై పాదముల్
విపులాంకస్థలి మోపి నిశ్చలమతిన్ వీఁకం గృపాణంబు పా
ణిపటుత్వంబున నూని డాఁపలిచెయిం జెన్నొందఁ జర్మంబు ని
శ్చపలుండై యెదు రొడ్డెఁ దా నవరపంచాస్యంబు నా నొప్పుచున్.

క. అచ్చటి సేవకజనములు
నుచ్చలితనిజాయుధముల నుద్దవిడి హరిన్

విచ్చలవిడి నొప్పించుచుఁ
గ్రుచ్చిరి హాహాస్వనంబు రోదసి నిండన్. ౪౮౦

క. ఆపంచాస్యంబు సటా
క్షేపంబున వాని నెల్లఁ గెడపుచు గజ్జా
టోపతఁ జైపై కెగయుచుఁ
గోపోగ్రత రాజుపైకిఁ గ్రూరత దుమికెన్. ౪౮౧

క. తనపైఁ బడు దాని నురం
బున నిజఖడ్గమున నృపతి పొడిచెను, ధ్రువసం
ధిని హార్యక్షము నిజశా
తనఖంబులఁ జీల్చి యొసిసి దంష్ట్రలఁ బట్టెన్. ౪౮౨

క. అత్తెఱఁగు గాంచి సైనికు
లుత్తలపడి కురిసిరి నిశితోగ్రశరంబుల్
తత్తరమున హరిపై, నవి
రిత్త సనెం, గెడసెఁ బతియు మృగములపతియున్. ౪౮౩

ఆ. పేరెలుంగుతోడ విలపించుచును భటుల్
పరుగువాఱి నగరి కరిగి యంత
భర్త్రు ఘోర మరణ వార్త నివేదించి
రాప్తమంత్రివరుల కందఱకును. ౪౮౪

తే. సచివు లాలించి యది కడు సంచలించి
కానకు వసిష్ఠు రావించి గతవిభునకు
నుత్తరక్రియ లొనరింప నూన్ప, వానిఁ
దీర్చెఁ బరలోకసుఖకారిధీ నతండు. ౪౮౫

ఉ. అంత నమాత్యులుం బ్రకృతు లందఱుఁ గూడి వసిష్ఠమౌనితో
మంతన మాడి తేల్చిరి, సమంబుగఁ బోల్చి, సుదర్శనుండె య
త్యంతసులక్షణుండు, జనశాసనయోగ్యుఁడు, బాలుఁ డయ్యు ధీ
మంతుఁడు, ధర్మపత్నికిఁ గుమారుఁడు వీఁడు జ్యేష్ఠుఁ డౌటచే.

తే. వృద్ధమంత్రు లిట్లు మంత్రించుచుండ
నంతలోనె లీలావతియయ్య యెఱిఁగి
యుజ్జయినినుండి కూర్మి మహోగ్రసేన
వఱపె దౌహిత్రుకొఱకు యుధాజితుండు. [illegible]

క. కరిలిన చనుదెంచె మ
నోరమజనకుఁడు సుదర్శనునిపక్షంబై
పోరంగ వీరసేనుఁడు
చేరిచి కాళింగసీమ సేనాబలముల్. [illegible]

క. అన్యోన్యము వివదించుచు
సైన్యంబులు వీట నిల్పి సరభసమున రా
జన్యులు చేరిరి చూడఁగ
మాన్యులఁ గులవృద్ధమంత్రిమణులం బిలుచన్. [illegible]

తే. ఇరువురును మంత్రిముఖ్యుల నెనసి, వీఁడు
వీఁడ రాజ్యార్హుఁ డం చేపువేఁజఁ బలుక,
నడిగెను యుధాజితుఁడు, వీరలందు నెవఁడు
జ్యేష్ఠుఁ డాతఁడె రాజ్యార్హుఁ డెందుఁ గాదె! [illegible]

తే. అది వినుచు వీరసేనుఁ డిట్లనియె నపుడు,
వయసుతోఁ బని యేమి పన్నెడు? ధర్మ
నిధులు పల్కరె ధర్మపత్నీసుతుండె
రాజ్యభాజనుఁ డని, వృథా రట్టు లేల? [illegible]

వ. నాపుడు నాగ్రహమున యుధాజితుం డిట్లనియె. [illegible]

క. చూడుఁడు నాదౌహిత్రుని,
వీఁడె గుణజ్యేష్ఠుఁ డితఁడె విస్ఫురితాస్యం,
డీ డగునె యెన్న వీనికి
వాఁడు? జడుఁడు రాజ్యభారభాజనుఁ డగునే? [illegible]

తే. శత్రుజిత్తు నీవిధంబున సంస్తుతించి,
తెగడఁగ సుదర్శనుని, విని తీవ్రకోప
ఘూర్ణమానాక్షుఁడై తీక్ష్ణ కుటిలవాణి
శత్రుజిత్తు వీరసేనుండు చదయఁ దిట్టె. ౨౯౩

తే. ఆసభాస్థానమందు మర్యాద లెల్ల
పీటఁబుచ్చి యాయిద్దరు వృద్ధనృపులు
వాదు లాడ, సచివు లెట్టుఁ బల్కలేక
యుండఁ, బల్కె యుధాజిత్తుం డుగ్రత మఱి. ౨౯౪

శా. పోపొండోయి కుమంత్రులార! తెలిసెంబో మీ దురాలోచనా
వ్యాపారక్రమ మెల్ల, నీజడమతిన్ బాలుం గనిష్ఠున్ వృథా
భూపాలుం డని నిల్పి మీరె విభుతం బొల్పొంది కోశార్థముల్
మీ పూర్ణేచ్ఛల దోచఁ జూచెదరు లెండీ, యింత యూహింపనే!

క. మీయింగితం బెఱుఁగని య
య్యాయకుండె యుధాజిత్తుండు? మాయ లుడుఁగుఁడీ!
మీయాట లిచట సాగ, వ
మేయము నాబలము తీర్చు మిగిలినపనులన్. ౨౯౬

క. కోసలసింహాసనమున
నానుతసుతు శత్రుజిత్తు నయమున నిడుఁ, డీ
బా సాలింపుఁడు, లేదే
నాసేనయుఁ దీక్ష్ణఖడ్గ మది తీర్చుఁజూఁడీ! ౨౯౭

తే. వీరసేనుండు నానుడుల్ విని మహోగ్ర
కోపుఁడై మాఱు పల్కె, నోకోఁడవు నీవ
వీరమానివిగా రజ్జు ద్రేపెలదేల?
పోరఁ గాంచెదు నాలావు బీర మిప్పుడ. ౨౯౮

తే. యుద్ధమున నెగావి యొందుపాయంబునఁ
గుదుర దీ వివాద మెంది గతి యని.

ఋషులు ప్రజలు ధర్మశ్రేష్ఠులు మంత్రులు
వ్యగ్రచిత్తులై మఱలి చనిరి. ౨౦౦

ఉ. అంతటిలోన దేశమున నంతట నీ రణవార్త ప్రాకి సా
మంతులు వెల్లు లేగి నిజమండలసైన్యము లెల్లఁ గూర్చి దు
ర్దాంతత రాజధానికి మదంబున నెత్తిరి విగ్రహోన్నతిన్
గ్రొంతెయు నట్టు లంత యెదు రెక్కఁగఁ ద్రోయుచు కూహలంబునన్.

క. కలవారొద్దకుఁ జెప్పం
గలవారును జలము బలము గలవారును ధీ
గలవారుం గలయంబడి
కలహింపఁగ నెల్లప్రజయుఁ గళవళపడియెన్. ౨౦౨

సీ. చనె ధ్రువసంధి, మాము లిరుచక్కిని జేరిరి యుద్ధకాంక్షఁ, దా
ల్చిన చనె దండనీతి, యఖిలం బగు కోశము దోచుకొని జే
యను వసి శృంగిబేరపురమందు నిషాదులు పొంగి సర్వసా
ధనయుతులై యయోధ్యపయి దాడి వెడలిరి రుదగ్రవైఖరిన్.

క. మఱియు మఱి దేశదేశాం
తరములఁ గల దస్యుజనము తద్రాజ్యమునం
బొరలంబడి చెల రేగిరి
తఱచై, తఱిఁ గని యమర్చ్చ ధనము హరింపన్. ౨౦౪

ఉ. నగరోపాంతవిశాల దేశమున సేనల్ దీర్చి యుద్ధోపలం
బగ సాధింపఁగ వీరసేనుఁ డిట నీవైపున్ యుధాజిత్తు వే
ఱుగ నాపై వయి నిల్చి లోభమువెలయున్ రోషాంధులై ఘోరసం
యుగ సంరంభ విసారితాస్త్రు లయి రొండొండన్ విజృంభించుచున్.

మ. ఇరువాగుల్ రథనిస్వనంబు శ్రుతి, మత్తేభేంద్రఘీంకారముల్
మురజ ధ్వానము, లశ్వహేషలు లయల్ పూరించుతాళంబులున్,
శరముల్ దువ్వెడి నారిమ్రోఁతలు లసత్సంగీతమై తోడుగా
స రి గా సద్భటపాణిపాదకలనం జల్పె న్నవిమిన్నాట్యముల్. ౨౦౬

క. అన్యోన్యాయుధఘట్టన
జన్య మహోల్కాప్రదీప్త సకలదిశంబై
సైన్యంబులు తలపడఁగా
జన్యము ఘోరావతారచరితం బయ్యెన్. ౫౦౭

క. తుములంబై సాగ విమ
ర్దము, బాహాబలయుతుఁడు యుధాజితుఁడు శతాం
గము నెక్కి మేరుగిరిసా
రము విలు గొని ప్రతిభటులశరంబుల నొంచెన్. ౫౦౮

ఉ. తనభటు లెల్లఁ బాఱఁగ, రథంబులు నుగ్గుగ, నశ్వరాజముల్
తునియ, గజావళుల్ బెదరఁ, ద్రోయుయుధాజితుఁ గాంచి వే యెదు
ర్కొనెఁ బటుసింహనాదముఖరుం డయి పెన్విలు పూని బాణమో
చనఘనలాఘవంబు, రణచండిమఁ జూపుచు వీరసేనుఁడున్. ౫౦౯

క. ఓరి యుధాజిత! మాటలఁ
బోరా దిటఁ జక్క నిలిచి పోరాడక, నా
నారాచంబు లజిహ్మగ
సారంబులు శత్రురక్త సంతర్పణముల్. ౫౧౦

తే. ఇట్లనుచు వీరసేనుఁ డహీనముష్టి
దృఢముగాఁ గూర్చి కురిసి మహేషువృష్టి
ప్రావృషేణ్యపయోదంబు పర్వతేంద్ర
శిఖరమునుబోలె నయ్యుధాజితుని ముంచె. ౫౧౧

చ. పలుకులఁ దీర్పరాదు రణపాండితి, చాపధరుండ నైన నా
బలు పొకయింత చూపుతఱి వచ్చుటఁ బండువ యయ్యె నేఁడు, ని
శ్చలమతి వీరసేన! నిలు చక్కటిఁ బాఱక, తెప్పపాటులో
పల జముప్రోలి కేగ నినుఁ బంచెద బాణపుసారెతోడుగా. ౫౧౨

ఆ. అనుచు బిరుసుబిరుదు లాడి, యుధాజిత్తు
వీరసేనభటుల విఱుగ నేసి,

పఱపె వానితనువుపై నరదంబుపై
శరము, లతఁడుఁ గొనియె మఱొకవిల్లు. ౫౧౩

క. తలపడి యివ్విధి నిద్దఱు
నీలాపతులు పోరఁ జూచి యెల్లబలంబుల్
చెలరేగి పెనఁగె నెదురై
జలనిధు లెనసినఁ గలంగు చందము దోఁపన్. ౫౧౪

శా. వాజిని వాజి, వారణము వారణముల్, రథముల్ రథంబు, బం
టోజను బంటుఁ, దాఁకు నెదు రొడ్డినఁ గాంచి వియచ్చరవ్రజం
బాజివిధంబు మెచ్చెఁ బిశితాశనలుబ్ధములై నభోంగణ
భ్రాజితమై చరించె నెడఁబాయక వాయసకంకగృధ్రముల్. ౫౧౫

మ. హరిమాతంగభటవ్రజం బొడళులం దన్యోన్యఘాతంబునం
దఱుపై కాఱినరక్తసింధు వది ప్రత్యక్షంబుగాఁ దోఁచె భీ
కరమై, పాపులు దండపాణిపురి కేగన్ దారి రోధించు వై
తరణీవాహిని భూమికిం దిగినచందం బొప్పఁగా నబ్రమై. ౫౧౬

క. ఒరసిన నెత్తురువాగుల
విఱిగిన సైకతములందు విరిసినజడలన్
నరశిరము లుండెఁ గ్రీడా
పరులు యమున నిడిన తుంబిఫలములువోలెన్. ౫౧౭

ఉ. వీరుఁ డొకండు ప్రాణములు వీడి రథంబుననుండి భూమికిన్
జాఱినఁ దత్పలాశ గగనంబున గృధ్ర మొకండు చుట్టి సం
చార మొనర్చె, జీవుఁడు నిజస్ఫురదున్నతరమ్యమూర్తిఁ గ
న్నారఁగఁ గాంచి మై మఱచి యందు మఱిం జొరఁ బూనెనో యనన్.

ఉ. అల్లదె నా శరీర మబలా! కనుమా కమనీయరూపమై
యుల్లము నించుఁ ద్రెళ్ళియు శరోత్కరజర్ఝరితాత్మసంధిబం
ధోల్లసితం బటంచు నొక యోధుఁడు చూపి విమానయానుఁడై
సల్లపనం బొనర్చెఁ దనసందిటఁ జేరిన స్వర్వధూటితోన్. ౫౧౮

ఉ. ఒక్కఁడు మై దొడంగి రిపునుగ్రశరాహతి, మింట వేలుపుం
జక్కెరబొమ్మతోఁ మెఱయ సమ్మదలీల విమానయానమం
దెక్కెటి వాసిపత్ని త్యజియించి శరీరము నగ్నిలోనఁ దా
నక్కడఁ జేరి యాత్మవిభు హస్తముసం గొని లాగె బల్మికై. ౧౨౦

తే. సద్భటద్వయ మన్యోన్యశస్త్రనిహతిఁ
బోరుచుం గూలి దివిఁ జేరి వార లొక్క
యప్సరఃకామినినె పొంది, యందు దాని
కై పెనంగిరి మరల దివ్యాస్త్రవితతి. ౧౨౧

ఉ. యువకుఁ డొకండు రూపసుగుణోన్నతిచేఁ దన కెక్కుడైన స్వ
ర్యువతినిఁ జేరి, దానిఁ దన కున్ముఖిఁ జేయ నిజానుభావముల్
ప్రవితతముల్ పొనర్చి మరలన్ మరలన్ గణుతించి చెప్పుచో,
నవి నిజమై తనుం బొరయునట్లు చరించెను యోగయుక్తుఁడై.

తే. బ్రహ్మచారి యొకఁడు స్వర్భామినిన్ భక్తి
కలితఁ బడసి దానిఁ గవయఁ డయ్యె
వనిత వేఁడుకొన్న వ్రతభంగభీతుఁడై
వృథయు గాఁగ దాని వేడ్క యెల్ల. ౧౨౩

చ. మొదల విమర్దసంజనితభూరజ మంబర మంటి భాస్కరుం
బొదివి దివంబు రాత్రి యను బుద్ధి పొసంగఁగఁ జేసె నంతలో
నదియె రణప్రయుక్తరుధిరాంబుధివీచుల మున్గఁ బూషుఁడుం
డుదితవిభాభిరాముఁ డయి యొప్పెసలారె వివృద్ధకాంతితోఁ. ౧౨౪

చ. సమరము ఘోరభంగి నిటు సాగెడువేళ యథాజితుండు దీ
ర్ఘము దృఢమైన వింటఁ బదిలంబుగఁ బూన్చి శితార్ధచంద్రబా
ణ మొకటి లక్ష్యశుద్ధిఁ గఠినంబుగ నేసిన వీరసేనుమ
స్తము దెగనేసె. నద్ది నిజసైన్యము లార్వ జయస్వనంబుతోఁ. ౧౨౫

క. తల్లు త్తునిసి విభుఁడు షడఁ గుం
డలములమెఱుచులు మకుటంబుడంబు నడంగన్

వలదె నీకలం బలపలనై
బలగంబులు విచ్చి వారె భయభీతములై. గీ. ౬౮

సీ. జనకుండు రణభూమి సమసినవార్తను
నాకమ యాలించి కూరి భీతి,
యేమి సేయను దోఁప కిట్లు వితర్కించె
నెం దేగఁ గల నిప్డు నెవ్వఁడు గతి ?
పసిపాప నాపట్టిఁ బాలించు టెటు యుధా
జితుఁడు లోభవశత హాతు నాసన్న,
లోభి చేయని దేమి లోకంబులో నుండుఁ ?
దల్లిని దండ్రి భ్రాతలను గురుల

సఖుల బంధులఁ జంప సంశయపడండు,
[illegible] పొందఁ డభక్ష్యభక్షణ మొనర్ప
నాన యే, దగమ్యాగమనంబె సేయు,
నెవ్వ రీపురి నన్ను రక్షించువారు ! గీ. ౬౯

క. శరణం బంచు సపత్నీ
చరణంబుల వ్రాలి వేడ సత్ఫల మున్నె !
కరుణించునె లీలావతి
పరికింపక సవతి సహజవైరం బెందున్ ! గీ. ౭౦

సీ. సవతితల్లికిఁ గుక్షి సంస్థుఁడౌ శిశుపిండ
మేడేదు సేయఁడే యింద్రుఁడు మును,
గర్భనాశార్థమై గరళ మీయ సపత్ని
సగరుండు పుట్టఁడే సగరుఁ డగుచుఁ,
గైకేయి దశరథుఁ గాంక్షించబడే జ్యేష్ఠుఁ
బ్రవ్రాజన మొనర్ప రామభద్రు,
మును సుదర్శను రాజుగను [illegible]
లవశు లిప్డు యుధాజిదనుగమనులు,

పురములో నాసవతితండ్రి పొరకమున్న
తలఁగి చనవలె నెటులేనిఁ దనయుఁ గాచి
బాలుఁ గాంచినఁ జెఱవెట్టు వాఁడు నిజము,
పతి చనియెఁ, దండ్రి హతుఁ డయ్యెఁ, భ్రాత లేఁడ! ౹౼౨౯

క. దైవమె నా కీయాపద
గావించె, సముద్యమింపఁ గార్యార్థముగా
దైవం బనుకూలించుం,
గావున యోజింతుఁ బుత్రుఁ గాచెడివెరవుల్. ౹౼౩౦

క. బాలామణి యిటు దీర్ఘం
బాలోచించుచుఁ దలంచి యధికనిపుణు స
చ్ఛీలు విదల్లుని విశ్వా
సాలంబుని మంత్రివర్యు నర్హుం డంచున్. ౹౼౩౧

క. రావించి వాని నేకాం
తావాసంబునకు బాలుహస్తముఁ గొంచున్
వేవిధముల నార్తిం బరి
దేవన మొనరుచుచుఁ దోఁగు తెరు వర్థించెన్. ౹౼౩౨

తే. ఆతఁ డామెపల్కు లాలించి యోజించి
నుడివె, సత్య, మిందుఁ దడయఁ జనదు,
వారణాసి కరుగవలయు, నా మాతులుం
డుండు, వాఁడు కూర్చు దండిరక్ష. ౹౼౩౩

క. మనము యుధాజిద్దర్శన
మునకు సముత్కంఠమతులపోలె వెడలి స్వం
దనమునఁ దొలంగి పురి య
ల్లన వనమార్గములఁ జనుట లగ్గగుఁ దల్లీ! ౹౼౩౪

ఉ. ఆవనితాలలామ యటు లాడు విదల్లునొడుల్ గ్రహించి, శ్రీ
లావతిఁ జూడఁ బోయి కడు లాలనఁ బల్కుచుఁ, దండ్రిఁ జూడఁగాఁ

బోవలె నంచు స్యందనము పూన్చి విదల్చని వోడ సప్తతాం
తాన్మృతుఁగా సుదర్శను నొనర్చి వడిం బురి నిర్గమించెఁ దాన్. ౧౩౫

క. పురి వెలిఁ గాఁపున్న భటా
వరణంబు తలంగి పోవ వశమే కా కా
తరుణీమణి కంపించుచుఁ
బరపుచు నలుదెసల బెదరు వాతెడి చూపుల్. ౧౩౬

తే. ఆర్తి స్త్రీమూర్తి దాల్చినయట్లు గోప
నతికృపణరూప శోకసమాకులాత్మ
యై యుధాజిత్తు దర్శించి యనుమతిఁ గొనె
జనకుతనువు యథావిధి సంస్కరింప. ౧౩౭

క. పితృసంస్కారకలాపం
బతివినయమున నిర్వహించి యాతురయై యా
సతి యదను చూచి నేర్పున
సుతుతోడన్ వారణాసిచొప్పునఁ దొలఁగెన్. ౧౩౮

క. రెండు దినంబులు చనఁ గను
పండువుగాఁ గానవచ్చె భాగీరథి; యం
దుండి మనోరమ యూర్చుచు
గుండియదడ కొంత యార్చుకొనుచుండె నెటో! ౧౩౯

క. ఆరమణీమణి బాలక
సైరంధ్రీ సంవిదల్ల సహచర యగుచున్
పేరెలుఁగున నేడ్చుచు భా
గీరథి శరణంబు చొచ్చెఁ గేల్మోడ్చి మొగిన్. ౧౪౦

క. ఎదురన్ జలజల మని చిఱు
రొద చేయుచు జహ్నుతనయ రోచిస్స్మితయై
కదలఁగ ముదంబు గూర్చుచు
నొదవించెఁ బ్రశాంతి యావనోర్వీసుదతికిన్. ౧౪౧

ఉ. ఆసమయంబునందు వినవచ్చె నపారమునంద భూతవి
త్రాసకమౌ మహాకలకలం బొకఁ డందు, ననేకపాదవి
న్యాసభయంకరంబు బహుళాయుధఘర్షణముం బరస్పరా
క్రోశనఘోరముల్ సమద ఘోణ సమూహ రవానుకారముల్.

క. కను చూసి తెజచునాలో
నని వారలఁ జుట్టుముట్టి నానావిధశ
స్త్రసము లొనర్చు నిషాదుల
గణ మొక్కటి దోఁచుకొనెడి కాంక్ష చెలంగన్. ౫౬౩

సీ. ఒకఁడు మనోరమ మొడలిపై నగ లెల్ల
నూడ్చెఁ, గోసియుఁ ద్రెంపి మొలనున్నకొనెను,
నొకఁడు సువర్ణనుజ్జ్వలాంబరములు
రత్నభూషాదులు లాఁగికొనియె;
నొకఁడు సైరంధ్రి తా నొడిలోన దాఁచిన
వసువు వజ్రంబులు వదల గుంజె,
నొకఁడు విదల్లుకరోల్లాసినిశితాసి
లాఁగి పై జళిపించి రేఁగి యార్చె,

నొకఁడు నొగ లెక్కి యుగ్యంబు లూన నడచెను,
నొకఁడు రథ మెక్కి రథికుఁడై యుబ్బి మీఱె,
నొకఁడు వారల నో రెత్తకుండుఁ డనియె,
బ్రదికిపోయితి రనె నొక్కఁ డదయుఁ డగుచు. ౫౬౪

క. ఆదస్యు లట్లు వారల
పైఁ దాల్చిన యొడ్వు లింత వదలి సమస్తం
బేది దయ దోఁచి తోఁచిన
యాదారిం జని రుదగ్రహర్షోద్ధతులై. ౫౬౫

క. ఒదిగి యొదిగి నుతుఁ గరములఁ
బదిలంబుగఁ బొదివి ఘాలుపా టొదవంగా

జెడ రదరఁగ నైరంత్రిం
గదిసి కరం బూఁత గొంచుఁ గదలి మెలమెలన్. ౫౪౬

క. తడఁబడుచు నామనోరమ
యుడుపం బొకఁ డెక్కి త్రిపథగోత్తారణముం
గడువడి నొనర్చి చని కా
ల్నడఁ బ్రాపించెం బ్రికూటనగపుణ్యోర్విన్. ౫౪౭

క. భైరవతతి వెన్నాడం
బాఱెడి కాననకురంగివడువున వెనుకం
దేఱి కనంగా వెఱచుచు
భారద్వాజాశ్రమంపువనముం జేరెన్. ౫౪౮

క. ఆపాదమస్తకంబు భ
యోపహతిన్ వడఁకుచున్ సముత్కటగరిమం,
దాపసులఁ గాంచి యెదుర స
మీపభువిం గొంత దేఱె మెల్లన నెటులోఁ. ౫౪౯

తే. అట్లు తనుఁ జేరి భయవిహ్వలాంగి యగుచు
నెగయు నూరు పుడిగి తన కెఱఁగుటకును
దెలియకున్న దీనాంగన తెఱఁగు గాంచి
పలికెఁ గృపఁ బూని యిటు భరద్వాజమౌని. ౫౫౦

ఉ. ఎవ్వతె వీవు రూపవతి ? యెవ్వఁడు నీపతి? యేమి కష్టముల్
నివ్వటిలంగ భీకరవనిం జొరఁబాఱుట సంభవించె? నిం
దెవ్విధిఁ జేరఁగాఁ గలిగె? యెంతయుఁ జోద్యము బాలపుత్ర వో
జవ్వని! సంశయింపక నిజంబు వచింపు మెఱుంగఁ గోరెదన్. ౫౫౧

క. మొద లరయ నీవు మానుష
సుదతివొ కాదో వచింపు, చూడం జూడన్
మదిఁ దోఁచు రాజ్యమెడలన్
జెదరిన శుద్ధాంతకాంతచిన్నెలు నీలోఁ. ౫౫౨

చ. పరమమునీంద్రుఁ డిట్లు తనుఁ బ్రశ్న మొనర్ప లతాంగి పైపయిం
డెర లయి పొంగువాఱె చనుదెంచి కలంచెడి యశ్రువారి స
స్తను లొకకట్ట త్రె కెలుఁగు రాపడ మాటలు రాక వానిది
కఱరసిన సౌవిదల్లుఁ డెవ యూరసి మానికిఁ జెప్పె నాఁ డిటుల్.

సీ. సూర్యవంశ్యుఁడు మహాశూరుం డయోధ్యాధి
పతి ధ్రువసంధి నాఁ బరఁగునృపుఁడు
హాలిసె సింగముచేతఁ, జెలి యీమె తద్ధర్మ
పత్ని మనోరమ పరమసాధ్వి,
యారాజు తనయుఁడీ యర్భకుండు సుదర్శ
నాఖ్యుండు, ధర్మాత్ముఁ డామె తండ్రి,
దౌహిత్రుకొఱకు యుధాజితుతోఁ బోరి
యసువులు దొఱఁగె రణాజిరమున,

నంత విత్రస్తయై స్వపుత్రావనార్థ
మీ విజనకాననంబు ప్రాపించె నిందు
నడరి దస్యులు హరియించి రఖిలధనము,
నీమహాదేవి కిపుడు దిక్కెవరు లేరు. ౫౫౮

తే. మానిసత్తమ! యిది పసికూనతల్లి,
రాచవారింటిసుత, మహారాజపత్ని.
నిన్నె శరణంబు చొచ్చె, నాపన్న దీని
నో మహాభాగ! రక్షింపవో మహాత్మ! ౫౫౯

క. ఆర్తత్రాతల కిష్టా
పూర్తాధికపుణ్యఫలము పొందుపడుఁగదే!
కీర్తింపఁ దరమె విత్ర
స్తార్తుల రక్షింపఁ బడయునతులోదయముల్! ౫౬౦

ఉ. సానునయంబుగాఁ బలికె నాఋషి, స్వస్థమతిన్ వసింపు క
ల్యాణి! మదీయసన్నిధి, నరాతిభయం బొకయింత చేరఁగా

సీను. సుతుం జితంజః వసుఢేనుః దసుణా బ్రతిసిష్ఠ నానుచుణా
పినిసి నోముకొ, వ్యానుభవింపక తేజునొకొ విపద్గతుల్! ౫౫౮

క. మునిమాటల మది పదిలం
బొనరిచికొని రాజ్ఞి యాశ్రమోటజమందుం
దనసుతు సాఁకుచు నివసిం
చెను సైరంధ్రీసౌవిదల్లసేవిత యగుచున్. ౫౫౯

చ. అచట యుధాజితుండు నిజమార్గటికైు పురిఁ జొచ్చి క్రమమే
యుచితము నైదివమ్నొ శమ మొంద సుదర్శనుఁ జంపు టంచు నెం
చుచుఁ జని రాణివాసమును జొచ్చి మనోరమఁ గాన కందులోఁ,
నెచటికిఁ బోయె నేమయిన దేమని యందఱ నర్గెఁ బల్కుచున్.

క. సేవకుల మనోరమ గల
తా వెఱుఁగం గలయఁ బంచి, తనదౌహిత్రున్
రావించి శుభదినంబునఁ
గావించెన్ భద్రపీఠికాసంస్థితునిన్. ౫౬౦

క. ఆథర్వణశుభమంత్రో
ద్గీథంబు వసిష్ఠహాని కీర్తింపఁగఁ బా
థోధిజల పూర్ణ కుంభ క
రాధారులు చేసి రప్పు డభిషేచనముల్. ౫౬౧

క. భేరీ శంఖ నినాదము
చారుతరానేక తూర్య సంరావంబున్
బూరటిలన్ దశదిక్కులు
బోరుకలఁగె నుత్సవమునఁ బుర మెల్లెడలన్. ౫౬౨

క. వేదము పఠింప సుస్వర
నాదంబుల విప్రజనులు వందులు స్తోత్రో
న్నాద మొనర్చిరి జయజయ
నాదంబుల చేసి రచట నానాజనముల్. ౫౬౩

క. ఈసమయంబునఁ జూడం
గా సాకేతము నవోత్సకరణం బొలిచెన్
భాసుర నూతన నాథుని
సేసమ్మద పుష్ట హృష్ట తుందిల జనమై. ౫౬౫

మ. ఎవఁడో యేడనొ సాధుపూరుషుఁ డోకండే యేమొ కానోపుఁ గూ
కె వగన్ బుద్ధి సుదర్శనుం దలఁచి, యేడీవాఁడు సాధ్వీమత
ల్లి వనాంతంబులఁ దల్లి నెట్టియెడుమల్ వెంటాడెనో పాపమం
చు విచారించెను వానిబోంట్లు లనుదాచుఁ మాట లేమంత్రిపో!

తే. అట్టియోగ్యులు సమబుద్ధు లడఁగియుండ
శత్రుజితుని సింహాసనసంస్థుఁ జేసి
మంత్రివశ మొనరిచి రాజ్యతంత్ర మెల్ల
మరలెను యుధాజితుఁడు నిజపురికిఁ బోవ. ౫౬౬

ఉ. వారనిభీతిఁ బాఱి మునిపల్లెలలోఁ దల దాఁచి డాఁగియు
న్నారు సుదర్శనాదు లని నాట జనశ్రుతి శ్రోత్రవీథి, ని
ర్వైర మొనర్పఁ బూని తెగనై చుకుతూహల ముల్లసిల్లఁగాఁ
జేరె యుధాజితుండు బలుసేనలు గూరిచి చిత్రకూటమున్. ౫౬౭

తే. వానికి సహాయుఁడై ముందు బలసి నడచె
నతిబలుఁడు బలుఁ డను నిషాదాధిపుండు
వారివెంటనె వడి శృంగిబేరవిభుఁడు
వెడలె దుర్దర్శనాముఁడు వీతదయుఁడు. ౫౬౮

ఉ. వా రటు వచ్చుచున్న విని వారక కన్నుల బాష్పపూరముల్
కాఱ శరీర మెల్ల వడఁకన్ సుడిగాలికి వల్లిమాడ్కి, మై
జాఱెడిస్వేదవారిఁ గొనగోటను మీటుచుఁ బుత్రు సందిటం
జేరిచి పైఁట చాటొనరఁ జేసి మనోరమ యార్తిమూర్తియై. ౫౬౯

క. తడఁబడు నడుగుల వడిఁ బ
ర్విడుచు భరద్వాజునుటజ మెదురం జని తాఁ

గను భక్తి ప్రముక్తిఁ బూతని
యమునులఁ బరిశైచి ప్రశ్నఁ, దన మునికి నిటుల్. ౫౭౦

ఉ. ఏమి కొఱనస్తి? నెక్కడికి నేగుదు? నెవ్వరు దిక్కు నాకు? దు
ర్నామబలంబు శోధగ యుధాజితుఁ డల్లరి వచ్చె, బాలు నేఁ
జేమెయిఁ బొట్టఁ బెట్టుకొనఁజే? పాలియింపఁడె నాదుతండ్రి? మా
భూమి హరింపఁడే? బలిమిఁ బూన్పఁడె మన్నన రాజకీర్తికై? ౫౭౧

క. వింటిమి పురాణకథ మన
ముందర పాండవులు ద్రుపదపుత్రియు మునివా
టిం దాము వసించెదు తఱి
నందఱు పాండవులు వేట కరిగి రొకయెడన్. ౫౭౨

సీ. ద్రౌపదితో నుండె ధౌమ్యుండు మఱి యందుఁ
గల రత్రి పైలుండు గాలవుండు
నాత్రేయుఁ డైన యా చ్యవనుండు జాబాలి
కణ్వ జతుక్రతు గౌతములును
భృగువు సుమంతుండు వీతిహోత్రుఁడు యజ్ఞ
దత్తుండు యజ్ఞకృత్క్రతు యవులును
నాశాసన యవక్రు లల వత్సల కహోడ
ముఖ్యులు సన్మానిముఖ్యు లలఘు
లో భరద్వాజ! నీవు నం దుండవొక్కొ!
వేదవేదాంగవిదులు శుభోదయాత్ము
లుజ్జ్వలులు వారియండఁ దా నుండెఁ బ్రీతి
యాజ్ఞసేనియు దాసీసహాయ యగుచు. ౫౭౩

తే. అంతలోఁ బాండవులు మృగయాభినిరతి
వన మొకటి దాఁటి యింకొకవనము చేరు
చుం గడుం దవ్వు వోయిరి శూరధర్మ
మనుసరించి ధనుర్బాణహస్తు లగుచు. ౫౭౪

శా. శ్రీమంతం బగు సింధురాజపురము దారిం బోవుచున్ మంజులా
ర్థామోదంబుగ పేనులన్ మునులవేదాధ్యాపనల్ సోఁకఁ, ద
చ్ఛ్రీముఖ్యం బయి యాశ్రమాంతరము దర్శింపంగఁ గాంక్షించుచున్
ధీ మీఱన్ వడిఁ దేరు డిగ్గి చెనలెన్ భృత్యద్వయోపేతుఁడై.

తే. నిగమవాదం బొనర్చు మానితతిఁ గాంచి,
యంజలి ఘటించి భక్తి, జయద్రథుండు
తన్నెఱింగించుకొని పేరు తెలిపి మ్రొక్కి
యనుమతం బయి యాసీనుఁ డయ్యె నొకట. ౫౭౬

చ. నరపతిరాక చెచ్చెర వనంబునఁ బ్రాఁకిన మానిపత్ని తె
వ్వారో, యతఁ డెట్టివాఁడో, కని వత్తము గా కని వేడ్క బుద్ధాలం
దొరలఁగ, వచ్చుచుండెఁ గని, తోఁ జనుదెంచెను యాజ్ఞసేనియున్
వరకుచభారనమ్రగమనంబున మాఱట శ్రీ యనంగనై. ౫౭౭

ఉ. దానిని వాలుఁగన్నుఁగవదానిని, వేలుపుబొమ్మ కుద్దియౌ
దానినిఁ, దమ్మి నెమ్మొగముదానిని, గాంచి జయద్రథుండు, స
న్మానికులేంద్ర! శ్యామ సురమానిత యెవ్వరిపత్ని తెల్పు మీ
చాన, తలంప రాణ్మహిషీచాయఁ గనంబడు నంచు వేఁడినన్. ౫౭౮

తే. ధౌమ్యుఁ డెఱిఁగించె నిట్లు, లీతరుణి కృష్ణ,
పాండవులధర్మపత్ని, శుభస్వరూప;
వార లింద వసించుచున్నారు, నేఁడు
వేట చని రిప్డ వచ్చెడివేళయు నగు. ౫౭౯

ఆ. సైంధవుండు వాని సద్వాక్య మాలించి
కృష్ణఁ జేరి మ్రొక్కి ప్రియము మీఱఁ
గుశల మడిగి వగచె ఘోరాటవిఁ బదునొ
కేడు లెట్లు గడుపఁ గూడె ననుచు. ౫౮౦

ఉ. ద్రోవది వానిసౌమ్యముఖధోరణి రంజిలి పల్కె స్వస్తి యౌఁ
గావుత నీకు భూవర! సుఖంబుగ నిందుఁ బథశ్రమంబు పోఁ

గా నటియింప్ర మిచ్చు, క్షణకాలములోఁ జనుచెంగ్రీ నాయువుల్,
నీ విటు దాక యాత్మధనమీషల కెంతయుఁ బ్రీతి నూల్పెదే.

క. కలలన యిల్లు పలికెదు
నాలోన నె వాఁడు లోభహాతుఁడై దానం
జే లాఁ బలిమిఁ గొని చనె
నాలింపక మానినవులహాహారవముల్. ౫౮౨

ఆ. విశ్వసించి బుధుఁడు వెఱవు వీడం బోల,
వల్లొనర్చి యితఁడు మ లంచు, ధ్రువము;
సత్యసంగరుండు సాధుసమ్మతబుద్ధి
నమ్మి మోసపోఁడె నాఁ డటు బలి! ౫౮౩

ఆ. ఆడి బొంకు దెలుఁగఁ డాతండు ప్రఖ్యాతు
మనుమఁ డమితధర్మమహితబుద్ధి,
పూర్వదక్షిణాకములుగఁ దొంబదితొమ్మి
దధ్వరములు సలిపినట్టి దాత. ౫౮౪

ఉ. యోగుల కీశ్వరేశ్వరుఁ డనుత్తముఁ డవ్యయసత్యమూర్తి శ్రీ
భాగవతాగ్ర్యపూజ్యభగవంతుఁడు విష్ణుఁడు దేవకార్యదీ
క్షాగరిమంబునన్ వడుగుగాఁ బ్రభవించి ఛలంబునన్ గొనం
డే గురురాజ్యముం, జెఱుపఁడే యతఁ డూనినయజ్ఞకార్యముల్.

క. అట్టి మహాభాగుఁడు హరి
యట్టుల కపటమున బలిని హరియించిన, నిం
కెట్టిది చేయం డితరుం;
డిట్టు లగుట నమ్మ వలవ దెన్నఁడు లోభిన్. ౫౮౬

సీ. లోభహాతుఁడు చేయ లోఁగు పాపము లేదు,
పరలోకభీతిఁ బన్నడఁ డొకింత,
పరవిత్తహరణంబు వాంఛించియే నరుల్
దేవతలం గొల్వఁ దివురుచెల్ల,

గ్రహణవేళల మహామహిమ పొందెడుకోర్కెఁ
బలుదానములుఁ జేయుఁ బార్థివుండు
వస్త్రాదు లమ్మఁగా వణిజుండు గొని లాభ
మర్థించి సల్పు దేవార్చనంబు,

నొకఁడు భయమువలన నొక్కఁడు భక్తిచే
నొకఁడు చౌర్యవృత్తి నొకఁడు బలిమిఁ
బరధనము హరింపఁ బ్రాణు లెల్లఁ దలంతు
రెట్లు విశ్వసింప నెసఁగు జనులు? ౫౮౭

క. వృథ యగుఁ దీర్థము, దానము
వృథ యగు, నధ్యయన మెల్ల వృథ యగు, నెవనిన్
వ్యధపెట్టు లోభ మోహము,
లధముఁ డతనిసుకృతమేని నకృతంబ యగున్. ౫౮౮

క. నీయంత నొదిగి ముని దే
వా! యీయెడ నే వసింతు నాత్మజుతో, ము
న్నా యవనిజనోలెనె యె
ట్లో యింటికి ననుపఁ జాలవో యుధాజితునిన్ ! ౫౮౯

ఆ. అట్లు పల్కు రాణియార్తవాక్యాలించి
కరుణ మాని యచటు కదలి వేగ
ఘన తపఃప్రభావఘని భరద్వాజర్షి
పల్కె రాజుతోడ వచన మిట్లు. ౫౯౦

క. "రాజా! మును వచ్చిన తెరు
వోజం గొని యేగు, మింద యుండెడు దుఃఖో
ద్వేజిత యీసతి బాలత
నూజునితో మాదునండ నూల్కొన శుభముల్. ౫౯౧

వ. అనవిని యుధాజి త్తిట్లనియె. ౫౯౨

ఆ. "మొండితన మ దేల! మునిముఖ్య! కొనిపోదుఁ
గొడుకుఁ గోడ దీని విడుపుమయ్య!
విడువవేని రోస మడర మనోరమ
బలిమిఁ గొంచుఁ బోవవలసి వచ్చు." ౫౩

క. గంభీరసాగరాంతర
కుంభితబడబాగ్ని పోలికొనియుఁ శాంత
స్తంభితరేఖం దేజ
స్సంభృతుఁ డయి పలికె వసిష్ఠుఁడు కౌశికున్. ౫౪

క. మున్ను వసిష్ఠుని మొదవుం
గొన్న కుశికతనయుఁ బోలెఁ గొని చను మీవున్,
న న్నాశ్రయించి మనియెడి
యిన్నాతిన్ బలిమిఁ గొనఁగనే బల మున్నన్. ౫౫

తే. పలానివాక్యంబు లాలించి మానవపతి
వృద్ధమంత్రిని గర్తవ్య మిట్టు లడిగె
బలిమి నైన దీని సుతునితోఁ జలము మీఱఁ
గొంట నా మత మేమి వ్రాకుత్తు వీవు? ౫౬

క. కొంచెంబయిన శత్రువు
నంచితశుభ మిచ్ఛగించు నాతఁ డుపేక్షిం
గించిత్తు చేయఁ జన దెక
మించినయెడ రాజయక్ష్మ మితి మిత్తి యగున్. ౫౭

క. లే దిందు సేన, యోధుఁడు
గా దన నను లేఁ డొకండుఁ, గావున బలిమిన్
నాదాహిత్రత్సర్షిన్
ఛేదించి యకంటకముగఁ జేయుదుఁ బ్రభుతన్. ౫౮

వ. ప్రధానుం డి ట్లనియె. ౫౯

క. ఓహో! వలదటు, ప్రభు! ముని
యూహాం దలపోయు, మేల యుపమానముగా
నాహోమధేనువుం గాను
సాహసకౌశికునిగాథ స్మరియించె నొకో! ౬౦౦

క. పూర్వము విశ్వామిత్రుం
డుర్విం జరించుచు యథేచ్ఛ నొకనాం డర్థిం
గుర్వాశ్రమమున కేగెను
సర్వపరివారయుతుండు సబలుం డగుచున్. ౬౦౧

క. నృపుం డేతేర వసిష్ఠుం
డుపవిష్టుం జేసి విష్టరోపరి తగున
ట్లుపచారనిమంత్రణముల
సపరివారం బతిథిగ క్షణియించె నొగిన్. ౬౦౨

క. గాధేయుభోజనాదులు
సాధింపంగ సామిధేని సన్ముని మది నా
రాధించిన నదియు సమా
రాధన మొనరించె మెచ్చ రా నెల్లరకున్. ౬౦౩

క. నందినిమాహాత్మ్యంబును
నందంబు ప్రతాపగరిమ యంభారవ మా
నందంబు గూర్ప గురుపద
వందన మొనరించి భూమిపతి యి ట్లనియెన్. ౬౦౪

క. కుండోధ్ను లైన దోగ్ధ్రీ
తండంబు సహస్రమిత్తు దానికిం బ్రతిగా,
నిండీ నందిని నా, కిదె
దండం బొనరింతు మీకు ధర్మాత్మ! గురూ! ౬౦౫

వ. వసిష్ఠుం డి ట్లనియె. ౬౦౬

క. ఇది హోమధేనువయ్యా!
యెది యిచ్చిన నేని యీయ నెల్లను దీనిన్,
మొదవులు వేయును నీవవి
కదలక నీయొద్దనె యుండఁ గావుత రాజా! ౬౦౭

వ. విశ్వామిత్రుం డి ట్లనియె. ౬౦౮

క. పదివేల నాల నిచ్చెద,
నది కాదే లక్ష యిత్తు, నశేష విత్తున్,
మొదవును దీనిం బుచ్చుము,
తుది వదలను దీని బల్మితో నే గొందున్. ౬౦౯

వ. వసిష్ఠుం డి ట్లనియె. ౬౧౦

క. నాయావు బలిమిఁ గొనఁగా
నే యిష్టంబైనఁ జేయుమీ యటు రాజా!
నాయిచ్చ దీని నీయను
వే యిచ్చిన నిచ్చితేని విత్తము నిన్నేన్. ౬౧౧

క. సాకల్యంబుగ మునివా
క్యాకర్ణించుచును గినిసి యాజ్ఞాపింపన్
వీఁకం గౌశికు ననుచరు
లాకర్షించిరి హఠాద్రయంబున మొదవున్. ౬౧౨

క. బలదర్పిత మగు కౌశికు
బలమునఁ గల బలియు రెల్ల బలసి తఱుముచున్
బలిమిన్ నందిని నూపిరి
సలుపంగానీక కట్ట సాగిరి పెలుచన్. ౬౧౩

క. వడఁకంగఁ దనువు, దొఱఁగం
జడిగా బాష్పములు, సురభి జాలి గొలుపఁగా
నడిగె వసిష్ఠుని నేటికి
విడిచితి విటు దివియ నన్ను వీర లటంచున్. ౬౧౪

క. ముని పల్కెఁ, దల్లి! నిన్నే
మనసా విడువంగ లేదు మఱి యీనృపుఁడే
నిను బల్మిఁ గొనెడి, నేనే
మొనరింపఁ గలాఁడ నతిథియోజితు నితనిన్. ౬౧౫

తే. మౌనివాక్యంబు లాలించి ధేను వపుడు
పొంగి రోషంబుతో దూఁకి చెంగు మనుచుఁ
గలఁగి పాఱఁగ మూఁగిన బలము లెల్లఁ
గ్రూరభంగి నొనర్చె హంభారవంబు. ౬౧౬

శా. ఆ హంభాపటుదారుణధ్వని దశాశాంతంబులన్ మ్రోయఁగా
నాహూతాగతులైనటుల్ మొదవుసర్వాంగాళి నొక్కుమ్మడిన్
సాహంకారులు ఘోరరాక్షసులు వర్మాస్త్రాయుధోదగ్రులై
యోహో యోఁగుఁ డటంచుఁ బుట్టిరి వడిన్ హుంకారగర్జోగ్రులై.

క. అందలు పుట్టిన సేనా
సందోహము కవిసి రాజుసర్వబలంబున్
గ్రమ్మందించి నిరవశేషం
బందించి విముక్తిఁ జేసె నా నందినినిన్. ౬౧౮

క. తనసేనపాటు గని కూ
రినవగ నేకాకి యగుచు నృపుఁడు కదలి నె
మ్మనమున క్షాత్రబలము ఛీ
యని తెగడుచు బ్రహ్మబలము నారాధించెన్. ౬౧౯

క. బహుకాలము ఘోరతపము
గహనంబునఁ జేసి వదలి క్షాత్రబలము దు
ర్గ్రహవిధి విశ్వామిత్రుఁడు
మహర్షి యయ్యెఁ దుది, దాని మాట యెఱుఁగవో! ౬౨౦

మ. ప్రభు! నీ విట్టివృథావిరోధము త్యజింపం బోలుఁ గాలాగ్నిస
న్నిభమై బ్రాహ్మణువల్కు చేయుఁ గులమున్ నిశ్శేషముం గావునన్

శుభమహా నీ విప్రు డేగి మానివరునంఘ్రుల్ వట్టి ప్రార్థించి నీ
కభియుక్తం బొనరించి కొన్న, మది నూహార్ల మాని బాలుం గొనన్.

క. దైవాధీనము జగ మని
భావించుచుఁ గరుణతోడ వర్తింపఁగ నౌ;
దైవమునఁ దృణము పవియౌఁ
జా వగును బులికిఁ గరికిని శశమశకములన్. ౬౨౨

క. బాలుఁ డనాథుఁడు నిర్ధనుఁ
డాలమునకు దుర్బలుండు నగు నర్భకుపై
నేల పగ, జాలి గొను మది,
నాలింపుము నాదుపల్కు; నతని విడువుమా! ౬౨౩

తే. వృద్ధమంత్రివాక్యంబులు విని వినీతుఁ
డై యుధాజితుఁ డాశ్రమంబందుఁ జొచ్చి
మానిపదపీఠి శిరసా నమస్కరించి
మరలి శాంతుఁడై నిజపురి కరిగె నిచ్చ. ౬౨౪

క. మన మంతటఁ గుదుటంబడి
మనోరమ కుమారు నాశ్రమంబున సాఁకన్,
మునిబాలురతో నాడుచు
ననుదినపరివర్థమానుఁ డయ్యె నతండున్. ౬౨౫

క. ఒకనాఁ డటు లాడెడు బా
లకు దరికి విదల్లుఁ డరిగి లాలింపఁగ, మా
నికొడుకు విదల్లుఁ దనయం
తికమునకున్ 'క్లీబ' యంచుఁ దిన్నన బిలిచెన్. ౬౨౬

తే. అది సుదర్శనుఁ డాలించి యల్ల క్లీబ
శబ్దమునఁ గల్గు మొదటి యక్షరముతోడ
బిందువుం గూర్చి శ్రీకృపాప్రేరితుఁ డయి
యాత్మ ధరియించి మఱిమఱి యనఁ దొడంగె. ౬౨౭

క. రాఁగల యోగమున యదృ
చ్ఛాగతమై కామరాజ మతనికి దొరకం
గాఁ గడు బాల్యంబున శ్ర
ద్ధాగౌరవముల నతండు దానిఁ గొనె నెదన్. ౬౨౮

క. వాఁ డైదేఁడులు నిండని
యీడున మంత్రంబు నేర్చె, ఋషివర్యం డే
వాఁడో, ఛందము న్యాసము
గో డేదో, ధ్యాన మేదొ గుఱుతు తెలియకే. ౬౨౯

క. నడచుచు నుడుగుచు నుఱుకుచుఁ
గుడుచుచుఁ గూర్చుండి నిదురఁ గూర్కుచుఁ గ్రీడం
గడపుచు నిత్యము మనమున
విడువక జపియించుఁ గామబీజము నతఁడున్. ౬౩౦

తే. పదునొకండవ యేఁట నృపప్రసూతు
నియతపథమున ముని యుపనీతుఁ జేసి
వేదమును సాంగముగ ధనుర్వేదయుతము
గను బఠింపించి దండనీతిని నొసంగె. ౬౩౧

క. ఎదలో నతనికి వదలక
పదిలంబై యున్న మంత్రబలమున వీఁకం
జదు వెల్ల నొదవె, దేవీ
పదభక్తుల కందరాని పదముం గలదే! ౬౩౨

ఉ. దేవి సమస్తభూషణసుదీపితయై, విహగేంద్రవాహన
శ్రీ విలసిల్లఁగా మెయిఁ ధరించిన యెఱ్ఱని పట్టుపుట్టపుం
గావి స్వకీయరక్తతనుకాంతులఁ బెంపఁ బ్రసన్నరూపరే
ఖావిభవాభిరామ యయి కన్నుల గట్టెను వాని కొక్కెడన్

మ. తనకుం దర్శన మిచ్చి నిల్చిన జగత్కల్యాణి నారాయణిన్
బ్రణతిం జేసి సుదర్శనుండు ప్రణుతింపం గామరాజాత్మగా

త్రుని (శ్రీ) కాంచి, శరాసనంబు శరముల్ తూణీరముం గంకటం
బును దివ్యంబు లొసంగి పెల్చనఁ జనెన్ మోదంబు పెంపొందఁగా.

శశికలాస్వయంవరము

క. కాశీరాజసుపుత్రిక
సౌశీల్యసులక్షణాఢ్య శశికల నా క
న్యాశిక్షామణి ప్రాభవ
పేశల రమణీయగాత్ర విలసిల్లు నిలన్. ౬౩౫

క. బందీజనములు దానికిఁ
దెందిచ్చిరి వార్త వనమునందు వసించుం
గందర్పమూర్తి శౌర్యపు
పందరుఁడు సుదర్శనాఖ్య రాట్సుతుఁ డంచున్. ౬౩౬

చ. శ్రవణముచే సుదర్శను విశాలవిలోచన యాత్మనాథుఁగా
ధ్రువమతియై వరించి పరితోషము మీఱఁ దదీయదర్శనం
బవు నెపు డంచు నుండ జగదంబిక యొక్కనిశావసానమం
దవిరళలీల స్వప్నగతయై కృప యొక్కెడి చూడ్కిఁ గన్పడెన్. ౬౩౭

క. ఆతల్లి యపుడు పల్కెన్,
నాతీ! యఖిలార్థశోభనం బగు నీకున్
బ్రీతి వరింపు సుదర్శను,
నాతఁడు మద్భక్తుఁ, డొప్పు నన్నిట నీకున్. ౬౩౮

శా. అంబామంగళదివ్యభవ్యమహనీయాకారముం గాంచి వా
క్యం బాలించి సుధాతరంగితము, స్వప్నాంతమ్మునన్ లేచి, వా
ర్షం బాకారము పొందినట్లు యయి వారంవారమున్ వాని స్వాం
తంబందున్ స్మరియించుచున్ మురిసి వింతం బొంగె నబ్బాలయున్.

క. దానియపూర్వామోదం
బానాఁ డూహింప కమ్మ యడిగె మతిమతిన్

క. రాఁగల యోగమున యదృ
చ్ఛాగతమై కామరాజ మతనికి దొరకం
గాఁ గడు బాల్యంబున శ్ర
ద్ధాగౌరవముల నతండు దానిం గొనె నెదన్. ౬౨౮

క. వాఁ డైదేఁడులు నిండని
యీడున మంత్రంబు నేర్చె, ఋషివర్యుం డే
వాఁడో, ఛందము న్యాసము
గో డేదో, ధ్యాన మేదొ గుఱుతు తెలియకే. ౬౨౯

క. నడచుచు నుడుగుచు నుడువుచుఁ
గుడుచుచుఁ గూర్చుండి నిదురఁ గూర్కుచుఁ గ్రీడం
గడపుచు నిత్యము మనమున
విడువక జపియించుఁ గామబీజము నతఁడున్. ౬౩౦

తే. పదునొకండవ యేఁట నృపప్రసూతు
నియతపథమున ముని యుపనీతుఁ జేసి
వేదమును సాంగముగ ధనుర్వేదయుతము
గను బఠింపించి దండనీతిని నొసంగె. ౬౩౧

క. ఎదలో నతనికి వదలక
పదిలంబై యున్న మంత్రబలమున పీఁకం
జదు వెల్ల నొదవె, దేవీ
పదభక్తుల కందరాని పదముం గలదే! ౬౩౨

ఉ. దేవి సమస్తభూషణసుదీపితయై, విహగేంద్రవాహన
శ్రీ విలసిల్లఁగా మెయి ధరించిన యెఱ్ఱని పట్టుపుట్టపుం
గావి స్వకీయరక్తతనుకాంతులఁ బెంపఁ బ్రసన్నరూప కే
ళావిభవాభిరామ యయి కన్నుల గట్టెను వాని కొక్కెడన్.

మ. తనకుం దర్శన మిచ్చి నిల్చిన జగత్కల్యాణి నారాయణిం
బ్రణతిం జేసి సుదర్శనుండు ప్రణుతింపం గామరాజాత్మగా

త్రుని (శ్రీ) కాంచి, శరాసనంబు శరముల్ తూణీరముం గంకటం
బును దివ్యంబు లొసంగి పెల్చెనఁ జనెన్ మోదంబు పెంపొందఁగా.

## శశికళా స్వయంవరము

క. కాశీరాజసుపుత్రిక
సౌశీల్యసులక్షణాఢ్య శశికల నాఁ గ
న్యాశీర్ష మణి ప్రాభవ
పేశల రమణీయగాత్ర విలసిల్లు నిలన్. ౬౩౫

క. బందీజనములు దానికి
నందిచ్చిరి వార్త వనముసందు వసించుం
గందర్పమూర్తి శౌర్యపు
రందరుఁడు సుదర్శనాఖ్య రాట్సుతుఁ డంచున్. ౬౩౬

చ. శ్రవణముచే సుదర్శను విశాలవిలోచన యాత్మనాథుఁగా
ధ్రువమతియై వరించి పరితోషము మీఱఁ దదీయదర్శనం
బవు నెపు డంచు నుండ జగదంబిక యొక్కనిశావసానమం
దవిరళలీల స్వప్నగతయై కృప నొల్కెడి చూడ్కిఁ గన్పడెన్. ౬౩౭

క. ఆతల్లి యపుడు పల్కెన్,
నాతీ! యఖిలార్థశోభనం బగు నీకున్
బ్రీతి వరింపు సుదర్శను,
నాతఁడు మద్భక్తుఁ, డొప్పు నన్నిట నీకున్. ౬౩౮

శా. అంబామంగళదివ్యభవ్యమహనీయాకారముం గాంచి వా
క్యం బాలించి సుధాతరంగితము, స్వప్నాంతమ్మునన్ లేచి, హ
ర్షం బాకారము పొందినట్లు యయి వారంవారమున్ దాని స్వాం
తంబందున్ స్మరియించుచున్ మురిసి వింతం బొంగె నబ్బాలయున్.

క. దానియపూర్వామోదం
బానాఁ డూహింప కమ్మ యడిగె మఱిమఱిన్

దీనికిఁ గారణ మేమని
కాని త్రపాభరమునఁ బలుకద రవంతేన్. ౬౮౦

వ. శశికలయు సుదర్శనాయత్తచిత్తయై యేకాంతంబున నిట్లు తలపోసె.

సీ. అరుణభూషామాలికాంబరంబుల నంబ
చిత్రితం బయ్యె నాచిత్తభిత్తిఁ,
బూర్ణేందుకౌముదీ పూర్ణహాసప్రభ
వెలుఁగొందు నామనోనిలయ మెల్ల,
నుద్యదాదిత్య సముల్లాసితనుకాంతి
వికసించె హృదయాబ్జవీథి మిగుల,
బాణాసనోజ్జ్వల పంచసాయక రేఖ
హత్తియున్నది మదీయాంతరంగ,

మమృతపుంజల్లు వోని పరాంబపలుకు
శ్రవణపుటముల జలజల జాలువాఱు,
బలిమి నాకృష్టమై పరవశత నొంది
యాత్మ విలసిల్లెడి సుదర్శనార్పిత మయి. ౬౮౧

క. కలలోఁ గాంచిన దేవిం
దలపోయుఁన్, మరల, నా సుదర్శనుఁ దలఁచున్,
బులకించును మురిపెంబునఁ,
దిలకించును మొగము నిండఁ దీయనినగవుల్. ౬౮౩

క. ఒకచెలికిమాత్ర నుడివెను
సకలంబగు స్వప్నకథయు శశికల తమియై;
నొకనాఁడు వార లిద్దరు
వికసిత చంపకవనాంత విహరణ పరలై. ౬౮౪

క. ఉపవనమునఁ గుసుమంబుల
నపచయ మొనరించువేళ నా బాలిక లం

మసలక్షించెరె సంకర
విప్రాజమునిచేఁ జనెనీ విప్రోత్తమునన్. ౬౨౫

క. అక్కజమగు శశికల కని
(మొక్కి యడిగె వాని మధురముగ్రంబుగ, నీ
వెక్కడి వాఁడవు? ద్విజ!
యెక్కడికేఁగెదవు వేగ మిట్టు? లటంచున్. ౬౨౬

తే. ఆమహాత్ముఁడు పల్కెఁ బద్మాక్షి! యిట్టు,
లల భరద్వాజునాశ్రమంబందునుండి
వచ్చుచున్నాఁడఁ గార్యార్థపరుఁడ నగుచు,
నేమి వినఁగోరెదో తెల్పు మిందువదన! ౬౨౭

క. అది విని శశికల యడిగెను
ముదితమతిం దెలుపు మిందుఁ బుడమి నప్రాస్వం
బౌది కలదు వర్ణనీయము
సుదర్శనీయము విశేష శోభాన్వితమున్. ౬౨౮

తే. చిఱునగవు నాట్యమాడ భూసురుఁడు పలికె,
నందు వసియించుఁ జామి ధ్రువసంధిపుత్రుఁ
డగు సుదర్శనబాలుఁ డన్వర్థనాముఁ,
డతఁడు పురుషోత్తముండు రూపాన్వితుండు. ౬౨౯

శా. ఏలా వానిమనోహరాకృతివిధం బీక్షింపకున్నం గనుల్?
బాలా! ధాత గుణంబు లెల్ల నొకచో భాసిల్ల సృష్టించె నాఁ
బోలున్ వానిని, వాఁడె నీకుఁ దగు నా వో భర్త గా నుండఁగా,
మేలై సన్మణికాంచనాప్తి యువ లెన్ మీ యోగ మొప్పారెడున్.

క. అటు వల్కి యా మహీసురుఁ
డెటు నేఁగెం జనియెఁ గార్య మెక్కడఁ గలదో,
యిట శశికలకున్ మరు లు
త్కటమై విలసిల్లె నా సుదర్శనుమీఁదన్. ౬౩౦

చ. మదనుఁడు ధూర్తుఁడై యతివమానసముం గిలకొట్టి బేలవై
వదనము వాడ నుస్సు రని వాల్చుచు మాటికిఁ బ్రాణపుంజెలిన్
గదియఁగ జేరి యేకతమ కన్నులఁ గూరఁగ నశ్రువారి గ
ద్గదిక యెసంగ శ్రావ్యతరకంఠమునన్ విలపించె నీ గతిన్. ౬౫౨

మ. చెలియా! నాగతి యేమి? నామది చలించెన్, దేహతాపంపుటు
గ్గలికన్ వేఁచెడిఁ జందనంబు విషసంస్కారంబుగాఁ, బూలదం
డలు వ్యాళంబులు గాఁగఁ, గౌముదులబృందం బగ్నికీలోపమం
బులుగా, రేలుఁ బవళ్ళు శాంతియు సుఖంబున్ శూన్యమయ్యెం గదే!

ఉ. సౌధతలంబునందు సుఖసంస్థితి గానక కేలిదీర్ఘికా
రోధముఁ జేరఁబోవుదు, మఱుక్షణ మచ్చటఁ దోపకుంటమిన్
భూధర మాశ్రయింతు, నటఁ బోవమిఁ బ్రొద్దు, విహారవాంఛమై
సౌధవనంబు సేరుదును, స్వాస్థ్యము గల్గ దొకింత యెందునన్.

క. గీతావాదనములు శ
య్యా తాంబూల ప్రముఖ సమగ్ర సుఖంబుల్
నాతాపము తీర్పవు ప్రే
మాతురనై స్వప్నపురుషు నాత్మ మలసెడిన్. ౬౫౫

తే. ఆభరద్వాజు నాశ్రమం బాశ్రయింప
నుత్సహింతును, కులలజ్జ యొప్పకుండు,
జనకుఁడు స్వయంవరమె నాకుఁ జాలె నేని
యాత్మఁ గావించెద సుదర్శనార్పణంబు. ౬౫౬

ఉ. ఎందరు లేరు క్షత్రియు లహీనపరాక్రము లిద్ధతేజు ల
స్పందయశోవిభూషణులు భావజసుందరులైనఁ గాని నా
డెందము కానలో నలమటించుచు రాజ్యపదప్రణష్టుఁడై
డిందు సుదర్శనున్ విడువలేదు క్షణంబు బలావకృష్టమై. ౬౫౮

క. ఏకాకియు నిర్ధనుఁడు న
నీకసహాయవిరహితుఁడు నిరతవిపినభూ

న్యేకాంతవాసి మూఁడ
రైకాహోరములు సుదర్శనాఖ్యుఁడై నచ్చెన్. ౬౫౮

క. నింహారిన వార్చిజా
ఖండజపమ్మున రేకెకల కనఁ దద్వాత్, మా
తండున్ మఱునాఁటి విడువక
యుండె నహర్నిశము తజ్జపోద్యుతుఁ డగుచున్. ౬౫౯

మ. అతఁ డశ్రాంతము ధ్యానతత్పరత దేవ్యాకారసందర్శని
త్రత నుండం గనఁ జాలు స్వప్నమునఁ బ్రత్యక్షంబుగా దేవి వి
శ్వతతాకారిత విష్ణుమాయ సకలైశ్వర్యప్రదన్ శ్రీ సఖం
డిత నవ్యక్తను విశ్వసూతి నపరన్ దీప్తప్రభావిగ్రహన్. ౬౬౦

ఉ. ఆతఁడు రాజపుత్రుఁ డగు టాత్మ నెఱింగి యుపాయనంబుగాఁ
బ్రీతి నిషాదనాథుఁడు నివేదనచేసె రథోత్తమం బొకం
డాతతయుద్ధసాధనసమన్వితమున్ ధ్వజరత్నశోభితం
బై తనరారి నాలుగు హయంబులు పూన్చినదాని జైత్రమున్.

తే. దానిని సుదర్శనుండు మిత్రత్వబుద్ధి
స్వీకరించి పూజించెను శృంగిబేర
పురవరాధిపు శంబరుఁ గరముఁ బ్రీతి
వన్య మూల ఫలాది సంపత్తి నిగుడ. ౬౬౧

సీ. అతిథిసత్కృతిఁ బొంది యటు నిషాదవిభుండు
సనినంతఁ బల్కిరి మునులు దరిసి,
రాజపుత్ర! ధ్రువంబు రాజ్యంబు ప్రాపింతు
వచిరంబ నీప్రతాపాశ్రయమున,
విశ్వమోహిని యంబ వీక్షించు నినుఁ గటా
క్షేక్షణంబుల భవత్పక్ష మూని
వరదాత్రియై యుండు, సరిలేని సాహాయ్య
సంపత్తి యబ్బె, విచారపడకు,

వనుచు మఱి సంశ్రితవ్రతు లైన పూని
వన్యు లనిరి మనోరమావనితఁ గాంచి,
శుచిసితస్మిత! నీబిడ్డ సువ్రతుం డి
దే ధరాధీశుఁ డగు శీఘ్రమే యటంచు. ౬౬౩

చ. అది విని పల్కె నాసతి, తథాస్తు మదీయకుమారకుండు మీ
పదవరివస్య నేమఱఁడు, భావితమంత్రులు మీరు, వీని కే
యదియు బలంబు కోశము సహాయులు ప్రెగ్గడ లేని లేర, బొం
కొదవని మీదువాక్కుల శుభోదయ మీతనిఁ జెందు టబ్రమే!

క. ఆ తే రెక్కె సుదర్శనుఁ
డేఁతేరం జూడఁ జోద్య మెన్నఁగ నొక్కం
డాతం డక్షౌహిణికో
పేతుం డయినట్లు తోఁచు విస్ఫుటకాంతిన్. ౬౬౪

మ. అది యాతండు జపించుమంత్రబలమే యౌఁగాక, కా దన్యథా
మదిఁ జింతింపు నరేంద్ర! సద్గురుఁడు నేమం బొప్ప దీక్షింపఁగా
నది లబ్ధంబయి నిష్ఠ నెల్లపుడు శౌచాత్ముండు శాంతుండు నై
హృది భావించెడు భాగ్యశాలి కిలపై నేముండు నప్రాప్యముల్ ?

క. ఎవ్వారికిఁ జిత్తంబుల
నివ్వటిలదొ యంబపూజ నిష్ఠ ధ్రువంబై
యవ్వారే దౌర్భాగ్యులు
నివ్వసుధన్ మందమతులు నీతివ్యథితుల్. ౬౬౫

ఉ. ఆదిమమాతగా నెది యుగాదిఁ బ్రకీర్తిత యయ్యె, సర్వదే
వాదిగ నాపరాంబఁ గనులారఁ గనందగు జీవకోటి, శ్ర
ద్ధోదయ మెందు, లక్ష్మి యెటనో, స్మృతియెయ్యెడఁ, గీర్తి యెందు, నే
యేదరి మేధ, శక్తి ధృతు లేకడ, సన్మతి యేడఁ గానసౌ! ౬౬౬

శా. మాయామోహితులై కుతర్కజనితోన్మాదంబునం గాక మే
ధాయుక్తుం డెవఁ డాపరాంబిక జగత్సర్గావనోన్నాశకృ

